# ఆంధ్రప్రదేశ్‌లో పన్నెండేండ్ల అభివృద్ధి

| విషయం | 1956 | 1968 |
|---|---|---|
| రాష్ట్ర రివిన్యూ | రు. 3843.82 లక్షలు | రు. 17165.73 లక్షలు |
| **విద్యుచ్ఛక్తి:—** | | |
| ఉత్పత్తి ... | 277 మిలియన్ కిలోవాట్లు | 1921 మి. కి. వాట్లు |
| వ్యవసాయానికి వినియోగం ... | 11. మి. కి వాట్లు | 106 మి కి వాట్లు |
| పరిశ్రమలకు వినియోగం ... | 142 మి. కి వాట్లు | 539 మి కి. వాట్లు |
| విద్యుచ్ఛక్తి పొందిన గ్రామాలు ... | 1313 | 5990 |
| **వ్యవసాయం:-** | | |
| విత్తనాల సరఫరా ... | 59`` టన్నులు | 15462 టన్నులు |
| ఎరువుల సరఫరా ... | 1.20 లక్షల టన్నులు | 7 లక్షల టన్నులు |
| వ్యవసాయ ఋణాలు ... | రు 1100 లక్షలు | 3900 లక్షలు |
| వరిపంట ... | 33 లక్షల టన్నులు | 44 లక్షల టన్నులు |
| కాయధాన్యాలు ... | 55 ,, | 66 ,, |
| **పరిశ్రమలు:-** | | |
| భారీ, మధ్యతరహా పరిశ్రమలు ... | 53 | 143 |
| కార్మికులు ... | 35000 | 87700 |
| **విద్య:-** | | |
| ప్రభుత్వం చేసిన ఖర్చు ... | రు. 672 లక్షలు | రు 3283 లక్షలు |
| మొత్తం విద్యార్థులు ... | 30 లక్షలు | 48 లక్షలు |
| **ఆరోగ్యం:-** | | |
| ఆసుపత్రులు, వైద్యాలయాలు ... | 396 | 1127 |
| బయటవుండి చికిత్స పొందిన రోగులు___ | 225 లక్షలు | 866 లక్షలు |
| ఆసుపత్రులలో చేరి చికిత్సపొందిన రోగులు ... | 19 లక్షలు | 41 లక్షలు |
| **సాంఘిక సంక్షేమం:-** | | |
| స్త్రీ-శిశు సంక్షేమం కొరకు ఖర్చు | కేటాయింపు లేదు | రు. 33 లక్షలు |
| షెడ్యూలు జాతుల సంక్షేమం | రు. 130 లక్షలు | రు 281 లక్షలు |
| షెడ్యూలు తెగల సంక్షేమం ... | కేటాయింపు లేదు | రు. 86.50 లక్షలు |

# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 13 ]
నవంబరు - 1968
కార్తీక–అగ్రహాయన – 1890 శా.శ.
[సంచిక: 1

ప్రధాన సంపాదకులు
బి. కె. రావు, ఐ. ఏ. యస్.

సంపాదకులు
ఎన్. వి. గోపాలశాస్త్రి

## ఈ సంచికలో....

మొదటి అట్ట : విజయవాడలోని గాంధీకొండమీద నిర్మించిన స్థూపం.
—ఫొటో : నందగోపాల్

రెండవ అట్ట : ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధి

మూడవ అట్ట : నాగార్జునసాగర్‌వద్ద నెహ్రూ విగ్రహం
—ఫొటో : ఎస్. ఎన్. ఆచంట; ఐ. ఏ. ఎస్.

నాలుగవ అట్ట : విజయవాడ పట్టణం
—ఫొటో : నందగోపాల్

[ ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు — సం ]

పేజీ



# నిరంతరంగా పరిశ్రమిద్దాం!

— గవర్నరు ఉద్బోధ

పన్నెండేళ్ళక్రితం సరిగ్గా నవంబరు ఒకటో తేదీన, దక్షిణాదిన తెలుగు వారందరినీ ఒకే ఛత్రం క్రిందకు తీసుకొస్తూ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటైంది. ఆనాటినుండి మనం పంచవర్ష ప్రణాళికలద్వారా అభ్యుదయానికీ, ఐశ్వర్యానికీ ఆలవాలమైన సుందర భవిష్యత్తువైపు ప్రయాణాన్ని సాగిస్తున్నాం.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రకృతి వనరులు అపారంగావున్నాయి. మన దేశంలోని ఐశ్వర్యవంతమైన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. గోదావరీ, కృష్ణానదులు, అసంఖ్యాకమైన వాటి ఉపనదులు ఆంధ్రప్రదేశ్ సీమలను తడిపి సస్యశ్యామలం చేయడమేగాక విద్యుచ్ఛక్తిని భారీ ఎత్తున అందించి కాంతి విలసితంకూడా చేస్తున్నాయి. అనేక పరిశ్రమలు రాష్ట్రంలో తలెత్తి రాష్ట్ర ప్రజల ఆర్థిక స్థితిగతులను మెరుగుపరచడమేగాక అనేకమందికి లాభసాటియైన ఉపాధినికూడా కల్పించాయి.

అయితే, యీ ఏడాది ప్రకృతి మనమీద ఆగ్రహం వహించింది. ఈ ఏడాది సకాలంలో వర్షాలు కురవక రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో కరువు పరిస్థితులు ఏర్పడడం మీకందరకూ తెలుసుకదా. దీనివల్ల మన ఆర్థిక వ్యవస్థ బాగా తారుమారైంది. అయితే రాష్ట్రంనుంచి శాశ్వతంగా యీ కరువు రక్కసిని తరిమికొట్టడానికై మన రాష్ట్రప్రభుత్వం అప్పుడే అనేక తాత్కాలిక చర్యలనూ, దీర్ఘకాల చర్యలనూ అమలుపరచడం ప్రారంభించింది.

అభ్యుదయాన్నీ, అభివృద్ధినీ లక్ష్యంగా పెట్టుకొని మనంచేస్తున్న యీ ప్రగతి గమనం యిటుపై మరింత ఉత్సాహంతో, చైతన్యంతో, వేగంతో కొనసాగవలసివుంది.

కుల, మత, భాషా ప్రమేయం లేకుండా కలిసికట్టుగా, సమైక్యంగా వుండడానికి మనం కృషిచేయాలి. మనలోని లోపాలను ప్రక్షాళనం చేసుకుని పరిశుద్ధులం కావడానికి ఆత్మావలోకనం చేసుకోవలసిన సమయం యిదేనని నేను భావిస్తున్నాను.

కుల, మత, వర్గప్రమేయం లేకుండా పౌరులందరికీ సమానావకాశాల్ని కల్పించే ప్రాతిపదిక పునాదులమీద సోషలిస్టు తరహా సమాజాన్ని నిర్మించాలని గట్టిగా నిశ్చయించుకున్నాం. మన సమాజంలో అట్టడుగునవున్న హరిజనులు, గిరిజనుల అభ్యుదయానికి నిరంతరంగా మనం పరిశ్రమించవలసివుంది. సమాజంలో నిక్షిప్తమైవున్న యీ మానవ శక్తి సక్రమంగా వినియోగింప బడినప్పుడు దేశంలో శాంతి, సంపదలు అంతటా వెల్లివిరియగలవు.

ఈ ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ శుభసమయంలో, ఆంధ్రప్రదేశ్ ప్రజలు యీ లక్ష్యసాధనకు నిరంతరంగా పరిశ్రమించేందుకు మరొకసారి కంకణం కట్టుకోగలరని విశ్వసిస్తున్నాను. తమ జీవన ప్రమాణాన్ని మెరుగుపరచుకోవడానికీ, రాష్ట్ర అభ్యుదయానికీ, దేశాభ్యుదయానికీ దోహదంచేసే లక్ష్యసాధనకు సమిష్టిగానూ, సమైక్యతతోనూ పురోగమించగలరని నేను నమ్ముతున్నాను.



# నిరాటంకంగా పురోగమిద్దాం

*ముఖ్యమంత్రి సందేశం*

1968 నవంబరు మొదటి తేదీన ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం సందర్భంగా ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ఈ దిగువ సందేశం యిచ్చారు :

"ఆంధ్రప్రదేశ్ అవతరణ వార్షికోత్సవం సందర్భంగా గత అనుభవాలనూ, నేటి పరిస్థితినీ, భవిష్యత్తులో మన కర్తవ్యాలనూ గురించి ఆలోచించుకోవడం సహజం. పదిహేను సంవత్సరాల క్రితం దక్షిణాదిలో ఒక క్రొత్త రాష్ట్రం ఏర్పడింది. ఆంధ్రుల అభీష్టానికీ, వారి రాజకీయ భావాలకూ చిహ్నంగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఆవిర్భవించింది. ఆంధ్రుల వాంఛ నెరవేరింది. ఎంతో కాలంగా ఎదురుచూసిన వారి ఆశలు ఫలించాయి. తమ భవిష్యత్తును తామే తీర్చిదిద్దుకునే సదవకాశం వారికి లభించింది.

"ఈ లక్ష్యంతోనే పంచవర్ష ప్రణాళికల ద్వారా పునర్నిర్మాణ కృషిని మనం ప్రారంభించి చాలావరకు విజయవంతంగా పురోగమించాం. ఇంతవరకు అమలు జరిగిన మూడు పంచవర్ష ప్రణాళికల ఫలితాలను పరిశీలిస్తే మనం ఘనమైన విజయాలు సాధించినట్లూ, మన కృషికి తగిన ఫలితాలు లభించినట్లూ స్పష్టమవుతుంది. తానొకటి తలిస్తే దైవమొకటి తలచినట్లు, ఒక్కొక్కప్పుడు ప్రకృతి శక్తులు మానవుని కృషికి వ్యతిరేకంగా పని చేస్తుంటాయి. భారత దేశంలో చాలా ప్రాంతాలలో – ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో–యిటీవల వరుసగా కరువు పరిస్థితులు ఏర్పడిన కారణంగా మన రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ దెబ్బతిన్నది. అయినా అడ్డంకులకు భయపడకుండా, కరువు పరిస్థితులను అధిగమించడానికి మనం స్వల్పకాలిక, దీర్ఘకాలిక పథకాలను త్వరితగతితో అమలు జరపడం ప్రారంభించాము.

"నాలుగో పంచవర్ష ప్రణాళికను మనం అమలుపరుచుకోబోతున్నాం. దేశంలో స్వయంశక్తి పూరితమైన ఆర్థిక వ్యవస్థను నిర్మించుకోడానికి నాలుగో ప్రణాళిక మార్గం ఏర్పరుస్తుంది. ఈ లక్ష్యం చూడడానికి ఆకర్షణీయంగానే వుంటుంది కాని సాధించడం సులభమైన పనికాదు. దానికోసం మన యావత్తు శక్తి సామర్థ్యాలూ ధారపోయడం అవసరమవుతుంది.

అందువల్ల "మన రాష్ట్రాన్ని, మన దేశాన్ని మన తరంలోనే పటిష్ఠం చేసుకోవాలనే" ఏకైక లక్ష్యంతో అందరం ఒకే మాటగా, ఒకే బాటగా భుజం భుజం కలిపి కృషి చేస్తామని యీ శుభ సమయంలో ప్రతిజ్ఞ చేద్దాం."



# ఆంధ్రప్రదేశ్ లో పన్నెండేళ్ళ అభ్యుదయం

— సి. వి. హెచ్. రావు

ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తర్వాత యీ 12 సంవత్సరాలలో జరిగిన కృషిని సమీక్షించినప్పుడు అది త్వరితగతిని పురోభివృద్ధి చెందుతున్నదని ఘంటాపథంగా చెప్పవచ్చు. 1974 తో అఖరు అయ్యే నాలుగవ ప్రణాళికను అమలుపరచడంలో ఎటువంటి ఆటంకాలు లేకుండా సవ్యంగా నిర్వహించబడినప్పుడు యీ రాష్ట్రం సుసంపన్నం కావడమేగాక తలసరి ఆదాయం, రాష్ట్ర ఆదాయం విషయాలలో భారతదేశంలోని యితర రాష్ట్రాలతో సమాన స్థాయిని అందుకో గలుగుతుంది. ఇలా చెప్పడానికి తగిన ఆధారాలు ఉన్నాయి. అయితే గత మూడు ప్రణాళికలలో అమలు జరిపిన పనుల ఫలితాలను యికనుండి అనుభవించగలం. అంత మాత్రాన యిక ముందు మనం చేయాల్సింది యేమీలేదని గానీ, అన్నీ సవ్యంగానే ఉన్నాయనిగానీ భావించడానికి వీలులేదు. కొన్ని రంగాలలో జరిగిన లోపాలు సరిదిద్దడం, ఒనగూడిన లాభాలను సమీకరించడం, రాష్ట్రంలోని బడుగు ప్రాంతాలను అభివృద్ధి చెందిన ప్రాంతాల స్థాయికి తేవడం ఆర్థిక అభివృద్ధితో సమానంగా సాంఘికాభివృద్ధికి పాటుపడడం వంటి విషయాలలో నిరంతర కృషి జరగాల్సి ఉంది.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక రంగంలో యిప్పటికీ వ్యవసాయమే ప్రాధాన్యత వహిస్తున్నది. అంతేగాక రాష్ట్ర ఆదాయంలో ఎక్కువ భాగం భూమి శిస్తుద్వారా, వ్యవసాయ ఉత్పత్తుల క్రయ విక్రయాల ద్వారా లభిస్తున్నది. వ్యవసాయంపై ఆధారపడిన ఆర్థిక పరిస్థితిని బడుగు స్థితిగా భావించాల్సిన అవసరం లేదు. వ్యవసాయంలో ఆధునిక శాస్త్రీయ సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించి దానిని లాభదాయకంగా ఉపయోగించుకోవచ్చు. తీవ్రతర వ్యవసాయ పథకాల అమలుద్వారాను, భూమిని అభివృద్ధి పరచడం ద్వారాను అధికోత్పత్తి సాధించి తరుగు రాష్ట్రాల ఆహార అవసరాలను తీరుస్తూ ఆహార రంగంలో భారతదేశాన్ని స్వయం సమృద్ధి చేయవచ్చు.

## వ్యవసాయంలో ప్యాకేజి పథకాలు

గత కొన్ని సంవత్సరాల కాలంలో వ్యవసాయ పరిశ్రమను ఆధునీకీకరించడానికి ఫలప్రదంగా కృషి జరుగుతున్నది. 1966 నుండి అధిక దిగుబడి రకాల కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నప్పటినుండి వ్యవసాయ రంగంలో ప్యాకేజి పథకాన్ని అమలు జరుపుతూ ఎకరా దిగుబడిని అధికం చేయడానికీ, నీటి పారుదల సౌకర్యాలు ఎక్కువ చేయడానికి తీవ్రంగా కృషి జరుగుతున్నది. ఈ కృషి ప్రయోగాత్మకంగా పశ్చిమ గోదావరి జిల్లాలో జరుగుతున్నప్పటికీ రాష్ట్రంలోని యితర జిల్లాలకు కూడ సవరించబడిన రూపంలో యీ కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు. ఈ పథకం క్రింద రైతులకు అవసరమైన ఎరువులు, మేలిరకం విత్తనాలు, ఆధునిక పరికరాలు, క్రిమి సంహారక మందులు, స్వల్ప కాలిక ఋణాలు మొదలైన వాటిని విస్తృతంగా అందజేస్తున్నారు.



ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థకు మూలాధారం - మన పంటసీమలు

రాష్ట్రంలో వివిధ వ్యవసాయ అభివృద్ధి పథకాల అమలు ఫలితంగా 1956 లో ఉన్న 57.99 లక్షల టన్నుల ఉత్పత్తి 1967_68 నాటికి 62.12 లక్షలకు పెరిగింది. 1964_65 లో వ్యవసాయ ఉత్పత్తులు 75.82 లక్షల టన్నులకు చేరింది. అయితే మధ్యకాలంలో రెండు సంవత్సరాల పాటు వర్షాభావంవల్ల పరిస్థితి నిరాశా జనకంగాను, అసంతృప్తికరంగాను పరిణమించింది.

కరువు పరిస్థితులను ఎదుర్కొవడానికి ఒకవైపు తాత్కాలిక సహాయ కార్యక్రమాలు అమలు జరుపుతూనే మరోవైపు అనిశ్చిత ఋతు పరిస్థితులను తట్టుకోవడానికి శాశ్వత ప్రాతిపదికపై చర్యలు తీసుకుంటున్నారు. ఈ కార్యక్రమాల అమలు ఫలితాలు అనుభవానికి వస్తున్న తరుణంలోనే, 1968 లో తిరిగి అనావృష్టి పరిస్థితులు నెలకొన్నాయి. బృహత్తర కార్యక్రమాన్ని అమలుపరిచేందుకు యీ పరిస్థితిని వినియోగించాలి.

కరువు నిరోధక కార్యక్రమాలను వివిధ ప్రాంతాలలో వివిధ రీతులలో అమలు జరుపుతూ అధికోత్పత్తికి కృషి చేస్తున్నారు. వాటిలో ప్రధానమైనది కరువు పరిస్థితి తీవ్రంగా ఉన్న ప్రాంతాలలో గొట్టపు బావులు, బోరింగ్ బావులు, చెరువుల వంటి చిన్న తరహా నీటి పారుదల వనరుల అభివృద్ధికి చర్యలు తీసుకోవడం. ఈ చర్యలన్నిటి ఫలితంగా కరువు ప్రాంతాలలో పరిస్థితి మెరుగు పడడానికి అవకాశం ఉంది. సేద్యపు నీరు, మంచినీటి కొరతను నివారించడానికి భూగర్భ జలాల వినియోగానికి ప్రయత్నాలు తీవ్రంగా జరుగుతున్నాయి. ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వం, అంతర్జాతీయ సంస్థలు అందజేస్తున్న సహాయాన్ని పూర్తిగా వినియోగించుకోవాలి.

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయాభివృద్ధికి మరో రెండు అంశాలు కూడ దోహదం చేస్తాయి. గ్రామీణ విద్యుదీకరణను త్వరితగతిని విస్తరింపజేయడం, పంపుసెట్లు, బోరింగ్ బావులు, గొట్టపు బావులు మొదలైన వాటికీ, వ్యవసాయ ప్రయోజనాలకూ విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడం అవసరం. స్థాపిత విద్యుదుత్పాదక శక్తిని ఎక్కువ చేయడంద్వారా గ్రామీణ విద్యుదీకరణ కార్యక్రమాన్ని చురుకుగా అమలు జరుపుతున్నారు. 1957 లో 936 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయగా, 1968 లో 5000 గ్రామాలకు సరఫరా చేశారు. గ్రామీణ విద్యుద్దీకరణలో ప్రధాన భాగంగా 1966 లో 9150 పంపుసెట్లు నెలకొల్పబడగా 1967 నాటికి సంఖ్య 20,000 కు పెరిగింది. 1968_69 లో 30,000 సెట్లకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయాలని ఉద్దేశించారు.



ఎగువ సీలేరు విద్యుదుత్పాదక కేంద్రం

## వ్యవసాయ-పారిశ్రామిక కార్పొరేషన్

వ్యవసాయోత్పత్తులు, పశు సంపద ప్రాతిపదికగా లఘు పరిశ్రమలను అభివృద్ధి చేయడం, వ్యవసాయంలో ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టి, తద్వారా దిగుబడిని అధికం చేయడం, ఆధునిక వ్యవసాయ పరికరాల్ని తయారు చేయడం, వాటిని సరఫరా చేయడం_ఇవి ప్రధాన లక్ష్యాలుగా వ్యవసాయ_పారిశ్రామిక కార్పొరేషన్ ఏర్పాటు చేయబడింది. నాలుగవ ప్రణాళికా కాలంలో గ్రామీణ ఆర్థిక రంగంపై దీని ప్రభావం ప్రసరించాల్సి ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లో గత కొన్ని సంవత్సరాలుగా పారిశ్రామిక అభివృద్ధి పురోగమన మార్గంలో ఉన్నప్పటికీ కొంత వరకు మందకొడిగానే ఉన్నదని చెప్పాలి 1956 లో 100 పాయింట్లు ప్రాతిపదికగావున్న పారిశ్రామిక ఉత్పత్తి సూచీ సంఖ్య 1963 లో 161, 1965 లో 240, 1966 లో 214, 1967 లో 218 కు ఉంది. 1965 లో ఉత్పత్తి గరిష్ట స్థాయికి చేరుకున్నది. వ్యావసాయకంగా ఆ సంవత్సరం అనుకూలంగా ఉంది. రెండవ ప్రణాళికా కాలంలో సాలీనా సగటు ఉత్పత్తి 12.1 శాతం, మూడవ ప్రణాళిక మొదటి నాలుగు సంవత్సరాలలో 12.6 శాతానికి పెరిగింది.

## పారిశ్రామిక విధానం

గత కొన్ని సంవత్సరాలుగా రాష్ట్ర పారిశ్రామిక విధానాన్ని స్పష్టంగా వివరించడం జరిగింది. పరిశ్రమలకు ప్రోత్సాహం కలిగించే విధంగా రెండవ పంచవర్ష ప్రణాళిక ఆఖరులో భారీ, మధ్యరకం పరిశ్రమలకు, లఘు పరిశ్రమలకు, గనులకు వేర్వేరుగా కార్పొరేషనులను ఏర్పాటు చేసి, ఆయా పరిశ్రమల అభివృద్ధికి బాటలు వేశారు. ఈ కార్పొరేషన్‌ల ద్వారా వాటికి ఆర్థిక సహాయం అందజేస్తున్నారు. అంతేగాక పరిశ్రమలకు అవసరమైన విద్యుచ్ఛక్తి సరఫరా చేయడానికి వీలుగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని ఎక్కువ చేసేందుకు కృషిచేస్తున్నారు. పరిశ్రమలను ఎక్కువ సంఖ్యలో నెలకొల్పడానికి వీలుగా విద్యుచ్ఛక్తి, అనువైన స్థలాలు, నీరు, రవాణా సౌకర్యాలు, సాంకేతిక పరిజ్ఞానం, ముడి పదార్థాలు మొదలైనవి సరఫరా చేస్తున్నారు.

రాష్ట్రంలో పారిశ్రామిక అభివృద్ధి, వ్యవసాయంపై ఎక్కువగా ఆధారపడి ఉంది. రాష్ట్రంలో నెలకొల్పబడిన, లేదా నెలకొల్ప



పారిశ్రామికాభివృద్ధికి దోహదంచేసే చెరకుపంట

బడుతున్న పరిశ్రమలు–వరి, ప్రత్తి, వేరుశనగ, చెరకువంటి వ్యవసాయ ఉత్పత్తులపై ఆధారపడి ఉన్నాయి. కొన్ని పరిశ్రమలు ఖనిజసంపద, బొగ్గు, నీటివనరులపై ఆధారపడి ఉన్నాయి.

పారిశ్రామిక విధానం త్వరితగతిని ఫలప్రదం కావడానికి వీలుగా చిన్న పారిశ్రామికులకు, పెట్టుబడి ఋణాలు, లైసెన్సులు పొందడంలో సహాయం, అవసరమైన యంత్రపరికరాల దిగుమతి సౌకర్యం, ముడిపదార్థాల సరఫరా, దేశవ్యాప్తంగా మార్కెటింగ్ వసరులవంటి వివిధ సౌకర్యాలు కలిగించి ప్రోత్సహించాలి.



భారత్ భారీ పరికరాల కర్మాగారంలో తయారైన ఎయిర్ బ్లాస్ట్ సర్క్యూట్ బ్రేకర్

ఇప్పటి వరకు రాష్ట్ర ప్రభుత్వం అందజేస్తున్న ప్రోత్సాహం, సహాయాలను గూర్చి విరివిగా ప్రచారం చేయాలి. లఘుపరిశ్రమల విస్తరణ శిక్షణ సంస్థ, జాతీయ లఘుపరిశ్రమల సర్వీసు సంస్థల సేవలను ప్రయోజనాత్మకంగా వినియోగించుకోవాలి. భారీపరిశ్రమలు, లఘుపరిశ్రమలు, పారిశ్రామికవాడలు, గ్రామీణ పరిశ్రమల సంస్థలు, కుటీర పరిశ్రమలు వీటిమధ్య సమన్వయం ఉండాలి.

పరిశ్రమల రంగంలో కేంద్రపరంగా గరిష్ట స్థాయిలో పెట్టుబడులు సాధించడం కూడా రాష్ట్ర పారిశ్రామిక విధానంలో ఒక భాగంగా ఉంది. ఇంతవరకు పబ్లిక్, ప్రైవేటు రంగాలలో నెలకొల్పబడిన భారీపరిశ్రమలకు కార్మిక అశాంతి, నీరు, విద్యు



హిందుస్థాన్ యంత్రపరికరాల కర్మాగారంలో ఒక దృశ్యం

చ్ఛక్తి కొరతవంటి ఆటంకాలు కలగకుండా ప్రభుత్వం చూస్తున్నది. అదృష్టవశాత్తు ఆంధ్రప్రదేశ్‌లో కేంద్ర రంగంలోని ముఖ్యమైన హిందుస్థాన్ యంత్ర పరికరాల ఫ్యాక్టరీ, భారత భారీ విద్యుత్పరికరాల కర్మాగారం, సింథెటిక్ మందుల కర్మాగారం ఉత్పత్తులను ప్రారంభించాయి. రాష్ట్రంలో పబ్లిక్ రంగంలోని పరిశ్రమల నిర్వహణకు యింతవరకు మేనేజిమెంటు కేడర్ కల్పించడం జరగలేదు అవి సక్రమంగాను, లాభదాయకంగాను పనిచేయడానికి యీ లోపాన్ని సాధ్యమైనంత త్వరలో సరిదిద్దాలి.

భవిష్యత్తులో పారిశ్రామిక విధానం నూతన పంథాను అనుసరించాలి. వివిధ పరిశ్రమల స్థాపనకు వీలుగా యింతవరకు వెలికి తీయబడని ఖనిజ సంపదను వినియోగంలోకి తేవడమేగాక బొగ్గుగనుల ప్రాంతాలలోను, నాగార్జునసాగర్ ఆయకట్టు ప్రాంతంలోను క్రమపద్ధతిలో పరిశ్రమలు అభివృద్ధి చెందడానికి కృషిని ప్రారంభించాలి. నాగార్జునసాగర్ ఆయకట్టు ప్రాంతంలో పరిశ్రమల ముడిపదార్థాలైన ప్రత్తి, వేరుశనగ, చెరకు, మిర్చి మొదలయిన పంటలను యితోధికంగా ఉత్పత్తి చేయవచ్చు. ప్రత్తిమిల్లులు, నూనె

మిల్లులు చెక్కెర ఫ్యాక్టరీలువంటి పరిశ్రమల స్థాపనకు దోహదం చేయాలి. తద్వారా నిత్యావసర వినియోగ వస్తువులు పుష్కలంగా లభించడానికి వీలుకలుగుతుంది. వాటికి రాష్ట్రంలోనేగాక దేశంలో మార్కెటు లభించి ఎగుమతులకు కూడా తయారీ అవకాశం ఏర్పడుతుంది. ఎరువుల వంటి భారీ, మధ్యరకం పరిశ్రమల స్థాపనకు ప్రైవేటు పెట్టుబడిదారులను ఆకర్షించడానికి క్రమపద్ధతిలో కృషి జరగాలి. ఆ విధంగా నాలుగవ ప్రణాళికా కాలంలో రాష్ట్రంలో ప్రైవేటు పెట్టుబడులు ఎక్కువ కావాలి.

## ఎగుమతుల అభివృద్ధి

రాష్ట్రంలో ఎగుమతి అవకాశాలను క్రమబద్ధంగా, ఒక పద్ధతిలో రానున్న కాలంలో ఉపయోగించుకుని, తద్వారా ముందు ముందు ఆర్థిక వ్యవస్థకు యితోధికంగా బలాన్ని కలిగించడానికి రాష్ట్ర ఎగుమతులు అవకాశాన్ని కలిగిస్తాయి. ఈ విషయాన్ని యీ సందర్భంలో మనం విస్మరిస్తే రాష్ట్ర ఆర్థికాభివృద్ధిని గూర్చి సమగ్రంగా అంచనా వేసినట్టుకాదు. రాష్ట్రంలో ఎగుమతుల అభివృద్ధికి అప్పుడే పునాదులు పడ్డాయి. రాష్ట్రంలో ఎంత మేరకు ఎగుమతులకు అవకాశం వున్నదో అన్న విషయాన్ని విదేశీవాణిజ్యానికి సంబంధించిన భారతీయ సంస్థ పరిశీలించిన మీదట రాష్ట్ర ప్రభుత్వం యిందునిమిత్తం ఒక ప్రత్యేక శాఖను ఏర్పాటుచేసింది. ఎగుమతుల అభివృద్ధి మండలిని ఏర్పాటు చేయడంవంటి తదితర అనుబంధ చర్యలను కూడా తీసుకోవడం జరిగింది. 1965_66 లో ఆంధ్రప్రదేశ్ నుంచి ఎగుమతులు రూ. 44.9 కోట్లు మాత్రమే అనీ. అదిన్నీ పొగాకు, చేనేత వస్త్రాలు చర్మం, నూనెపిట్టులు, మరికొన్ని ఖనిజాలు వంటి ఏ కొద్దిపాటి సాంప్రదాయక వస్తువులకో పరిమితమై వుంటూ వచ్చిందనీ. ఎటిలో మిరపకాయలు, జీడిపప్పు, అటవీ ఉత్పత్తులు వంటి అనేక కొత్త పదార్థాలను ఎగుమతి చేసిన్నీ, లోగడ ఎగుమతి చేస్తూ వస్తున్న సాంప్రదాయక వస్తువులను మరింత ఎక్కువగా ఎగుమతి చేసిన్నీ 1970_71 నాటికి ఎగుమతులను రు. 97.6 కోట్ల రూపాయల విలువ మేరకు పెంచవచ్చునీ యీ నివేదిక వెల్లడించింది.

రాష్ట్రంలో ఎగుమతి శక్తిని సక్రమంగా వినియోగించుకోవడమేగాని జరిగితే రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ పటిష్ఠంకాగల అవకాశం వున్నట్టు యీ పరిశీలనలో వెల్లడైంది. రాష్ట్రంనించి ఎగుమతులు పెరిగితే దానివల్ల రాష్ట్రంలో చతుర్థ పంచవర్ష ప్రణాళికలో అభివృద్ధి కార్యక్రమాలకు అవసరమయ్యే వనరులను వెలికి తీయడానికి కూడా ఎంతో అవకాశం వుంటుంది.

## విద్యుచ్ఛక్తి ఉత్పత్తి

గత పది సంవత్సరాల కాలంలో రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి పెరిగింది. గతంలో విద్యుచ్ఛక్తి కొరత రాష్ట్ర ఆర్థిక అభివృద్ధికి అడ్డంకిగా నిల్చింది. రాష్ట్ర ప్రాథమిక సమస్యలను చాల వరకు విద్యుచ్ఛక్తి తీరుస్తుంది. రాష్ట్ర ఆర్థిక స్వరూప స్వభావాలనే అది మార్చగలుగుతుంది.



విద్యుచ్ఛక్తి వినియోగంలో ఆంధ్రప్రదేశ్ ఇప్పటికీ వెనుకబడిన ప్రాంతంగానే ఉంది. రెండవ ప్రణాళికా కాలంలో అఖిల భారత సగటు వినియోగం 50 కిలోవాట్లు ఉండగా ఆంధ్రప్రదేశ్‌లో 16 కిలోవాట్లు మాత్రమే ఉంది. రాష్ట్రంలో స్థాపిత విద్యుదుత్పాదకశక్తి 55.8 మెగావాట్లు ఉండడమే దానికి కారణంగా పేర్కొనవచ్చు. మొదటి ప్రణాళికా కాలంలో యిది 99 మెగావాట్లకు పెరగగా, రెండవ ప్రణాళికలో అదనంగా స్థాపిత ఉత్పాదకశక్తి 128 మెగావాట్లకు పెరిగింది అయితే ఆర్థికంగా ప్రయోజనకరం కాని డీజల్ ప్లాంటును మూసివేయడంతో ఉత్పాదకశక్తి 213 మెగావాట్లకు తగ్గింది మూడవ ప్రణాళిక ఆఖరుకు ఉత్పత్తి 292 మెగావాట్లకు పెరిగింది. అయితే మరుసటి రెండు సంవత్సరాలలో పరిశ్రమలు, వ్యవసాయం, గృహావసరాలలో విద్యుచ్ఛక్తి గిరాకీ ఎక్కువ కావడంతో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి అధిక ప్రాధాన్యం యిచ్చి అదనంగా 390 మెగావాట్ల ఉత్పత్తిని సాధించి ఉత్పాదకశక్తిని ఇప్పుడు 680 మెగావాట్లకు పెంచడం జరిగింది. రాష్ట్రంలో లభించే థర్మల్ జల విద్యుదుత్పాదక వనరులను తగిన విధంగా ఉపయోగంలోకి తేవడానికి ప్రయత్నిస్తున్నారు. అయితే మన విద్యుచ్ఛక్తి అవసరాలు 1970_71 నాటికి 1000 నుండి 1100 మెగా



కొత్తగూడెం థర్మల్ విద్యుత్కేంద్రం



విద్యుచ్ఛక్తికి నిధి-కొత్తగూడెం కేంద్రం

వాట్లు. 1975_76 నాటికి 2000 మెగావాట్లకు ఉంటుందని అంచనా. శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణం యితర థర్మల్ పథకాల అమలు ద్వారా యీ అవసరాలను ఆదుకోవచ్చు.

మూడవ ప్రణాళికా కాలంలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ప్రాధాన్యం యిచ్చిన విధంగానే నాలుగవ ప్రణాళికలో కూడ దీనికి ప్రాధాన్యం యివ్వాలి. "1951_68వ సం॥ ఆంధ్రప్రదేశ్ ఆర్థిక అభివృద్ధి" నివేదికలో యిలా వుంది.

"రాష్ట్రంలో భారీ పరిశ్రమల స్థాపనకు అనువైన వాతావరణం కల్పించడానికీ, ఆర్థిక అభివృద్ధిని త్వరితగతిని సాధించడానికీ విస్తృత ప్రాతిపదికపై విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని అధికం చేయాలనే విషయాన్ని నొక్కిచెప్పాల్సిన అవసరంలేదు. రాష్ట్రంలో జల విద్యుచ్ఛక్తి, బొగ్గు వనరుల వినియోగంతోపాటు అణు విద్యుచ్ఛక్తి కేంద్రాలను అభివృద్ధి చేయాల్సిన అవసరం ఉంది"

## సాంఘిక సంక్షేమం

భారత దేశంలో సాంఘిక సేవ, సాంఘిక సంక్షేమ కార్యక్రమాల ద్వారా సాంఘికాభివృద్ధిని సమాజాభివృద్ధిని సాధించాల్సి



ఉంది. గత కొన్ని సంవత్సరాల కాలంలో ప్రణాళికాపరంగాను, రాష్ట్ర ప్రభుత్వ పరిపాలనా యంత్రాంగం బాధ్యతాపరంగాను సాంఘిక సమస్యల పరిష్కారానికి కృషి జరుగుతున్నది. షెడ్యూలు జాతులు, షెడ్యూలు తెగల విద్యాభివృద్ధి, ఆర్థిక ఉన్నతి ఆరోగ్యం, గృహవసతి, సంక్షేమ రంగాలలో అనేక పథకాలను అమలు జరిపారు.

షెడ్యూలు జాతులు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతుల ప్రజల అభ్యున్నతికి చట్టరీత్యా ఆర్థిక గ్రాంటు మంజూరు చేయబడుతున్నది ప్రభుత్వోద్యోగాలలో వారికి రిజర్వేషనులు ఏర్పాటుచేశారు అయితే ఆర్థిక సహాయం, ఉద్యోగాల రిజర్వేషనులతో వారు సాధించిన ఆర్థిక, సాంఘిక అభివృద్ధిని సరిగా అంచనా వేయడం సాధ్యంకాదు. కొన్ని రాష్ట్రాలకు సంబంధించిన జాతులు, షెడ్యూలు తెగల కమీషనరు తన వార్షిక నివేదికలో యిలా అన్నారు." ఈ వర్గాలకు నిర్దేశించిన ప్రత్యేక రాయతీలు అర్హతగల వారందరికీ సరిపోవడంలేదు. ప్రభుత్వం అందజేసే ఆర్థిక సహాయంగానీ, వారిఆర్థిక అభ్యున్నతికిన్నీ, ఉద్యోగ అవకాశాల కల్పనకున్నూ అందజేస్తున్న సహాయంగానీ,



కుట్టుపని నేర్చుకుంటున్న గిరిజనమహిళలు

సమాజంలో బడుగు ప్రజలకు చేరేలోపుగానే ముగియడమే దానికి కారణం." మంజూరుచేస్తున్న గ్రాంటుఆవర్గాల ప్రజల అభివృద్ధికి మాత్రమే వినియోగించబడడంచాలఅవసరం"

ఆర్థిక అసమానతల కారణంగానే ప్రధానంగా సాంఘిక అసమానతలు ఏర్పడుతున్నాయనే విషయాన్ని గుర్తించాలి. తత్కారణంగా షెడ్యూలు తెగలు, షెడ్యూలు జాతులు, వెనకబడిన ప్రజలకు వారికి అవసరమైన భూములను కేటాయించి వారి ఆర్థిక అభివృద్ధికి కృషిచేయాలి. ఇటీవల రాష్ట్రంలోని గిరిజనులు లేవనెత్తిన దౌర్జన్యకాండను ఒక హెచ్చరికగా భావించాలి. వారి సాంఘిక, రాజకీయ, పరిపాలనా సమస్యలను జాగులేకుండా పరిష్కరించాలి, రాష్ట్ర ప్రభుత్వం యీ విషయాలను గుర్తించి పెట్టబడి దారులు, భూస్వాముల వత్తిడులు వారిపై లేకుండా చేయడానికి అవసరమైన చర్యలను తీసుకుంటున్నది. గిరిజనుల జీవిం

[illegible] వృద్ధి సాధించడానికి పరిపాలనా యంత్రాంగం కృషి చేయాలి.

స్త్రీల, పిల్లల సాంఘిక సంక్షేమం విషయంలోకూడ సంబంధిత కార్యక్రమాలను వాస్తవమైన సంక్షేమ దృక్పథంతో అమలు జరపాలి.

పంచవర్ష ప్రణాళికల ద్వారా అమలు జరుపుతున్న వివిధ అభివృద్ధి కార్యక్రమాల పురోగమనాన్ని అనుసరించి రాష్ట్ర అభివృద్ధిని మదింపు వేయవచ్చు. మొదటి మూడు ప్రణాళికలలో వ్యవసాయం, నీటి పారుదల—ముఖ్యంగా నాగార్జున సాగర్—ప్రాజెక్టు వంటి భారీ నీటిపారుదల, విద్యుచ్ఛక్తి రంగాలకు అధిక ప్రాధాన్యం యివ్వబడగా యితర రంగాలకు మామూలు కేటాయింపులు జరిగాయి. ప్రాధాన్యతా ప్రాతిపదికపై అమలుజరిపిన యీ రంగాల అభివృద్ధిని సమీకరించి సమన్వయ పరచాల్సిన సమయం ఆసన్నమైంది.



ష్ట్ర అభ్యుదయానికి సోపానాలు నిర్మిస్తున్న నాగార్జున సాగర్ ప్రాజెక్టు

రాష్ట్ర ఆదాయం, తలసరి సగటు ఆదాయాల పెరుగుదలకు మూలకారణమై భవిష్యత్ ఆర్థిక అభివృద్ధికి సోపానాలైన యీ కార్యక్రమాల ప్రాముఖ్యతను ఎవరూ కాదనలేరు. రు. 152 కోట్ల ఖర్చుతో నిర్మించబడిన నాగార్జున సాగర్ ప్రాజెక్టు ఫలితాలు యిప్పుడిప్పుడే అనుభవంలోకి వస్తున్నాయి. దీనిద్వారా 6.50 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం ఏర్పడుతుంది. ప్రస్తుతం 1.90 లక్షల ఎకరాలకు నీటి సరఫరా జరుగుతున్నది. వచ్చే ఒకటి, రెండు సంవత్సరాలలో యీ ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయ్యి, పూర్తిగా వినియోగంలోకి వచ్చినప్పుడు రాష్ట్ర అభివృద్ధి మరింత త్వరితంగా పురోగమిస్తుంది. ఈ సంవత్సరం విపరీతంగా ఏర్పడిన కరువుపరిస్థితుల కారణంగా చిన్నతరహా నీటివనరులు అంతగా ఆధారపడదగినవి కావనీ, భారీ, మధ్యరకం ప్రాజెక్టులు పూర్తి అయ్యే పక్షంలో యీ పరిస్థితులను రాష్ట్రం తట్టుకుని ఉండేదనీ ఋజువు అయింది.



పొలాలకు నాగార్జునసాగర్ జలాలు

ఆర్థికాభివృద్ధి పునాదుల్ని పటిష్టం చేయడానికి అవసరమైన సాంఘిక సేవ, సాంఘిక సంక్షేమాల విషయంలో మరో విధంగా ఉంది. గత మూడు ప్రణాళికలలో యీ రంగంలో కేటాయింపులు క్రమంగా ఎక్కువైనాయి. మొదటి ప్రణాళికలో 96.78 కోట్ల రూపాయలు కేటాయించబడగా రెండవ ప్రణాళికలో రూ. 170.74 కోట్లు కేటాయించగా ఖర్చు రు. 188.60 కోట్లకు పెరిగింది. అదేవిధంగా మూడవ ప్రణాళికలో మొదట కేటాయింపు రు. 305 కోట్లు ఉండగా తర్వాత దానిని రు. 314 కోట్లకు సవరించారు. నికరంగా ఖర్చు రు. 352.42 కోట్లకు పెరిగింది. గత రెండు సంవత్సరాలలో తాత్కాలిక పథకాలను అమలు జరిపారు.

అదేకాలంలో 1950–51 రు. 250 లు ఉన్న సగటు తలసరి ఆదాయం 1960–61 నాటికి రు. 294 కు పెరిగింది. 1965–66 లో రు. 321 ఉంది. 1950–51 సగటు రాష్ట్రఆదాయం రు. 799 కోట్లు ఉండగా 1960–61 నాటికి రు 1068 కోట్లకూ, 1965–66 నాటికి రు. 1273 కోట్లకూ పెరిగింది.

నాలుగవ ప్రణాళిక పెట్టుబడి యింకా నికరం కానప్పటికీ అది రు. 522 కోట్లకు తక్కువగాకుండా ఉంటుందనవచ్చు. ఇంత వరకు సాధించిన అభివృద్ధి స్థాయి సంతృప్తికరంగాలేదనీ, యింకా త్వరితం చేయాలని ప్రజలు, పార్టీలు అభిప్రాయ పడుతున్నాయి. అభివృద్ధి సాధించబడుతున్నా దానితో పాటు జనాభా పెరుగుదలను అరికట్టాల్సి ఉంది. ఈ విషయంలో ఆంధ్రప్రదేశ్, మిగతా రాష్ట్రాలకు అగ్రగామిగా ఉంది. అయినా నాలుగవ ప్రణాళిక ఆఖరు నాటికి జననాల రేటును కనీసం 25 శాతం వరకైనా తగ్గించడానికి కృషి జరగాలి.

సాంఘిక సేవా రంగంలో విద్య ప్రథమ స్థానం ఆక్రమిస్తుంది. తద్వారా సమాజంలో అసమానతలు తొలగించబడి ఆర్థిక అభివృద్ధికి దోహదం కలుగుతుంది.



78-2

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ తర్వాత విద్యారంగంలో చెప్పుకోదగిన అభివృద్ధి సాధించబడినది కళాశాల, ఉన్నతవిద్యా సౌకర్యాలను విస్తరింపజేశారు.

## విద్య

క్రొత్తవ్యవసాయ విశ్వవిద్యాలయంలో అడ్మిషనను కలుపుకొని కాలేజికోర్సులలో అడ్మిషన్ల సంఖ్య 1960-61లో 45,866 నుండి 1965-66లో 63,938కి పెరిగింది. సెకండరీ స్కూళ్ళలో ఈ సంఖ్య 1955-56లో 20 లక్షల నుండి 65-66లో 25 లక్షల 67 వేలకు పెరిగింది. ప్రాథమిక విద్యా స్థాయిలో, చేర్చబడిన పిల్లలసంఖ్య 1960-61లో 28.76 లక్షల నుండి, 1965-66లో 37 లక్షలకు పెరిగింది. 1956-57లో 53 కాలేజీలు వుంటే అవి తృతీయ ప్రణాళికాంతానికి 85కు పెరిగాయి అప్పటినుంటి అదనంగా విద్యార్థులను చేర్చుకోవడం, కొత్త కాలేజీలు నెలకొల్పడం జరిగింది. వరంగల్, గుంటూరు అనంతపురంలో ఏర్పాటుచేయబడిన పోస్టుగ్రాడ్యుయేట్ తరగతులుకూడా వీటిలో చేరినవే.

దానితోపాటు యిటీవలి సంవత్సరాలలో సెకండరీస్థాయి, జిస్థాయిలో విద్యావిధానంలో నూతన ప్రయోగాలు జరిగాయి. రెండు సంవత్సరాల కాలపరిమితి గల యింటర్మీడియట్ తరగతులు ప్రవేశ పెట్టేందుకు, జూనియర్ కళాశాలల్ని స్థాపించేందుకు యిటీవల తీసుకొన్న నిర్ణయం, నిజానికి మూడేళ్ళ డిగ్రీ కోర్సు విధానానికి పూర్తి వ్యతిరేకమైనది. అయినా దీనివల్ల అనేక సదుపాయాలున్నాయి. మొదటిది అనర్హులు అసమర్థులూ అయిన విద్యార్థులను తొలగించి తద్వారా, కాలేజీలలో, యూనివర్సిటీలలో ప్రవేశాల విషయాల్లో ఏర్పడే రద్దీని తగ్గించడం; రెండవది మెరుగైన విద్యార్థులకు వృత్తికళాశాల కోర్సులలో, సాంకేతికకోర్సులలో ప్రవేశం కల్పించడం; జిల్లాలలో 2 మొదలు 6 వరకూ కాలేజీలు ఏర్పడి పనిచేయడంతో, యూనివర్శిటీల నుండి వెలుపలికి వచ్చే పట్టభద్రులకు తగిన ఉద్యోగ, ఉపాధి అవకాశాలుకల్పించడంఅనేది రాష్ట్రప్రభుత్వ ఆర్థికస్తోమతను మించిపోయేదిగా కనిపిస్తున్నది. అందువల్ల కొత్తకాలేజీలు స్థాపించే విషయంలో ముందుగా పరిస్థితులను పూర్తిగా పరిశీలించవలసిన అగత్యం ఏర్పడుతున్నది.

ఉస్మానియా విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవం సందర్భంగా రాష్ట్రపతి వివరించినట్లు, విద్యాభివృద్ధి విషయంలో ఈ క్రింద పేర్కొన్న మూడు అంశాలనూ సంతృప్తిపరచగల పద్ధతిలోనే ఇకముందు విద్యాపథం ఏర్పడాలి. ఒకటి- యివి సమాజ జీవనానికి, అవసరాలకు, అభివృద్ధి ఆశయాలకు అనుగుణమైనవిగా వుండాలి. రెండవది-ఉన్నతవిద్య విషయంలో పరిమాణానికన్నా ప్రమాణానికి ప్రాధాన్యత ఎక్కువ కలిగించేవిగా వుండాలి. మూడవ విషయం — పట్టభద్రుల సంఖ్యకు, అందుబాటులో వుండే ఉద్యోగావకాశాలకు మధ్య ఏర్పడిన అంతరాన్ని తగ్గించే విధంగా విద్యాసంస్థల పెరుగుదల క్రమబద్ధమైనదిగా వుండాలి. ఈ దృష్ట్యా చూచినపుడు, ఉపయోగకరమైన కృషిలో యాభై సంవత్సరాలు నింపుకొన్న ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని ప్రశంసించకుండా వుండలేము.

గత రెండు ప్రణాళికలకాలలో సాంకేతిక విద్యారంగంలో కూడా ఎక్కువగా చెప్పుకొనదగినంత అభివృద్ధి సాధించబడింది. అయితే రాష్ట్రంలో వయోజన నిరక్షరాస్యతా నిర్మూలన విషయంలో తగినంత అభివృద్ధి కనిపించడంలేదు. వయోజనులలో 1951-52లో ప్రతి వెయ్యిమందికి 11 మంది అక్షరాస్యులు వుంటే ఆసంఖ్య 60-61లో ప్రతి వెయ్యిమందికి 21.7కు పెరిగింది. వయోజనుల అక్షరాస్యత విషయంలో మనం ఎంత వెనుకబడివున్నామో పై వివరాలు తెలుపుతున్నాయి. ప్రజాస్వామ్యం వేర్లు నాటుకొని పటిష్టంగా వర్ధిల్లాలంటే అక్షరాస్యతా వ్యాప్తికివున్న అవసరాన్ని ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు. నిరక్షరాస్యత నిర్మూలనకై యిదివరకటికంటే ఎక్కువ ఉరవడితో ప్రభుత్వము, విద్యాసంస్థలు, స్వచ్ఛంద సేవాసంస్థలు కలిసి మరింత ఎక్కువగా కృషిచేయవలసిన అవసరం ఎంతైనావుంది. మార్పుచెందుతున్న విద్యావిధానాలకు అనుగుణంగా వయోజన అక్షరాస్యతా విధానంలోకూడా మార్పులు జరగాలి. ప్రభుత్వం యిదివరకటికంటే ఎక్కువ నిధులను ఈ పథకాలు అమలు జరిపే విషయంలో వెచ్చించేందుకు పూనుకోవలసిన అవసరంకూడా కనిపిస్తున్నది.

## జిల్లా అభివృద్ధి మండలులు

గ్రామీణ ఆర్థికపరిస్థితిని మెరుగుపరచేందుకు, సమాజాభివృద్ధి కార్యక్రమాన్నీ ఆపిదప పంచాయతీ రాజ్ విధానాన్నీ ప్రప్రథమంగా నెలకొల్పిన రాష్ట్రాలలో ఒకటిగా ఆంధ్రప్రదేశ్ పేరు వహించినప్పటికీ, ఈ కార్యక్రమాలకు సంబంధించిన సంస్థలు అనుకున్నంత ప్రగతిని సాధించలేకపోవడంతో పరిపాలనారంగంలో మార్పులు చేయవలసివచ్చిన అవసరందృష్ట్యా జిల్లాబోర్డులు నెలకొల్పడం జరిగింది. గ్రామీణ ఆర్థికస్తోమతను పెంచే కార్యక్రమాలను అమలుజరిపే బాధ్యత వీటిపై మోపడం జరిగింది. స్థానిక సాధనసంపత్తిని, వనరులను, పరిస్థితులను అవసరాలను దృష్టిలోవుంచుకొని, జిల్లాఅధినేతలైన కలెక్టర్ల ఆధ్వర్యంలో వివిధ అభివృద్ధి రంగాలలోసమిష్టికృషి ఎంతవరకూ ప్రతిభావంతంగా జరుగగలదనే అంశంపైననే ఈ క్రొత్తపద్ధతి యొక్క జయాపజయాలు ఆధారపడివుంటాయి.

సాంఘిక సేవారంగంలో- అనగా, విద్య, ప్రజారోగ్యం, సమాజసంక్షేమం మున్నగు విషయాల్లో స్థానికపంచాయతీ రాజ్య సంస్థలు కృషిచేస్తుంటే, వివిధశాఖల సమన్వయకృషితో గ్రామీణ రంగంలో నిర్దుష్టమైన ఆర్థిక ప్రమాణాభివృద్ధిని సాధించేవిషయంలో ఈ జిల్లాబోర్డులు ప్రయోగాత్మకమైన కృషిజరుపుతున్నవి.

విస్తృతమైన పద్ధతిలో రిజన బ్లాకులలో సమాజాభివృద్ధి కార్యక్రమాలు కొనసాగించబడడం, స్థానికావసరాలకు తగినట్లు రూపొందింపబడిన ప్రణాళికలను అమలు పరుచుకొనేందుకు ప్రత్యేకంగా నిధులు కేటాయించబడడం, సమంజసంగానే కను

పిస్తున్నది అయితే సమాజాభివృద్ధి, పంచాయతీరాజ్ కార్యక్రమాలు అధికతరంగా లాభపడే విషయం ఎన్నికల ద్వారా రూపొందించబడి పనిచేస్తున్న ప్రజా సంస్థలు, జిల్లాస్థాయిలోని వివిధ ప్రభుత్వసంస్థలతో కలిసిమెలసి పనిచేసి, సంపాదించే అనుభవం మీదనే ఎక్కువగా ఆధారపడివుంటుంది.

నాల్గవ ప్రణాళికకు సాధనసంపత్తులను సమకూర్చే విషయంలో గ్రామీణ సమాజం ఎంతవరకూ తోడ్పడగలదనే విషయంకూడా, పై పేర్కొన్న సంస్థల కృషిపైననే ఆధారపడడంతో, వీటి ప్రాముఖ్యత యిదివరకటికన్నా మరింత ఎక్కువగా ప్రస్తుతం పెరిగిందనడంలో సందేహంలేదు.

## అధికార భాష

ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటినుండీ తెలుగును అధికార భాషగా చేయడానికి రాష్ట్రప్రభుత్వం కొన్ని ముఖ్యమైన చర్యలను తీసుకుంటున్నది. భాషా ప్రాతిపదికగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటు కావడంలో లక్ష్యంకూడా యిదే ముందుగా తాలూకా స్థాయిలోనూ, ఆ దిగువ స్థాయిలోనూ తెలుగును అధికార భాషగా ప్రవేశపెట్టి, తర్వాత తర్వాత అనేక శాఖలకు దానిని విస్తరింపజేశారు. 1957 లో ఆనాటి శాసన సభ స్పీకర్ అధ్యక్షతన ఒక కమిటీకూడా ఏర్పాటు చేయడం జరిగింది. ఈ కమిటీ శాసన, న్యాయ, పరిపాలనా విషయాలకు సంబంధించిన పారిభాషిక పదకోశాన్ని ఒకదానిని తెలుగులో రూపొందించింది తెలుగు షార్ట్ హేండ్ పుస్తకాన్ని ఒక దానిని అచ్చువేశారు. తెలుగు టైపురైటర్ కీబోర్డునుకూడా రూపొందించి స్థిరీకరించారు. దీనిని బట్టి టైపురైటర్‌లను అధికసంఖ్యలో తయారు చేస్తారు.

పైగా 1966 సం పు ఆంధ్రప్రదేశ్ అధికారభాషా చట్టాన్ని ప్రవేశపెట్టడంవల్ల తెలుగును అధికార భాషగా వ్యవసాయ, పశుపోషక, సహకార, పంచాయతీ రాజ్, రిజిస్ట్రేషన్, విద్యా శాఖలతోసహా అనేక శాఖలలో కొన్ని ప్రత్యేకించబడిన పనులకు కొన్ని స్థాయిలలో ఉత్తరప్రత్యుత్తరాల నిమిత్తం ఉపయోగించడానికి మరింత అవకాశం ఏర్పడింది శాసనసభ చట్టాలను తెలుగులో అనువదించడానికి 1964 లో ఒక అనువాద సంఘాన్ని కూడా ఏర్పాటు చేయడం జరిగింది. ఈ సంఘం అప్పుడే చాలా పనిని పూర్తి చేసింది. దీనిస్థానే యిప్పుడు అధికార భాషా కమిషన్‌ను ఏర్పాటుచేశారు.

అధికార భాషా చట్టం లక్ష్యాలను పూర్తిగా సాధించాలంటే, తెలుగును సచివాలయ స్థాయిలోనూ, న్యాయస్థానంలోను వినియోగించడంలో యిప్పుడున్న అడ్డంకులను అధిగమించాలంటే మరి కొన్నేళ్ళు పట్టవచ్చు. నిజానికి కొన్ని అడ్డంకులు అనివార్యమైనవిగా కనిపించినప్పటికీ సాధ్యమైనంత త్వరలోనే యీ అడ్డంకులు తొలగిపోగలవని ఆశిద్దాం. ఈ చట్టంలోని భాగాలను విజయవంతంగా ఆచరణలోకి తీసుకొని రావాలంటే ప్రాంతీయ భాషలోకి అనువదింపబడిన చట్టాలు న్యాయ శాస్త్రపరమైన అర్థాన్ని స్ఫురింపజేస్తూనూ, భాషలోని సొగసు చెడకుండానూ, శైలి, వ్యాకరణ సంబంధమైన స్వభావం చెడకుండానూవుండి అధిక సంఖ్యాకులకు ఆమోదయోగ్యమైనవిగా వుండడం అవసరం. కళాశాల విశ్వవిద్యాలయ స్థాయిలో బోధనా భాష తెలుగులోకి మారేవేగాన్ని బట్టి కూడా ఈ కార్యక్రమం యొక్క విజయం ఆధారపడివుంటుంది. ఈ సంబంధాన్ని దృష్టిలోవుంచుకుని విశ్వవిద్యాలయాలు కూడా బోధనా భాషగా తెలుగును ప్రవేశ పెట్టేందుకు వీలైన కార్యక్రమాన్ని తగువిధంగా రూపొందించుకోవలసివుంది.

## సమైక్యతాకృషి

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత గత 12 సంవత్సరాలలో, ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల భావసమైక్యతా విషయంలో చెప్పుకోదగిన పురోభివృద్ధి సాధించబడినా, కొన్ని వర్గాలవారిలో యింకా ఈ సమైక్యతాభావం దృఢంగా పాతుకొనకపోవడం విచారకరమైన విషయం. ప్రత్యేక సౌకర్యాల విషయంలో తమకు జరగవలసినంత జరగలేదనే భావన తెలంగాణా ప్రాంతీయులలో కొంత అసంతృప్తికి దారితీసే విధంగా వ్యాపించివుంది. ఎలాగైనా దీన్ని తొలగించడం అవసరమైన విషయం.

తెలంగాణా ప్రాంతం ఆర్థికంగా వెనుకబడినదన్నవిషయం అందరూ ఒప్పుకొనే సత్యమే. అయితే తెలంగాణా ప్రాంతీయ సంఘం సూచనల మేరకు, ఆ ప్రాంతం ఆర్థిక అభివృద్ధికి దోహదం కలిగించే ప్రణాళికలు రూపొందించి పనులు జరపడం జరుగుతున్నది. ఇందుకు ఈ ప్రాంతానికి సంబంధించిన మిగులు నిధులను, కొంతభాగం రాష్ట్ర రెవిన్యూ నుండి నిధులను కేటాయించి ఖర్చుపెట్టడంకూడా జరిగింది. ఈ సందర్భంలో పోచంపాడు సేద్యపు నీటిపథకం పూర్తిచేయడం ప్రధానమైన విషయం. వచ్చే రెండు మూడు సంవత్సరాల్లో దీనికి అధిక నిధులు కేటాయించి నాల్గవ ప్రణాళికాంతానికి గాని, వీలైతే యింకా ముందుగాగాని ఈ ప్రాజెక్టును పూర్తి అయ్యేటట్టు తప్పక చూడవలసివుంటుంది.



పోచంపాడు ప్రాజెక్టు

రాష్ట్రావతరణ తరువాత గడచిన పన్నెండేళ్ళలో ఆంధ్రప్రదేశ్, అన్ని సమస్యలను సర్దుబాటుచేసుకొని ప్రగతి పథంలో క్రొత్త అధ్యాయాన్ని ప్రారంభించబోతున్నది. ఇది కేవలం ఒక ఆశాభావంకాని, జోస్యంకాని కాదు. సత్యాధారమైన విషయం. వ్యవసాయం, పరిశ్రమలు, సేద్యపు నీటివనరుల అభివృద్ధి, విద్యుచ్ఛక్తి, ప్రాంతీయ అసమానతలు తొలగించడం వంటి వివిధరంగాలలో ఆంధ్రప్రదేశ్ తగు విధంగా రూపురేఖలు దిద్దుకొని ప్రగతిపథంలో అడుగు పెట్టడానికి సన్నద్ధమైంది. తయారవుతున్న నాల్గవప్రణాళిక రాష్ట్రపురోభివృద్ధి విషయంలో సాగింపదలచిన కృషికి అద్దంపట్టుతుంది.

అయితే అభివృద్ధి విషయంలో అటు ప్రభుత్వము, ఇటు పరిపాలనా యంత్రాంగము, మరొకవైపు ప్రజలు, ప్రతిపక్షపార్టీలు సహకారభావంతో కలిసిమెలసి కృషి చేయవలసిన అవసరం ఎంతైనావుంది. కావలసింది రాజకీయ సుస్థిరత, నిస్వార్థ త్యాగభరిత నాయకత్వం, పరిపాలనాదక్షత, నిగ్రహంతో కూడుకొన్న ప్రతిపక్షచర్యలు. కొన్ని యితర రాష్ట్రాలలో వలెగాక మనరాష్ట్రంలో రాజకీయ సుస్థిరత ఎట్టి అవాంతరాలు లేకుండా సాఫీగా వర్ధిల్లుతూనేవుంది. ప్రతిపక్షవర్గాలు కూడా నిర్మాణాత్మక విమర్శనా దృష్టితో తమ విధులు నిర్వర్తిస్తున్నాయి. ప్రభుత్వ యంత్రాంగం కూడా ఒడుదుడుకులు లేకుండా పనిచేస్తూనేవున్నది. అయితే ఇంకా ప్రతిభావంతంగా, సామాన్య ప్రజానీకపు సమస్యలను అర్థం చేసుకొని, వాటిని సత్వరమే పరిష్కరించకలిగేటట్లు, పరిపాలనా సిబ్బంది ప్రజలతో కలిసి కృషి చేయగలగడం వాంఛనీయమైన విషయం. అది లేనినాడు ప్రణాళికాభివృద్ధి విషయంలో ప్రజాసహకారం అందుబాటులో లేకుండాపోవడమే గాక, ప్రజలలో అసంతృప్తి ప్రబలి, యింతవరకు మనం సాధించిన ప్రగతిని నిరర్థకమైనదిగా చేసేందుకు అవకాశం వుంటుంది.

పై విధంగా చేయగలిగిననాడు, గత పన్నెండు సంవత్సరాలకన్నా, రాబోయే ఐదు సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ ఉజ్వలతరమైన భవిష్యత్తును పొందగలిగేదిగా వుంటుందనడంలో సందేహంలేదు.

×



# ఉద్యోగాలలో తెలంగాణావారికి మరొక అయిదేళ్లపాటు రక్షణ

ఉద్యోగాలలో తెలంగాణావారికి ప్రత్యేకరక్షణ కల్పిస్తున్న ముల్కీ నిబంధనల గడువును మరొక అయిదు సంవత్సరాలపాటు పొడిగించాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరడానికి ఆంధ్ర దేశ్ మంత్రివర్గం అక్టోబరు 23న నిర్ణయించింది.

1969 మార్చినాటికి తెలంగాణా ప్రాంతంవారికి ప్రత్యేక రక్షణ నిబంధనల గడువు ముగియనున్నందున రాష్ట్ర ప్రభుత్వం ఈ చర్య తీసుకోవలసివచ్చింది.

1959లో తెలంగాణావారి ప్రత్యేక హక్కులకు సంబంధించిన చట్టాన్ని పార్లమెంటు ఆమోదించింది. దీనిని అనుసరించి తెలంగాణాలో కనీసం 15 సంవత్సరాలు నివసించినవారికే ఆ ప్రాంతంలో ఉద్యోగాలకు అవకాశం ఉంటుంది. 1964లో ఈ చట్టం గడువును పొడిగించారు.

ప్రస్తుతం దీని గడువు 1969 మార్చి 31 నాటికి ముగియనున్నది.

తమకు కల్పించిన రక్షణల విషయంలో నిబంధనలు ఖచ్చితంగా అమలుజరగలేదని, అందుచేత గడువు పొడిగించాలని తెలంగాణా ఉద్యోగులు కొంతకాలంగా కోరుతున్నారు.

సెక్రటేరియట్ ఉద్యోగాలకు, వివిధ శాఖల అధిపతుల ఉద్యోగాలకు ఈ నిబంధనలు వర్తిస్తాయి.

తెలంగాణా ప్రాంతంవారి ప్రత్యేక రక్షణ నిబంధనలు ఈ క్రిందివాటికి వర్తిస్తాయి.

(1) హైదరాబాద్, సికింద్రాబాద్ నగరాలలోని సెక్రటేరియట్, ఇతర ప్రభుత్వశాఖలలో ప్రతి మూడు ఖాళీలలో రెండవ స్థానం తెలంగాణావారికి ఇవ్వాలి (2) తెలంగాణా ప్రాంతంలోని నాన్‌గెజిటెడ్ ఉద్యోగాలలో ప్రతి మూడు ఖాళీలలోను ఒక స్థానానికి తెలంగాణావారినే నియమించాలి. (3) తెలంగాణాలోని తహసీల్దార్ పదవులన్నిటికి తెలంగాణా ప్రాంతంవారినే నియమించాలి. (4) తెలంగాణాలో 300 రూపాయల వేతనం మించకుండా ఉన్న స్థానిక సంస్థల పదవులన్నిటికి స్థానికులనే నియమించాలి.

# ప్రణాళికా సలహా సంఘం

ముఖ్యమంత్రి అధ్యక్షులుగా రాష్ట్ర ప్రణాళికా సలహా సంఘాన్ని రాష్ట్రప్రభుత్వం పునర్వ్యవస్థీకరించింది. ఈ సంఘం 1968 సెప్టెంబరు 21 నుంచి రెండు సంవత్సరాల పాటు అధికారంలో వుంటుంది.

కేంద్ర మంత్రిమండలిలోని ఆంధ్రప్రదేశ్‌కు చెందినవారు, రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి (సభ్యులు). ప్రణాళికా, పంచాయతీరాజ్ శాఖ ప్రభుత్వ కార్యదర్శి (సభ్యుడు – కన్వీనరు), ఆర్థికశాఖ కార్యదర్శి–యీ పునర్వ్యవస్థీకరణ సంఘంలో వున్నారు.

మిగిలిన సభ్యులు :

పార్లమెంటు సభ్యులు సర్వశ్రీ తెన్నేటి విశ్వనాథం, ఎం. నారాయణరెడ్డి, అక్బర్‌అలీఖాన్; శాసనసభ్యులు కాకాని వెంకటరత్నం, గౌతులచ్చన్న, టి. నాగిరెడ్డి, సి హెచ్. రాజేశ్వరరావు, వావిలాల గోపాలకృష్ణయ్య, వేములకూర్మయ్య, ఎన్. రామచంద్రారెడ్డి, జె. చొక్కారావు, అనగాని భగవంతరావు, పి. బసిరెడ్డి. శాసనమండలి సభ్యులు మామిడిపూడి ఆనందం, డి. సుబ్రమణ్యం, ఎన్. వెంకటసుబ్బయ్య; మాచాని సోమప్ప సి. వి హెచ్. రావు, పశ్చిమ గోదావరిజిల్లా పరిషత్తు అధ్యక్షుడు హరిబాబు, హైదరాబాద్ జిల్లాపరిషత్తు అధ్యక్షుడు భోజిరెడ్డి, పి నరసారెడ్డి, వై. వి. కృష్ణారావు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆర్థిక శాస్త్రాచార్యుడు డా గౌతమ్ మాథూరు, ఆంధ్ర విశ్వవిద్యాలయ ఆర్థిక శాస్త్రాచార్యుడు కె వి ఎస్. శాస్త్రి, ఉస్మానియా విశ్వవిద్యాలయ వాణిజ్యశాస్త్రాచార్యుడు డా వి వి రామనాథం, వ్యవసాయ విశ్వవిద్యాలయ పరిశోధక విభాగం డైరెక్టరు డా. కృష్ణమూర్తి, సహకార సంఘాల మాజీ రిజిస్ట్రారు జి. చంద్రశేఖరం, ఖాదీ గ్రామోద్యోగమండలి అధ్యక్షుడు భాట్టం శ్రీరామమూర్తి, రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలి అధ్యక్షుడు సి. నరసింహం, ఆంధ్రప్రదేశ్ వాణిజ్య మండలి అధ్యక్షుడు, సికింద్రాబాదులోని లఘుపరిశ్రమలు–అఖిల భారత ఉత్పత్తిదార్ల సంస్థ అధ్యక్షుడు, శ్రీమతి బ్రహ్మ

# ప్రభుత్వ డాక్టర్ల ప్రయివేట్ ప్రాక్టీస్‌పై నిషేధం

వైద్య, ఆరోగ్యశాఖలో పనిచేసే అన్ని తరగతులకు చెందిన డాక్టర్లూ ఈ సంవత్సరం నవంబరు ఒకటవ తేదీ నుండి ప్రయివేటు ప్రాక్టీసు చేయరాదని నిషేధిస్తూ రాష్ట్రప్రభుత్వం అక్టోబరు 19వ తేదీన ఒక ఉత్తర్వును జారీచేసింది

ఈ ఉత్తర్వు ప్రకారం ప్రభుత్వ డాక్టర్లు ఆఖరుకు కన్సల్టేషన్ ఫీజు కూడా పుచ్చుకోకూడదు.

ప్రభుత్వ డాక్టర్ల ప్రయివేటు ప్రాక్టీసుపై ఇటువంటి విధినిషేధాలువల్లనూ, రోగులనుండి డబ్బు పుచ్చుకుని వైద్యంచేసే చికిత్సా కేంద్రాల్లో, (ప్రభుత్వం నెలకొల్పే పేయింగ్ క్లినిక్స్) సాయంకాలం వేళల్లో రోగులను చేర్చుకుని వైద్యంచేసే ఇతర చికిత్సా కేంద్రాల్లో వీరు అదనపుబాధ్యతలు నిర్వర్తించవలసి

ఉంటుంది. కనుకనూ డాక్టర్లకు ప్రభుత్వం ప్రత్యేక అలవెన్సు ఇవ్వడానికి నిర్ణయించుకున్నది. వైద్య, ఆరోగ్యశాఖలో పనిచేసే ప్రథమశ్రేణికి చెందిన వైద్యాధికారులందరికి వారి మూలవేతనంలో 60 శాతం అదనంగా నెలనెలా చెల్లిస్తారు. అయితే ఈ అదనపు అలవెన్సు ఏ పరిస్థితిలోనూ రు. 600 లకు మించరాదు. ఇక అసిస్టెంటు సర్జనకూ, హెల్తుఆఫీసర్లకూ వారి మూలవేతనలో 33-1/3 శాతం (మూడవవంతు) అదనపు అలవెన్సుగా నెలనెలా చెల్లిస్తారు. అయితే ఈ అలవెన్సు మొత్తం ఏ పరిస్థితిలోనూ నెలకు రు. 300కి మించరాదు.

డి.యం.యస్; అడిషనల్ డి.యం.యస్; వైద్య ఆరోగ్యశాఖల డిప్యూటీ డైరెక్టర్, సివిల్‌సర్జన్లు, క్లినికల్ ప్రొఫెసర్లులాంటి ప్రథమశ్రేణికి చెందిన అధికార్లు ప్రయివేటుప్రాక్టీసు చేయడాన్ని ఇదివరకే నిషేధించడం జరిగింది.

ఇప్పుడు ప్రభుత్వ డాక్టర్లు అందరూ కూడా కన్సల్టేషన్ ప్రాక్టీసుతోసహా, ప్రయివేటు ప్రాక్టీసు చేయరాదని. పూర్తి నిషేధం విధించడంవల్లనూ, వారికి ప్రత్యేక అలవెన్సులు ఇవ్వడానికి నిర్ణయించడంవల్లనూ ప్రభుత్వం నెలకొల్పే 'పేయింగ్ క్లినిక్'లలోనూ ఇతర చికిత్సా కేంద్రాలలోనూ డాక్టర్లు పనిచేయవలసి ఉంటుంది.

ప్రభుత్వ ఉత్తర్వును అనుసరించి ప్రభుత్వ పరిశ్రమలలో డాక్టర్లు ఒక నిర్ణీత మొత్తం ఫీజు క్రింద తీసికొని సలహాదార్లుగా పనిచేసే పద్ధతికూడా నవంబరు 1 నుండి రద్దవుతుంది. అయితే ప్రభుత్వసంస్థలలో పార్ట్‌టైమ్ పనిచేస్తున్న ప్రభుత్వ డాక్టర్ల విషయంలో మినహాయింపు ఉంటుంది.

## మెడికల్ సర్టిఫికెట్లు

నవంబరు 1 నుండి మెడికల్ సర్టిఫికెట్లు శరీర ఆరోగ్యం ధ్రువపరచే సర్టిఫికెట్లను ఆస్పత్రులలోనే 16 రూపాయలు ఫీజు తీసికొని జారీచేస్తారు. ఆస్పత్రి పనివేళలలోనే ఈ సర్టిఫికెట్లు మంజూరు అవుతాయి.

సివిల్‌సర్జన్లు అయితే 16 రూపాయలు, అసిస్టెంటు సివిల్ సర్జన్లు అయితే ఎనిమిది రూపాయల వంతున ఫీజు వసూలు చేస్తారు. ఇతరరకాల డాక్టర్ల విషయంలో మెడికల్ కోడు అనుసరించి ఫీజును నిర్ణయిస్తారు.

ప్రభుత్వ డాక్టర్లు కొన్ని సీరియస్‌కేసుల విషయంలో రోగుల ఇంటికివెళ్లి చికిత్సను చేయవచ్చు. ప్రైవేట్ డాక్టర్లు అందుబాటులోలేని సందర్భాలలోనే ఈ అవకాశం వుంటుంది. కాని ప్రభుత్వడాక్టర్లు తాముచూసిన సీరియస్ కేసుల గురించి 20 గంటలలోగా పై అధికారులకు నివేదించవలసి వుంటుంది. స్పెషలిస్టు అయితే 30 రూపాయలు, మెడికల్ ఆఫీసర్ అయితే 20 రూపాయలు వంతున ఇలాంటి సీరియస్ కేసులలో రోగులు చెల్లించవలసిన ఉంటుంది. ఈ మొత్తంలో 75 శాతం ప్రభుత్వానికి జమకట్టవలసి వుంటుంది.

స్పెషలిస్టులు, మెడికల్ ఆఫీసర్లు అవసరం అన్న ప్రజల నిమిత్తం ఆస్పత్రి పనివేళలకు భంగంలేకుండా డబ్బు తీసికొని చికిత్సచేసే పేయింగ్‌క్లినిక్ కేంద్రాలను ప్రభుత్వం ఏర్పాటు చేస్తుంది.

## ప్రభుత్వానికి ఖర్చు

ప్రభుత్వ డాక్టర్లు ప్రైవేట్ ప్రాక్టీసును నిషేధించి వారి అలవెన్సును పెంచడంవల్ల ఏడాదికి 68.07 లక్షలు ఖర్చు అవుతుంది. ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో మాత్రం 22.69 లక్షలు ఖర్చుపెట్టారు.

ప్రభుత్వ నిర్ణయంవల్ల అదనంగా జీతాలు పెంచవలసి వున్నది. ఈ ఉత్తరువు గ్రామీణ ప్రాంతాలలో పనిచేసే డాక్టర్లకు బాగా ఉపయోగం.

## ప్రభుత్వ ఆసుపత్రులలో ఔట్ పేషంట్లకు సౌకర్యాలు

ఈ నిర్ణయం, రాష్ట్రంలో ప్రస్తుతపు వైద్య సౌకర్యాలు మరింత హెచ్చు కావడానికి దోహదం చేయగలదు.

నవంబర్ 1 నుండి అన్ని టీచింగ్ హాస్పిటల్స్‌లో, జిల్లా ఆస్పత్రులలో, తాలూకా ఆస్పత్రులలో 'పేక్లినిక్'లు ఏర్పాటు చేస్తారు. ప్రత్యేక వైద్య నిపుణుల నుండి సహాయం పొందడానికి ఇవి ఉపయోగపడతాయి. దంత వైద్య కేంద్రాలను కూడా వీటితోపాటు నెలకొల్పుతారు.

అన్ని జిల్లాల తాలూకా ఆస్పత్రుల్లోను, అన్ని టీచింగ్ హాస్పిటల్స్‌లోను, సాయంత్రం 4 గంటల నుండి 7 గంటల వరకు కేంద్ర ప్రభుత్వోద్యోగుల సౌకర్యార్థం ప్రత్యేక వైద్య సహాయ కేంద్రాలను కూడా నడుపుతారు.

జంటనగరాలలో, నాంపల్లి ప్రభుత్వ ఆస్పత్రిలో, సుల్తాన్ బజారు ప్రభుత్వఆస్పత్రిలో, మలక్‌పేట పోలీస్ హాస్పిటల్‌లో, గోల్కొండ ప్రభుత్వ ఆస్పత్రిలో, టి.బి. ఆస్పత్రిలో కూడా ఈ విధమైన వైద్య కేంద్రాలను ఏర్పాటు చేస్తారు.

ఈ వైద్య కేంద్రం ముఖ్యంగా ఔట్‌పేషంట్ కేంద్రంగా పనిచేస్తుంది. ఔట్ పేషంట్ల వైద్య కేంద్రాల్లో లభించే సర్వవిధాలైన వైద్య సహాయం ఈ కేంద్రాల్లో లభ్యం అవుతుంది.

బోధనా సౌకర్యాలున్న ఆస్పత్రులలో ప్రతి స్పెషలిస్టు వారానికి కనీసం మూడు క్లినిక్‌లను, జిల్లా, తాలూకా ఆస్పత్రులలో వారానికి నాలుగు క్లినిక్‌ల చొప్పున నిర్వహిస్తారు.

పే క్లినిక్‌లను ప్రథమశ్రేణి ఫిజిషియన్లు, సర్జన్‌లు, బోధనా సౌకర్యాలున్న ఆస్పత్రులలో స్పెషలిస్టులు, సర్జరీ, మెడిసిన్‌లలో డిప్లొమో హోల్డరు, లేదా పోస్ట్ గ్రాడ్యుయేట్ డిగ్రీలున్న వారు, లేక జిల్లా ఆస్పత్రులలో స్పెషలిస్టు, తాలూకా ఆస్పత్రులలో మెడికల్ ఆఫీసరు నిర్వహిస్తారు

ఈ కొత్త పద్ధతి ననుసరించి మామూలు ఎక్స్‌రే ఫొటోలు, లేబొరేటరీ పరిశోధనలను అప్పటికప్పుడే చూస్తారు. కాని సవివరమైన దర్యాప్తుమాత్రం ఉదయం మాత్రమే జరుగుతుంది. ఇందుకు నిర్ణీత సమయాలను ముందుగా నిర్ణయిస్తారు

దేశంలో ప్రప్రథమంగా ప్రభుత్వ డాక్టర్ల ప్రైవేటు ప్రాక్టీసును నిషేధించిన పంజాబ్ ప్రభుత్వం కూడా ఈ పథకాన్ని అమలు జరుపుతున్నది.

## కొత్త పోలీసు ఇనస్పెక్టర్ జనరల్

శ్రీ ఆత్మా జయరాం అక్టోబరు 6న కొత్త పోలీసు ఇనస్పెక్టరు జనరల్‌గా శ్రీ శివకుమార్‌లాల్ స్థానే నియుక్తులయ్యారు. గడచిన ముప్పయ్‌ఏడేళ్ళుగా గణనీయమైన సేవచేసి శ్రీశివకుమార్‌లాల్ ఉద్యోగ విరమణ చేసిన సందర్భంలో యీ కొత్త నియామకం జరిగింది. శ్రీ శివకుమార్‌లాల్ అగ్నిమాపక దళ డైరెక్టరుగా, పౌర రక్షణ, అత్యయిక సమయ సహాయక శిక్షణా సంస్థ ప్రిన్సిపాల్‌గా కూడా వ్యవహరించారు.

## శాసనపర్వం

1968వ సం॥ భారత రేవులు (ఆంధ్రప్రదేశ్ సవరణ) బిల్లుకు రాష్ట్రపతి ఆమోదం లభించింది.

ప్రస్తుతం, 1908వ సం॥ భారత రేవులచట్టం క్రింద, రాష్ట్ర రేవులలో ప్రవేశిస్తున్న ఓడలపైన వసూలు చేస్తున్న పన్నులు రేవునిధుల లెక్కలలో జమచేయబడుతున్నాయి. అదేవిధంగా కోర్టు విధించిన పెనాల్టీలు, జరిమానాలు మినహా ఏ రేవులలోనైనా యీ చట్టంక్రింద, తదితర చట్టాలక్రింద నావికులపై విధించే జరిమానాలు, పెనాల్టీలు, పయిలెట్ సర్వీసులో నియోగించబడిన యితర వ్యక్తులపై విధించే జరిమానాలు, పెనాల్టీల మొత్తాలను రేవుల పయిలటేజ్ లెక్కలలో జమచేయబడుతాయి. రాష్ట్రప్రభుత్వ పరిపాలనలో రాష్ట్రంలో ఉన్న చిన్నతరహా రేవులలో ఇటువంటి నిధిసేకరణ అవసరం లేని ఫలితంగా పయిలటేజీ పద్దును యింతవరకు నిర్వహించడంలేదని రాష్ట్ర ప్రభుత్వానికి నివేదించారు.

రేవు నిధుల పద్దులో జమచేస్తున్న డబ్బును, రాష్ట్ర ఆదాయ, వ్యయాల బడ్జెటులో చేర్చకుండా, చట్టంలో పేర్కొన్న ప్రయోజనాల నిమిత్తం ఖర్చుచేస్తున్నారు. అయితే రాజ్యాంగంలోని 266వ సూత్రాన్ని అనుసరించి యీ మొత్తం రాష్ట్ర సమీకృత నిధిలో భాగమవుతుంది.

రాజ్యాంగంలోని 266వ సూత్రాన్ని అనుసరించి రేవునిధి పద్దులోని మొత్తాలను శాసనసభ ఆమోదంతో ఖర్చు చేయాల్సి ఉన్న కారణంగా రాష్ట్రానికి సంబంధించినంత వరకు 1908వ సం॥ భారత రేవులచట్టంలోని పైన పేర్కొన్న అంశాన్ని తొలగించి, ఆ రేవుల పద్దులోని మిగులు మొత్తాలను రాష్ట్ర సమీకృత నిధులకు జమచేయడం అవసరమని రాష్ట్రప్రభుత్వం భావిస్తున్నది. 1938వ సం॥ ఆంధ్రప్రదేశ్ ఆంధ్రప్రాంతం) చిన్నరేవుల నిధిచట్టంలోని 4వ సెక్షన్ అనుసరించి ప్రతి సంవత్సరం మార్చి 31వ తేదీ నాటికి చిన్నరేవుల పద్దులో మిగులుగా ఉన్న అటువంటి మొత్తాలను, శాసనసభ ఆమోదించిన తీర్మానాన్ని అనుసరించి రాష్ట్రప్రభుత్వం, యితర రాష్ట్ర ఆదాయాలతో జమచేసి వాటితోపాటుగా వినియోగించడానికి నిర్ణయించవచ్చు రేవునిధిని రద్దు చేయాలని ప్రతిపాదించినందున 1938వ సం॥ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్రప్రాంతం) చిన్నరేవుల నిధి చట్టాన్ని రద్దుచేయాలని రాష్ట్రప్రభుత్వం తలపెట్టింది.

పై లక్ష్యాన్ని నెరవేర్చడానికి యీ బిల్లు ఉద్దేశించబడింది.

## 1968 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ ఎక్సైజుబిల్లుకు రాష్ట్రపతి ఆమోద ముద్ర

1968 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ ఎక్సైజుబిల్లుకు భారత రాష్ట్రపతి ఆమోద ముద్ర లభించింది. మత్తుపదార్థాల ఎగుమతి దిగుమతులనూ, రాష్ట్రంలో వాటి తయారీని, బట్టీలనుండి యితర సాధనాలనుండి వాటి సేకరణనూ క్రమబద్ధంచేయడం ఈ బిల్లు ఉద్దేశం.

క్రొత్త నిబంధనలక్రింద, బహిరంగంగా మత్తుపదార్థాలు వాడబడే ప్రాంతాలలో, అంటురోగ బాధితులైన పిల్లలనుకాని, వ్యక్తులనుకాని నియమించుకొనడం పూర్తిగా నిషేధించబడింది. మత్తుపదార్థాలను తయారుచేసే చోటా, నిలవజేసే చోటా ప్రవేశించి తనిఖీ చేసేందుకు వారంటులేకుండానే ఈ బిల్లు నిబంధనలక్రింద దోషిగా పరిగణించబడిన ఏ వ్యక్తినైనా అరెస్టు చేసేందుకు, ఎక్సైజ్ కమిషనరుకూ, ఎక్సైజు కలెక్టరుకూ ఈ బిల్లు అధికారాలు సక్రమింపజేస్తుంది.

# బోధనా భాషగా తెలుగు

వెలగా వెంకటప్పయ్య

ఇరవయ్యో శతాబ్దంలో విజ్ఞాన లోకంలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. అనేక నూతన శాస్త్రాలు, సిద్ధాంతాలు వెలుగులోకి వచ్చాయి. వాటిలో గ్రంథాలయశాస్త్రం ఒకటి. గత శతాబ్ది తుది పాదంలో యీ శాస్త్రానికి పాశ్చాత్య దేశాలలో ప్రాతిపదిక ఏర్పడినప్పటికీ యీ శతాబ్దంలో గాని ఒక స్థాయికిరాలేదు. విదేశీయుల సహకారంతో మనదేశంలో పాదంపెట్టిన గ్రంథాలయ శాస్త్రం, యీ నాడు యిచటకూడ ప్రత్యేక ప్రతిపత్తిని సంపాదించింది. అన్నివిధాల యితర శాస్త్రాలతో సమానమయిన స్థాయిని సంపాదించింది. ఇటీవలే భారత ప్రభుత్వం గ్రంథపాలకు లిద్దరిని పద్మశ్రీ గౌరవంతో సత్కరించడమేగాక, డాక్టర్ యస్ ఆర్ రంగనాథన్ గారిని గ్రంథాలయ శాస్త్రంలో నేషనల్ ప్రొఫెసర్‌గా నియమించింది. ఈ గౌరవ దక్కిన శాస్త్రాలను వ్రేళ్ళమీద లెక్కించవచ్చును. దీనిని బట్టి భారతదేశంలో గ్రంథాలయశాస్త్రానికున్న ప్రాశస్త్యాన్ని మనం ఊహించవచ్చును.

## గ్రంథాలయ శాస్త్ర బోధన

ఈ శాస్త్రం దాదాపు మూడుదశాబ్దాలను పైగా భారతదేశంలో యింగ్లీషులో బోధింపబడుతూ ఉంది. ఇటీవల యీ శాస్త్రం విశ్వవిద్యాలయాలలోనూ, యితర సంస్థలలోనూ, గ్రంథాలయ సంఘాలలోనూ సర్టిఫికెట్ కోర్సు డిగ్రీ, మాస్టర్సు డిగ్రీ 2 స్థాయిలలో బోధన జరుపబడుతూఉంది. సర్టిఫికెట్ స్థాయిలో విద్యాబోధన తెలుగులో గరపాలని ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం చిరకాలంగా ఆందోళన చేస్తూ ఉంది. దీనికి తోడుగా యూనివర్సిటీ గ్రాంట్సు కమీషనూ, భారత ప్రభుత్వం నియమించిన గ్రంథాలయ సలహా సంఘమూ యీ కోర్సును విశ్వవిద్యాలయాలు నిర్వహించరాదనీ, గ్రంథాలయ సంఘాలు నిర్వహించాలనీ, సిఫారసు చేశాయి. వీటన్నిటినీ అనుసరించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1965 నవంబరు మాసంలో ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘానికి తెలుగులో సర్టిఫికెట్ కోర్సు నిర్వహించడానికి అనుమతినిచ్చింది. ఇందుకోసం గ్రంథాలయ సంఘం 1966 ఆగష్టు నుంచి ప్రత్యేకంగా గ్రంథాలయ శిక్షణాలయాన్ని స్థాపించింది. అప్పటి నుంచీ యీ శిక్షణాలయం వరుసగా రెండు సంవత్సరాల పాటు నిర్వహించ బడింది. బోధనలో అనేక ప్రయోగాలను చేసింది.

ఇటీవల అన్ని విషయాలను కళాశాల స్థాయిలో తెలుగులో బోధించవలెనని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. శాస్త్ర విషయాల బోధనకు అనువుగా తెలుగుభాష అభివృద్ధి చెందలేదనీ, తగిన పారిభాషిక పదజాలం అందులేదనీ, శాస్త్ర విషయాలు బోధించడం తెలుగులో అసాధ్యమనీ కొందరు విద్యావంతులు, విద్యావేత్తలు భావిస్తున్నారు. కాని అది వాస్తవం కాదేమో అనిపిస్తుంది. ధైర్యంచేసి ముందుకు వస్తే ఏ విషయ బోధనైనా సుసాధ్యమనిపిస్తుంది. పరిభాషను ఏర్పరచడం సాధ్యమనిపిస్తుంది. రెండు సంవత్సరాలపాటు గ్రంథాలయ శాస్త్ర విషయాలను విద్యార్థులకు తెలుగులో తొలిసారి బోధించిన అనుభవం రీత్యా కొన్ని విషయాలను, మేము అనుసరించిన విధానాలను చదువరుల ముందువుంచుతున్నాను.

## పాఠ్య గ్రంథాలు

శిక్షణాలయ ప్రారంభంలో తెలుగులో గ్రంథాలయ శాస్త్ర బోధన సాధ్యమవుతుందా అని చాలమంది అనుభవనీయులైన గ్రంథపాలకులకు సందేహం కలుగకపోలేదు. నిజానికి పాఠ్య గ్రంథాలు, నాటికి తెలుగులో లేవు. శాస్త్ర పరిభాషను ఉపయోగించి అప్పుడప్పుడు "గ్రంథాలయ సర్వస్వము" పత్రికలో ప్రచురింపబడిన రచనలు మాత్రం ఉన్నాయి. అయితే అప్పటికప్పుడు అమాంతంగా ఇంగ్లీషు పుస్తకాలను అనుసరించి తెలుగులో గ్రంథాలు వ్రాసి, ప్రవేశాక తరగతులు ప్రారంభించలేదు. ముందే ప్రారంభించాం. ఆంగ్లంలో లభిస్తున్న శాస్త్ర విషయాలను మనదేశంలోని, రాష్ట్రంలోని పరిస్థితులకు సమన్వయ పరచుకొని ముందుగా ఆంగ్లంలో నోట్సు వ్రాసుకొని ఆ తర్వాత తెలుగులో–అంటే తెలుగు నుడికారపు సొంపుగల వ్యవహారిక భాషలో–పాఠ్య గ్రంథాల వ్రాతప్రతులు తయారుచేశాము. వీటి ఆధారంతో మొదటి జట్టుకు బోధించాము. బోధనలోగల అనుభవంతో రెండవజట్టు ప్రారంభంలో ఆ పాఠ్యగ్రంథాలను మరింత సుబోధకంగా ఉండేట్టు

తిరుగ వ్రాశాము. ఇదే విధంగా మరల మూడవ జట్టు ప్రారంభంలో చేశాము. అప్పటికి పాఠ్యగ్రంథాలు ఒక స్థాయికి వచ్చినట్లు ఉపాధ్యాయ బృందం అభిప్రాయపడింది. ఆ తర్వాత యీ గ్రంథాలను అచ్చు వేసేందుకు ప్రయత్నాలు జరిగాయి.

## సాంకేతిక పదజాలం

ఇతర శాస్త్రాలలాగే గ్రంథాలయ శాస్త్రానికి గూడ వేల సంఖ్యలో సాంకేతిక పదజాలం వృద్ధి అయింది నిరంతరం భారత దేశంలోనూ, యితర దేశాలలోను జరిగే పరిశోధనల వలన మరింత వృద్ధవుతూ ఉంది. పాఠ్యాంశాల రచనలో యీ పద జాలాన్ని తెలుగు చేసే సమస్య లేకపోలేదు. ఈ శాస్త్రంలో యింతకు ముందే యింగ్లీషులో, హిందీలో పారిభాషిక పదకోశాలు వచ్చాయి. జాతీయ గ్రంథ సూచీ నిర్మాణంలో కలకత్తాలోని జాతీయ గ్రంథాలయంవారు కొన్ని పదాలను రూపొందించారు. ఈ పదాలన్నిటినీ యథాతథంగా స్వీకరింపక, అనుకూలమైన వాటినే స్వీకరించి, మిగతావాటికి తెలుగు వాడుకను, సంప్రదాయానికి తగినట్లు పరిభాష రూపొందించాము. ఉదాహరణకు—

స్థాయిలలోనూ ఉపయోగించిన అదృష్టం, గౌరవం తొలిసారిగా ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘానికే దక్కిందనుకుంటాను. ముందడుగుకు ప్రభుత్వ అండలు, పౌరగ్రంథాలయశాఖవారి చేయూత నిండుగా ఉన్నది.

## ఫలితాలు

మా శిక్షణాలయంలో మెట్రిక్యులేషన్, పి. యు. సి. చది విన విద్యార్థులు హెచ్చుగా ఉంటారు. వీరికి ఇంగ్లీషులో శాస్త్ర విషయాలు బోధించి, ఇంగ్లీషులో సమాధానాలు వ్రాయమంటే ఆ పని ఫలవంతంగా చాలమంది చేయలేరు. అదే పని తెలుగు భాషలో చేసేట్లయితే విద్యార్థులు విషయాన్ని సులభంగా అవగా హన చేసుకొనడమేగాక, అడిగిన ప్రశ్నలకు సమాధానాలు సుల భంగా చెప్పగలుగుతున్నారు, వ్రాయగలుగుతున్నారు. ఇంగ్లీషు బోధనలో నూటికి 50, 60 శాతం ఫలితాలు వస్తే, ప్రభుత్వం నిర్వహించిన పరీక్షలలో నూటికి 95, 100 శాతం ఫలితాలు వచ్చా యంటే మీకు ఆశ్చర్యం కలుగవచ్చు. దీనికి కారణం బోధన మాతృభాషలో ఉండటమేనని పలువురు పరిశీలకులు భావించారు

| సంఖ్య | ఆంగ్ల పదం | జాతీయ గ్రంథాలయంవారి పరిభాష | గ్రంథాలయ శిక్షణాలయంవారి పరిభాష |
|---|---|---|---|
| 1. | Book Number | పుస్తక అంకము | పుస్తక సంఖ్య |
| 2. | Collaborator | సహకారి | సహగ్రంథకర్త |
| 3. | Cross reference | విషయాంతరసూచి | అడ్డకోత |
| 4. | Entry | ప్రవిష్టము | పద్దు |
| 5. | Librarian | గ్రంథాలయాధ్యక్షుడు | గ్రంథపాలకుడు |

వీటితోగాక తెలుగులో బాగా ప్రచారంలో ఉన్న కార్డు, బైండరు, డైరెక్టరు మొదలయిన ఆంగ్ల పదాలను యథాతథంగా స్వీకరించడం జరిగింది. తరగతులు నిర్వహించే సమయంలో విద్యార్థులు సూచించిన పదాలనుగూడ కొన్ని స్వీకరించాము. ఈ విధంగా చేయడం వలన ఉపాధ్యాయులకు, విద్యార్థులకు సాంకేతిక పదజాలంలో సహజంగా ఉండే క్లిష్టత తొలగిపోయింది. గత రెండేళ్ళకాలంలో అనేక నూతన పదాలు గ్రంథాలయ సేవలో తెలుగులో వాడుకలోనికి వచ్చాయి.

## బోధన

అన్ని విషయాల (సబ్జక్టు) లోనూ బోధన తెలుగు వ్యవ హారికభాషలో చేశాము. విశ్వవిద్యాలయాలు, కళాశాలల్లోగూడ పాఠం చెప్పడం ఎప్పుడూ వ్యవహారిక భాషలోనే ఉంటుంది (వ్యాకరణపాఠంతోసహా) ; గ్రాంథిక్ భాషలో పాఠం చెప్పడం యీ రోజుల్లో దుస్సాధ్యంగదా. ఇహ వ్రాత, పాఠ్యగ్రంథాలు పూర్తి గ్రాంథికంలో ఉంటాయి. ఈ వ్యత్యాసాలులేక మా శిక్ష ణాలయంలో బోధన, నోట్సు, పాఠ్యగ్రంథాలు, వ్రాత అన్నీ వ్యవహారిక భాషలోనే. ఈ విధంగా వ్యవహారిక భాషను అన్ని

## కొన్ని సమస్యలు

ఈ మార్పులన్నిటినీ ఒకేసారి బోధనలో తీసుకురావడంలో మాకు కొన్ని సమస్యలు ఎదురుపడక పోలేదు. మా శిక్షణాలయంలో ప్రతిజట్టులో సుమారు 45 మంది విద్యార్థులుంటారు. మాట్లాడేభాష తెలుగే సప్పటికీ, ఉచ్చారణలో, ఉనికిలో అనేక అంతరాలు గల 20 జిల్లాలలో ప్రతి జిల్లా నుంచి ఒకరిద్దరు విద్యార్థులు తప్పక ఉంటారు. వీరిలో దాదాపు సగం మందికి ఖర్చు ప్రభుత్వమే భరిస్తుంది. పూర్తిగా వ్యవహారిక భాషకు స్వేచ్ఛ యివ్వడంలో ప్రశ్నలడిగినప్పుడు వారి భాషలో సమాధానం చెబుతుంటారు. వ్రాయమన్నప్పుడు వారిభాషలో వ్రాస్తుంటారు. ఎంత వద్దను కున్నా ఆ యా ప్రాంతాల మాండలికాలు, నుడికారాలు వ్రాత లోకి వచ్చిపడతాయి. గ్రాంథికభాషలో దీనిని అరికట్టవచ్చునేమో గాని వ్యవహారిక భాషలో సాధ్యంకాలేదు, కాదు. పైగా శబ్ద స్వరూపంలో, క్రియాప్రయోగంలో, వాక్యనిర్మాణంలో రాయలసీమ కృష్ణా, గోదావరి, తెలంగాణా ప్రాంతాలలో ఎంతో వ్యత్యాసం కనుపించింది. మేము బోధించిన శబ్దస్వరూపాన్ని, క్రియా ప్రయోగాలను, వాక్యనిర్మాణాన్ని ప్రమాణంగా తీసుకోవాలా?

లేక వివిధ ప్రాంతాలనుంచి వచ్చిన విద్యార్థుల ప్రయోగాలను అంగీకరించాలా? ఇందులో ఏది తప్పు? లేదా అన్నిటినీ అంగీకరించాలా? ప్రమాణపాఠాలు ఏవి? వ్యవహారిక భాషలోగల సౌలభ్యాన్ని, స్వేచ్ఛను అరికట్టడం ధర్మమా?—అనే అనేక సమస్యలు శరపరంపరగా మమ్మల్ని చుట్టుముట్టాయి. అయితే మా శిక్షణ వృత్తిప్రధానమైనది గనుక, భాషకంటె విషయం ప్రధానమైనది గనుక – పరీక్షపత్రాలలో విషయానికి మాత్రమే ప్రాధాన్యత యిచ్చి ఏదో విధంగా రాజీ పడవలసివచ్చింది. మరి యీ రాజీమార్గం భాషా, సాహిత్యబోధనకు, మిగతా విషయాలకు అన్వయించవచ్చునా? అనే విషయం అనుభవనీయులు చర్చించి నిర్ణయించవలసిన సమస్య.

## కొన్ని పరిష్కార మార్గాలు

వ్యవహారిక భాషలో బోధించడం వలన ఎదుర్కొన్న సమస్యలను గురించి యిటీవల విశ్వవిద్యాలయాలలోనూ, కళాశాలల్లోనూ, పాఠశాలల్లోనూ పనిచేసే అనుభవనీయులైన ఉపాధ్యాయులతో చర్చించాను. వీరిలో కొందరు సరళ గ్రాంథికభాషను బోధనకు ఉపయోగించిన సమస్యలు తీరుతాయని చెప్పారు. హెచ్చుమంది వ్యవహారిక భాషనే కొనసాగించమన్నారు. పద స్వరూపాలలో, క్రియాప్రయోగాలలోగల అంతరాలను తగ్గించడానికి యీ ప్రయోగాలను కొన్నిటినీ స్థిరీకరించి వాటి వాడుకను మాత్రమే అనుమతించమని సలహా యిచ్చారు. దీనివలన యింతకు ముందుదయించిన సమస్యలు పరిష్కార మవుతాయన్నారు. అయితే స్వేచ్ఛా సౌలభ్యంగల వ్యవహారిక భాషను స్థిరీకరించడంవలన యిప్పటి గ్రాంథిక భాషకు కలదనుకుంటున్న జడత్వం వ్యవహారిక భాషకు సిద్ధించదా? ఈ ప్రశ్నకు మాకు సమాధానం లభించలేదు. అయినా ప్రయోగించి చూస్తేగాని ఫలితాలను పూర్తిగా చెప్పలేము

అయితే ఒక విషయంమాత్రం విద్యావంతులు, విద్యావేత్తలు, ఉపాధ్యాయులు గుర్తించాలి. కనీసం డిగ్రీస్థాయిలోపు ఏవిషయాన్నయినా మాతృభాషలో బోధించడం అంత కష్టంకాదు. అందునా, సజీవమైన వ్యవహారికభాషలో అయితే మరీ సులువు. క్రొత్తగా నేర్చుకొనేవారికి పరాయి భాషకంటే మాతృభాష అన్ని విధాలా సులభం. అధ్యయనంలో నిత్యం ఎదుర్కొనే భాషా సమస్య అప్పుడురాదు. అయితే యీ పని మారుతున్న ప్రపంచాన్ని గుర్తించిన ఉపాధ్యాయునికి, విజ్ఞాన సముపార్జన, అధ్యాపనలో నిమగ్నత, వృత్తియందు గౌరవం, ప్రేమగల ఉపాధ్యాయునికి తప్పక సాధ్యపడుతుంది. ఇహ సమస్యలంటారా? ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి. పరిష్కరించేప్పుడు కొత్తసమస్యలు, పరిష్కారాలతోబాటు ఉత్పన్నమవుతూ ఉంటాయి!

చెరువులో దిగితేగాని ఈతరాదు. చెరువుగట్టున కూర్చుని యీతపై గ్రంథాలు వల్లిస్తే ప్రయోజనం శూన్యం. *

---

## గాంధీజీ - సైకిలు

ప్రార్థన సమావేశానికి సకాలంలో వెళ్ళడానికి గాంధీజీ 1927 లో సైకిలు ఎక్కిన సంఘటన ఒకటి బయటపడింది. గుజరాత్ విద్యాపీఠంలో ఉపన్యాస మిస్తున్న గాంధీజీ కారు ఎక్కడికో వెళ్లి సకాలంలో రాలేదు. నిర్ణీత సమయానికి సబర్మతీ ఆశ్రమంలో ప్రార్థన సమావేశానికి వెళ్ళవలసిన గాంధీజీ, అక్కడవున్న వారినుంచి సైకిలు తీసుకున్నారు. అయితే ఆయన సైకిలు తొక్కడం అంతకు పూర్వం ఎప్పుడో మానివేసినందున ఆయనను ఒకరు సైకిలుపై ఎక్కించి కొంతదూరం తోయగా అక్కడ నుంచి మైలున్నర దూరం ఆయన సైకిలు తొక్కి సబర్మతీ ఆశ్రమం సకాలంతో చేరుకున్నారట.

# రిగ్గులు

వి. నాగరాజన్

ఇటీవలి కొద్ది మాసాల్లో, రాష్ట్రమంతటా మొత్తం యిరవై జిల్లాల్లో, యిదివరకెన్నడూ కనీవినీ యెరుగని విధంగా తీవ్ర దుర్భిక్ష పరిసితి, నీటి కరువు పరిస్థితులు ఏర్పడినవి—ఇందువల్ల ఆంధ్రప్రదేశ్‌లో క్షామ బాధితుల సహాయార్థం అగ్రో—యిండస్ట్రీస్ కార్పొరేషన్ ద్వారా తొలిసారిగా రిగ్గు యంత్రాలను దిగుమతి చేసుకోవలసి వచ్చింది. పూర్తిగా ప్రభుత్వ యాజమాన్యాన నడిచే ఈ సంస్థ షేరు ధనంలో కేంద్రం వాటా 49 శాతం అయితే రాష్ట్రప్రభుత్వం వాటా 51 శాతం. తీవ్రమైన మంచినీటి కొరతకు గురియై అలమటించే రాయలసీమ ప్రాంతీయులకు ఈ రిగ్గులు ఒక వరప్రసాదం వంటివి. నీటి కరువు పరిస్థితులలో ప్రజలకు తక్షణ సహాయం అందజేసేందుకూ, శాశ్వతంగా, ఈ సమస్యను పరిష్కరించేందుకూ అగ్రో—యిండస్ట్రీస్ కార్పొరేషన్ 'క్రాష్‌ప్రోగ్రామ్' ఒక దానిని రూపొందించింది. తాత్కాలిక సర్దుబాటుకు బదులు, శాశ్వతంగా సమస్యను పరిష్కరించడమే నేడు ప్రధానమైన విషయం.

రిగ్గులు వివిధరకాలు:—హాల్కో డ్రిల్లింగ్ రిగ్గులు, లాంగ్ యియర్ 34— రిగ్గులు, రోటరీ రిగ్గులు మొదలైనవి. బావులు త్రవ్వేందుకూ, మంచినీటిని సరఫరా చేసేందుకూ, సేద్యపు నీటి సదుపాయాలకు ఆసరాగా వుండేందుకూ భూగర్భజలాన్ని వెలికి తీయాలంటే డీసల్ యింజన్‌తో నడిచే రిగ్గుయంత్రాలను ఉపయోగిస్తారు. పుష్కలంగా నీరు అందించి, మంచినీటి కొరతను తీర్చడం — సకాలానికి నీరు పారించి ఎండిపోతున్న పైరులకు రక్షణ కల్పించడం — పంటలను సాధ్యమైనంతవరకూ వర్షాలమీద ఆధార పడకుండా చేయడం, వ్యవసాయ సంబంధ పరిశ్రమలకు దోహదం చేయడంలాంటి సదుపాయాలను ఈ రిగ్గులు మనకు కల్పిస్తాయి.

డెల్టాప్రాంతాల మెరక నేలల్లో చాలావరకు రోటరీ రిగ్గులను ఉపయోగిస్తే, గట్టిరాతి నేలల్లో, దిగుమతి చేయబడే రిగ్గులనే వాడుతారు. డెల్టాప్రాంతంలో 1000 అడుగుల లోతునా, తక్కిన ప్రాంతలో 500 అడుగుల లోతునా భూగర్భజలసంపద లభిస్తుంది. నేలల తరహాలను బట్టి, వాడే రిగ్గుల రకాన్నిబట్టి డ్రిల్లింగ్‌ఛార్జీలు మారుతుంటాయి. కేసింగ్ మినహాయించి ఒక అడుగు లోతుకు డ్రిల్లింగ్ ఛార్జీ రమారమి 20 రూపాయలు వుంటుంది. స్వదేశీ రిగ్గులు లభ్యపడేంతవరకూ ఆత్యయిక పరిస్థితి నెదుర్కొనేందుకు విదేశాల నుండి రిగ్గులను దిగుమతి చేసుకొనవలసి వుంటుంది. ఎనిమిదిలక్షలా యాభై వేల రూపాయల మేరకు విదేశీమారక ద్రవ్యం వినియోగపరచుకొని యునైటెడ్ కింగ్‌డమ్ నుండి రిగ్గులను దిగుమతి చేసుకొనేటట్లు నిర్ణయించ బడింది. (విడి భాగాలకు



రిగ్గు యంత్రంతో భూగర్భజలాల్ని వెలికితీసే ప్రయత్నం

మాత్రమే విదేశీమారక ద్రవ్యం మంజూరు చేయబడుతున్నది) విదేశీమారక ద్రవ్యంవిషయంలో కేంద్రం సంపూర్ణ సహకారాన్ని అందజేసుందని ఆశించబడుతున్నది. దీనితో పాటు అప్పురూపంలోనో, లేక ఒకేఎత్తున కొనుగోలు చేయడంద్వారానో రాష్ట్రంలో 1968 అక్టోబర్ నెలాఖరులోపల 71 రిగ్గులను సేకరించేందుకు కృషి జరుగుతున్నది. ఇదివరకే 15 రిగ్గులు సేకరించబడ్డాయి. వీటిని జిల్లాలకు పంపిణీ చేసే విషయంలో కూడా ఏర్పాట్లు జరుగుతున్నాయి. హైదరాబాద్ జిల్లా, మేడ్‌చల్ తాలూకులో షామీర్‌పేటకు సమీపంలో తూముకొండ గ్రామంలో గత సెప్టెంబర్ 26 వ తేదీన మొదటి రిగ్గు పనిచేయడం ప్రారంభించింది.

అనుకున్న లక్ష్యాన్ని సాధించేందుకూ, తగిన సన్నాహంతో సవాలు నెదుర్కొనేందుకూ 14 హాల్కొ మైనర్ రిగ్గులనూ 4 హాల్లో టైగర్ రిగ్గులనూ, 5 లాంగియర్ 34 రకం రిగ్గులనూ, సరఫరా చేయవలసిందిగా వివిధ కంపెనీలకు ఆర్డర్లు యివ్వడం జరిగింది. 50 రోటరీ రిగ్గులను తెప్పించుకొనేందుకు టెండర్లు పిలవడం కూడా జరిగింది. ఈ సంవత్సరం డిసెంబరు లోపుగా టెండర్ల తుది నిర్ణయం జరుగుతుందనీ, వచ్చేసంవత్సరం ఏప్రెల్ నుండి సప్లై ప్రారంభమౌతుందని ఊహించబడుతున్నది. దిగుమతి చేసుకొనే రిగ్గు ఖరీదు యూనిట్ ఒకటికి 50,000 రూపాయలు అయితే, దేశీయ రిగ్గు యూనిట్ ఒకటికి 80,000 రూపాయల ఖరీదౌతుంది. లాంగియర్— 34 రకం రిగ్గు యూనిట్ ఒకటికి 3,00,000 రూపాయల ఖరీదు చేస్తుంది.

అంచెల వారిగా జరిగే ఈ డ్రిల్లింగ్ కార్యక్రమం జిల్లా కలెక్టర్ల నివేదికలను బట్టి ఆయా జిల్లాల సత్వర అవసరాలను తీర్చేవిధంగా తయారుచేయబడింది. రాష్ట్రం మొత్తం మీద 11,000 బోరింగులను చేయాలని అంచనా. ముఖ్యమైన అవసరాలు తీర్చిన పిమ్మట, కేవలం వాణిజ్య ప్రాతిపదిక పై ప్రైవేటుగాకూడా

ఈ డ్రిల్లింగ్ కార్యక్రమం చేపట్టబడుతుంది. డెల్టా ప్రాంతంలో రైతులు మూడో పంట పండించవచ్చునని, అందుకోసం, బోరింగ్ ఖర్చు భరించేందుకు కూడా వారు సిద్ధపడి వుంటారనీ భావించ బడుతున్నది.

ప్రతి రిగ్గుకు యిద్దరు పనిమనుషులు కావాలి. ఒకరు ఆపరేట్ చేసేందుకూ, మరొకరు క్లీనింగ్ చేస్తూ సహాయ పడేందుకూకావాలి. నిరుద్యోగ సమస్య విచ్చలవిడిగా వుండే ఈనాడు రోజు లో కొంతవరకూ ఈ రిగ్గుల కార్యక్రమం తారకం అవుతుంది. సాంకేతికంగా యోగ్యతలు కలిగిన యువజనులను రిక్రూట్ చేసుకొనేందుకు కార్పొరేషన్ ఉదేశించింది. నిరుద్యోగులుగా వుండే యింజనీరింగ్ లైసెన్షియేట్లకు రిక్రూట్మెంట్ విషయంలో ప్రాధాన్యత లభిస్తుంది.

'ఐదేళ్ళ అంచెలవారీ డ్రిల్లింగ్ కార్యక్రమం ముగిసిన తర్వాత, రాష్ట్రంలో నీటి కరువు పరిస్థితి, మంచినీటి ఎద్దడి సమస్యా పూర్తిగా నిర్మూలించ బడతాయని' ఈ రంగంలో విశేష అనుభవం సంపాదించిన, రాష్ట్ర అగ్రో-యిండస్ట్రీస్ కార్పొరేషన్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ బి. యన్. రామన్ అంటారు. తగిన కార్యక్రమాలు రూపొందించి సత్వరం అమలు జరిపించే విషయంలో, కార్పొరేషన్ కృషి ఫలించగలదని ఆకాంక్షిద్దాం.

"ముఖ్యంగా రాష్ట్రాల అభివృద్ధికి, తద్వారా దేశాభివృద్ధికి తోడ్పడే ఈ అగ్రో-యిండస్ట్రీస్, కార్పొరేషన్లు స్థాపించడంలో గల లక్ష్యం; ఏదో కొంత మెషనరీ మొదలైన వాటిని అద్దె ప్రాతిపదికపై కొనుగోలుచేసి, పంపిణీ చేయడంతోనే పూర్తికాదు. క్రమేపి ఈ సంస్థలు ఆ మెషనరీల ఉత్పత్తి రంగంలో ప్రవేశించ కలిగిన నాడే లక్ష్యం సిద్ధించినట్లౌతుంది." అనేది శ్రీ రామన్ గారి అభిప్రాయం. అలా జరిగినప్పుడు కొన్ని కొన్ని మెషనరీలు, విడిభాగాలు మున్నగు వాని విషయంలో కొరతకు అవకాశంవుండదు. అన్ని వేళల్లోను వ్యవసాయాభివృద్ధి పెరిగే అస్కారంకూడా వుంటుంది. *

---

# వ్యవసాయరంగంలో రైతులకు అధిక సదుపాయాలు

ఇటీవల నెలకొల్పబడిన అగ్రో-యిండస్ట్రీస్ కార్పొరేషన్, వచ్చే అయిదు సంవత్సరాలలో రైతులకు వ్యవసాయరంగంలో వివిధ సేవా సదుపాయాలు కల్పించే నిమిత్తం రు. 212 కోట్లు ఖర్చయ్యే ఒక కార్యక్రమాన్ని రూపొందించింది. అక్టోబర్ 10వ తేదీన పత్రికలవారితో మాట్లాడుతూ, ఈ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ బి. యన్. రామన్, వచ్చే సంవత్సరాంతం లోపల కార్పొరేషన్ రూ 3 కోట్లు ఖరీదుచేసే 250 ట్రాక్టర్లు తెప్పించి వుంచగలదనీ, వీటిలో చాలవరకు దిగుమతికాబడే ట్రాక్టర్లు వుంటాయనీ అన్నారు.

పది ఎకరాల లోపల భూములు వుండి, ట్రాక్టర్లు కొనుగోలు చేసే స్తోమతలేని రైతులకు ఈ ట్రాక్టర్లు అందుబాటులో వుంచబడుతాయని కూడా ఆయన అన్నారు.

సంవత్సరానికి ఒక లక్ష ఎకరాలను అభివృద్ధి పరచేందుకు ఈ ట్రాక్టర్లు సహకరించగలవని అంచనా. అద్దె-కొనుగోలు ప్రాతిపదికపై కూడా వీటిని విక్రయించడం జరుగుతుంది.

ముందు సంవత్సరాలలో 10 వేల ట్రాక్టర్లు దిగుమతి చేసుకుంటున్న భారత ప్రభుత్వం, అగ్రో-యిండస్ట్రీస్ కార్పొరేషన్ ద్వారా ఈ ట్రాక్టర్లను అద్దె-కొనుగోలు ప్రాతిపదికపై రైతులకు అందజేయాలని నిర్ణయించింది.

వచ్చే అయిదు సంవత్సరాల కాలంలో 15000 ట్రాక్టర్లను అద్దె-కొనుగోలు ప్రాతిపదికపై రైతులకు విక్రయించేందుకు కార్పొరేషన్ ఒక కార్యక్రమాన్ని తయారు చేసిందనీ, దీనిమీద 12.5 కోట్ల రూపాయల టర్నోవరు వుంటుందనీ, మేనేజింగ్ డైరెక్టర్ అన్నారు.

రాష్ట్ర విద్యుచ్ఛక్తిబోర్డు సహకారంతో, కార్పొరేషన్ పంపుసెట్లు, తదితర పరికరాలనుకూడా అద్దె-కొనుగోలు ప్రాతిపదికపై రైతులకు అంద జేయగలదని ఆయన వ్యక్తపరిచారు. వచ్చే అయిదు సంవత్సరాల కాలంలో, విద్యుచ్ఛక్తిబోర్డు 2 లక్షల పవర్ కనెక్షన్లు ఇచ్చేందుకు కార్యక్రమాన్ని రూపొందించింది. వీటన్నిటి విషయంలో పంపుసెట్లు అందజేయబడేందుకు 40కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా.

ముందుముందు, కార్పొరేషన్ భారీయెత్తున ఫుడ్ ప్రోసెసింగ్ పరిశ్రమను చేపట్టగలదనీ, ప్రస్తుతముంటున్న రైసుమిల్లులను ఆధునికీకరించేందుకే నూరుకోట్ల రూపాయల మేరకు పెట్టుబడి కావలసి వుంటుందనీ, యిలా చేసినపుడు మిల్లులు అధిక ఫలితాలిచ్చే విధంగా పనిచేయగలవనీ శ్రీ రామన్ అన్నారు. ఈ కార్యక్రమానికి వాణిజ్య బ్యాంకుల సహకారం సాధ్యపడవచ్చునని, లేనియెడల కార్పొరేషనే ఈ కార్యక్రమానికి దిగవలసి వస్తుందనీకూడా ఆయన తెలియజేశారు.

మిల్లుల ఆధునికీకరణ కార్యక్రమానికి ఆర్థిక వనరులనుండి కార్పొరేషన్ 25కోట్ల రూపాయలు ప్రోగుచేసికొనవలసి వస్తుందనీ, తక్కిన సహాయం బ్యాంకులనుండి, యితర పరపతి సంస్థలనుండి ఏజెన్సీలనుండి లభ్యపడగలదని శ్రీ రామన్ అన్నారు. 2 కోట్ల రూపాయల వాటాధనంతో స్థాపించబడిన అగ్రో-యిండస్ట్రీస్ కార్పొరేషన్ నిర్వహణ పెట్టుబడిని పెంచేందుకు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు దోహదం చేయవలసినదిగా కోరడం జరుగుతున్నదని కూడా ఆయన వ్యక్తపరిచారు.

## ఐ. ఆర్. 8 రకం వరి విత్తనాలపట్ల అధిక ఆదరణ

పశ్చిమ గోదావరి జిల్లాలోని పెనుమంత్ర బ్లాకులో గ్రామాలలో ఐ. ఆర్. 8 రకం విత్తనాలకు అత్యధిక దిగుబడి

ఉండే వరి విత్తనాలుగా మంచి పరిగణన లభించింది. ఈ విషయంలో పూర్తి విశ్వాసం కలగడంవల్ల శ్రీ కె. నరసింహరాజు తనకున్న మొత్తం 22 ఎకరాలలోనూ గత దాళవా పంటకాలంలో ఐ. ఆర్. 8 రకం వరి విత్తనాలు వాడారు. ఆయన ఆశ నిరాశ కాలేదు. ఎరువులు ఎంతెంత వెయ్యాలో తెలుసుకొని లెక్క ప్రకారం అమోనియమ్ సల్ఫేటు, యూరియా, అమోనియమ్ ఫాస్ఫేటు వాడడం జరిగింది. ఫలితంగా ఎకరానికి 2,625 కిలోల ధాన్యం పండింది. కొన్ని ఎకరాలలో ఎకరా రాబడి 3,000 కిలోలు కూడా ఉన్నది. ఆయన ఎకరానికి అదనంగా ఖర్చుపెట్టింది. రూ. 281 లు మాత్రమే. 75 కిలోల బస్తా రూ. 41 లకు అమ్మగా ఆయనకు ఎకరానికి రూ. 1,435 ల ఆదాయం లభించింది.

## లాభసాటిగావుండే దీవిపత్తి :

కర్నూలు జిల్లాలో ఎమ్మిగనూర్ గ్రామానికి చెందిన శ్రీ యు. ఎం. నరసయ్య అనే వ్యాపారస్థుడు వ్యవసాయదారుడుగా తయారై, గత సంవత్సరం వ్యవసాయంలో చరిత్రను సృష్టించాడు.

తుంగభద్ర దిగువ కాలువ క్రింద ఎమ్మిగనూర్‌లో శ్రీ నరసయ్యకు మూడు ఎకరాల సేద్యపుభూమి వుంది. బొంబాయిలోని భారత జవుళిమిల్లుల సమాఖ్య, గడచిన సంవత్సరం ఈ ప్రాంతంలో దీవిపత్తి అనే కొత్తరకపు పత్తిని ప్రవేశపెట్టింది. దిగుబడి అధికంగా వుండే ఈ రకాన్ని ఉపయోగించి శ్రీ నరసయ్య ఎకరానికి 1,731 కిలోగ్రాములు ప్రత్తి పండించాడు. దేశంలో ఎకరా ఉత్పత్తిలో ఇదే అధికం. ఇందుకుగాను శ్రీ నరసయ్యకు ప్రథమ బహుమతి లభించింది.

ఇది పొడుగు పింజ పత్తి కావడంతో ఎక్కువగా అమ్ముడుపోతుంది. ఈ రకం పత్తి సన్నని నూలువస్త్రాలను తయారు చేయడానికి ఉపయోగపడుతుంది. ఆయనకున్న మూడు ఎకరాల భూమినుంచి శ్రీ నరసయ్యకు 17 వేల రూపాయలు లాభం వచ్చింది.

## గుంటూరుజిల్లాలో ఒకే ఏడాదిలో ఎక్కువ పంటలు :

తాడికొండ పంచాయతీ సమితి క్రిందకు వచ్చే గ్రామాలలోని వ్యవసాయదారులందరూ పూర్వంనుంచీ మిరప, పొగాకు వంటి వ్యాపార పంటలు పండిస్తూ వచ్చారు. కాని నాగార్జునసాగర్ కాలవలలో నీరు విడుదల అయినప్పటి నుంచీ వారంతా క్రమంగా ఆహారధాన్యాలు పండించడం ప్రారంభించారు.

ఇలా నూతన పరిణామానికి దోహదంచేసిన వారిలో శ్రీ జంపని సాంబయ్య ఒకరు. ఆయన పాతకాలపు వ్యవసాయ పద్ధతులు అవలంబిస్తూ ఉండేవారు. అటువంటిది ఆయన కొత్త దుక్కి పద్ధతులు అవలంబించి ఘనవిజయాలు సాధించారు. స్థానిక వ్యవసాయశాఖ అధికారుల సలహాపై ఆయన తన పొలంలో గత దాళవా పంటకాలంలో గంటి ధాన్యం (మిశ్రమజాతి విత్తనం-1) పండించారు. షుమారు పదివారాలలో పంట చేతికి వచ్చింది. దిగుబడి 1,408 కిలోల వరకు ఉన్నది.

అదే పొలంలో ఆయన సార్వా పంటకాలంలో మొక్కజొన్న వేసి 15 వారాలు తిరక్కముందే 1,529 కిలోల దిగుబడిని ఇంటికి తోలించారు. జొన్నపంటతోపాటు పొలంలో 1,600 కిలోల ఎండుగడ్డికూడా లభించినది. ఈ రెండు పంటల మూలంగా ఆయన ఒక్క ఎకరంలోనే రెండువేల రూపాయల ఆదాయం సంపాదించారు. శ్రీ సాంబయ్యకు ఇది గర్వకారణమే.

## పరిశ్రమలలోకంటే వ్యవసాయంలో అధికలాభాలు :

శ్రీ సి. హెచ్. అప్పారావు ఒకప్పుడు పెద్ద పారిశ్రామికవేత్త. ఆయనకు శ్రీకాకుళం జిల్లాలో ఖండసారి చక్కెర తయారయే రెండు కర్మాగారాలు, కాకినాడలో ఒక వర్కుషాపు ఉండేవి. అటువంటిది ఆయన పరిశ్రమలు విడిచిపెట్టి పెద్ద ఎత్తున వ్యవసాయం ప్రారంభించారు. ఎక్కువ దిగుబడి ఉండే విత్తనాలు వాడి వ్యవసాయం చేస్తే ఇతరత్రా కంటే ఎక్కువ లాభదాయకంగా ఉండగలదని ఆయన అభిప్రాయం.

కాకినాడ సమీపంలో తిమ్మాపురంలో 25 ఎకరాల పొలం కొని అందులో ఆరు ఎకరాలలో దాళవా పంటకాలంలో ఐ.ఆర్. 8 రకం విత్తనం వాడి వరి పండించారు. సార్వా పంటకాలంలో 22 ఎకరాలలో మరోసారి ఎక్కువ దిగుబడి ఉండే విత్తనాలు వాడారు. ఎకరానికి మామూలు కంటే వంద రూపాయల అదనపు పెట్టుబడి పెట్టారు. ఆయన, మొదటి పంటకాలంలో ఎకరానికి 27 బస్తాలు- 2025 కిలోలు, రెండవ పంటకాలంలో 35 బస్తాలు-2625 వరి ధాన్యంపండించారు. వచ్చే దాళవా పంటకాలంలోనూ ఐ.ఆర్. 8 రకం విత్తనాలు వాడి అధికాధికంగా ఆహార ధాన్యాలు పండించాలని ఆయన ఉద్దేశిస్తున్నారు.

శ్రీ అప్పారావుకు లోగడ తూర్పు గోదావరి జిల్లాలో ఇప్పనపాడు గ్రామంలో వ్యవసాయమనేది ఉండేదికాని 1922 లో ఆయన వ్యవసాయం విడిచిపెట్టి వ్యాపారంలోనూ, పరిశ్రమలలోనూ ఎక్కువ లాభాలు ఆర్జింప వచ్చని ఆశించి కాకినాడ వచ్చారు. కాని ఆయన స్వీయ అనుభవం మూలంగా మనసు మార్చుకొన్నారు. ఎక్కువ దిగుబడి ఉండే విత్తనాలు వాడకంలోకి రావడంతో మళ్లీ వ్యవసాయం ప్రారంభించడానికి ఆయనకు ప్రోత్సాహం కలిగింది.

సీరియల్

# తిరస్కృతి

## —వాసిరెడ్డి సీతాదేవి

### జరిగిన కథ

సత్యం, సూర్యం అన్నదమ్ములు. మేనమామ కూతురు సరళకూడా వాళ్ళతోపాటే పెరుగుతోంది. సత్యం అంటే సరళకు ఇష్టం. ఎప్పుడూ అతనితోనే ఆడుకొనేది.

ఒకసారి సరళను రక్షించబోయి సత్యం లారీ క్రిందపడి చెయ్యి పోగొట్టుకున్నాడు. తర్వాత స్కూల్లో సరళ జెడపుచ్చుకుని లాగిన ఓకొంటె కుర్రాడితో పోట్లాడి దెబ్బలుతిన్నాడు. స్కూల్లో పోట్లాడాడని తెలిసి తండ్రి సత్యాన్ని కొట్టాడు.

---

బట్టలు మార్చుకొని సత్యం మంచంమీద కళ్ళు మూసుకొని పడుకున్నాడు. ఆలోచనలతో అలసిపోయిన సత్యం అలా ఎంత సేపు పడుకొనివుండిపోయాడో అతనికే తెలియదు. సరళ భోజనానికి పిలవటానికి వచ్చింది. అప్పుడుగాని రాత్రి బాగా పొద్దుపోయిందని తెలుసుకోలేదు. "నాకు ఆకలిలేదు." అంటూ ముక్తసరిగా జవాబిచ్చి కళ్లు మూసుకున్నాడు. రెండు నిమిషాలు అలాగే నిల్చొని తిరిగి వెళ్ళిపోయింది సరళ.

"రారా బాబూ! అన్నం తిందువు గాని. నాన్న, తమ్ముడూ నీకోసం చూస్తున్నారు." అంది తల్లి తల నిమురుతూ.

"నాకు ఆకలిగాలేదు. నేనురాను!" అన్నాడు సత్యం.

"అదేంటిరా తండ్రీ! ఆకలిగా లేకపోవటం ఏమిటి? ఏం తిన్నావని? పద, లే" అంది తల్లి మృదువుగా మందలిస్తూ.

"లేదమ్మా! నాకు తినాలని లేదు, నన్ను వదిలేయ్!" అన్నాడు కొంచెం విసుగ్గా సత్యం.

"నాన్న కోప్పడ్డాడనేగా బాబూ! ఆయన కూడా చాలా బాధపడుతున్నారు. నువ్వు అన్నం తినకపోతే ఆ మనిషి మరీ ఢీలా పడిపోతారు." అంది శాంతమ్మ.

కాని సత్యం ఉలకలేదు. పలకలేదు. లేవలేదు. శాంతమ్మ లాభంలేదని తెలుసుకొని వెళ్ళిపోయింది. సత్యానికి ఊహతెలిసిన తరువాత ఆ రోజంత మొండిగా ఏనాడూ ప్రవర్తించలేదు.

"ఏరా! ఆకలి లేదంటున్నావట!" తండ్రి సాధారణంగా అన్నాడు. కానీ సత్యం అలాగే కదలకుండా మౌనంగా పడుకున్నాడు.

"లే! అన్నం తిందాం." కొంచెం కటువుగా అన్నాడు మాధవయ్య. కటువుగా అన్నా అది తెచ్చిపెట్టుకున్నట్లే వుంది. ఆ మాటల్లో బాధా, పశ్చాత్తాపం ఎంత దాచాలన్నా దాగలేదు.

సత్యం దిగ్గున లేచాడు. గబగబా వచ్చి అన్నం ముందు కూర్చున్నాడు. తలవంచుకొని ఇంతకెలికి తిన్నాననిపించి వెళ్ళి పడుకున్నాడు.



ఆ రాత్రి సత్యం బాగా అలసిపోయి వుండటం వల్ల గాఢ నిద్రపోయాడు. కాని మాధవయ్యకు కంటిమీద కునుకు లేదు. తను బిడ్డను అనవసరంగా నొప్పించాడు. అసలే సున్నితమైన మనస్సుగలవాడు. వాడిమీద తనకుమాత్రం పగా ? దెబ్బలు తిన్నాడని వినగానే తన మనస్సు ఎంత గిజగిజలాడి పోయింది ! రక్తంతో తడిసిన షర్టు చూసేప్పటికి తనకు మతే పోయింది. అదేమి స్వభావమో గాని తన బాధను సౌమ్యంగా వెలిబుచ్చటం తనకు చేతకాదు. ప్రేమనూ, ఆదరణనూ కూడా మాటలద్వారా వ్యక్తం చెయ్యటం తనకు ఇష్టం ఉండదు. అసలు తనకు ఎలాంటి మాటల్లో సున్నిత భావాల్ని వ్యక్తం చేయాలో అర్థం కాదు. ప్రేమ, మనస్సులో వుండాల్సిన వస్తువు. దాన్ని ఎంత గుప్తంగా వుంచితే అంత పదిలంగా వుంటుంది. మాటల్లో వ్యక్తం చేసేప్పటికి దాని విలువ తగ్గిపోతుంది. కాని తనను ఎవరూ అర్థం చేసుకోరు. బాధకలిగినప్పుడే తను కోపగిస్తాడు. నిజంగా కోపం వచ్చినప్పుడు అసలు మాట్లాడనే మాట్లాడడు ! కాని తను సత్యాన్ని అవిటివాడు అనటం తననుతనే వెక్కిరించు కున్నట్ల యింది. సత్యాన్ని ఆ మాటే ఎక్కువ బాధపెట్టి వుంటుంది. తను అలా అనవలసింది కాదు. ఏమయినా ఇకనుంచి సత్యం మనస్సు నొప్పించకూడదు. ఆ సూరిగాణ్ణి కాస్త మందలించాలి. వాడికి అన్న అంటే గిట్టదు. చిన్న వెధవలకు కూడా కక్షలూ, కార్పణ్యాలు !

పరిపరి విధాల ఆలోచిస్తూనే ఆ రాత్రంతా గడిపాడు మాధవయ్య.

సత్యం తెల్లవారి లేచాడు. కాని స్కూలుకు వెళ్ళే ప్రయత్నంలో వున్నట్లు కనిపించలేదు. శాంతమ్మగాని, మాధవయ్యగానీ ఆ విషయాన్ని గమనించనట్లే వుండిపోయారు.

వారంరోజులు గడిచినా సత్యం ఇంట్లోనే వుంటున్నాడు. సత్యం వెళ్ళటంలేదని సరళ స్కూలు మానేసింది. ఆడపిల్లల చదువుగురించి ఆలోచించే అలవాటు ఇంకా ఆవూళ్లో వాళ్ళకి అబ్బలేదు. కనుక సరళ విషయం ఎవరికీ పట్టలేదు. కాని వారంరోజులయినా సత్యం స్కూలుకు పోకపోవటం మాధవయ్యకు ఆందోళన కలిగించింది.

"ఏరా ! స్కూలుకు వెళ్ళటం లేదు ?" అన్నాడు తండ్రి.

సత్యం జవాబు ఇవ్వలేదు. ఆ వారంరోజులుగా సత్యం అందరితోనూ ముభావంగానే వుంటున్నాడు.

"ఏరా పలకవు? ఈ మధ్య మూగనోము పట్టినటున్నావు!" అన్నాడు మాధవయ్య.

సత్యం మౌనంగానే వుండిపోయాడు. మాధవయ్యకు చిరాకు వేసింది.

"ఏమిటా నిర్లక్ష్యం. అడుగుతుంటే జవాబు చెప్పవేం ?" కసురుకున్నాడు తండ్రి.

అప్పటికీ తలవంచుకునే నిలబడ్డాడు సత్యం పలక్కుండా.

"పోనిద్దురూ ! పదిరోజులు బడికి వెళ్ళకపోతే మునిగి పోయిందేమిటి ? వాడికి వంట్లో బాగుంటున్నట్లు లేదు." అంది శాంతమ్మ.

"ఏరా వంట్లో బాగుండటం లేదా ! మరి చెప్పవేం ? పద డాక్టరు దగ్గర కెళ్ళివద్దాం !" అన్నాడు మాధవయ్య.

"నాకు వంట్లో బాగానే వుంది." అన్నాడు నిదానంగా సత్యం.

"మరయితే స్కూలుకు ఎందుకెళ్ళటం లేదు."

"వెళ్ళదలుచుకోలేదు."

మాధవయ్య అర్థంకానివాడిలా సత్యం ముఖంలోకి వెర్రి చూపులు చూశాడు.

"ఏం ? ఎందుకు ? చదువుకోక ఏంచేస్తావు !" కొంచెం తెప్పరించుకొని ప్రశ్నించాడు తండ్రి, కొడుకు ముఖంలోకి రెప్ప వాల్చకుండా చూస్తూ.

"పిచ్చివేశాలు వెయ్యక రేపటినుంచి స్కూలుకు వెళ్ళు." ఆజ్ఞాపించి వెనుదిరిగిన మాధవయ్య అలాగే ఆగిపోయాడు సత్యం ఇచ్చిన ఖచ్చితమైన జవాబు విని.

"వెళ్ళను."

సత్యం, తండ్రిముందు అంత ధైర్యంగా నిల్చొని మొండిగా జవాబు ఇవ్వడం ఇదే మొదటిసారి. శాంతమ్మ అయోమయంగా చూస్తూనిల్చుంది. అకస్మాత్తుగా తన కొడుకు పెద్దవాడయిపోయాడు అనిపించింది శాంతమ్మకు.

"ఏమిటి నీ వుద్దేశం ? ఇంట్లోకూర్చొని ఏం చెయ్యాలని ?" నీళ్లు కారిపోతూ ప్రశ్నించాడు మాధవయ్య.

"చిత్రకళ నేర్చుకుంటాను."

"బొమ్మలు గీస్తూ కూర్చుంటావా ?" మాధవయ్యకు మళ్ళీ కోపం వచ్చింది.

"వెధవ వేషాలు వెయ్యక ! రేపటినుంచి స్కూలుకు వెళ్లు" కఠినంగా అని చురుకుగా చూసి, చకచకా బయటకు వెళ్ళిపోయాడు మాధవయ్య.

తెల్లవారికూడా సత్యం స్కూలుకు వెళ్ళలేదు. ఆ మొండి తనానికి మాధవయ్యకు ఒళ్ళు మండిపోయింది. కోపం పట్టలేక రెండు దెబ్బలుకూడా వేశాడు.

"మీరు కొట్టండి ! చంపండి ! నేను స్కూలుకు వెళ్ళను" అన్నాడు సత్యం మొండికెత్తినవాడిలా. మాధవయ్య ఏమీ చెయ్య లేక గొణుక్కుంటూ బయటకు వెళ్ళిపోయాడు. శాంతమ్మమాత్రం ఆ విషయంలో తను మాటాడక పోవటమే మంచిదనుకుంది.

వారంరోజుల తర్వాత ఒకనాడు మాధవయ్యతో కేశవరావు, సత్యం గదిలో ప్రవేశించాడు. సత్యం ఏదో బొమ్మ గీసుకుంటూ కూర్చున్నాడు. మాధవయ్య వాకిట్లోనుంచే బయటకు వచ్చారు. కేశవరావు సత్యం గదిలోకి వచ్చాడు.

"సత్యం !" ఆప్యాయంగా పిల్చాడు కేశవరావు.

సత్యం తృళ్ళిపడి లేచి నిల్చున్నాడు.

"ఏం సత్యం ! స్కూలుకు రావంటున్నావట ? ఇవ్వాళ్ళ మీ నాన్న కనిపిస్తే అడిగాను. వెంటనే బయలుదేరి వచ్చాను." అన్నాడు కేశవరావు సత్యం తలమీద చెయ్యివేసి మృదువుగా నిమురుతూ.

"అవునుసార్; ఇక నాకు ఈస్కూలు చదువు అక్కర్లేదు." ఖచ్చితంగా తన నిర్ణయాన్ని వినిపించాడు సత్యం.

"మరి ఏంచేద్దా మనుకుంటున్నావు ?"

"చిత్రకళలో ప్రావీణ్యత సంపాదించాలను కుంటున్నాను మాస్టరుగారూ ! మీ ఫ్రండ్ దగ్గరకు నన్ను తీసుకెళ్ళరూ ! కొంత కాలం ఆయన దగ్గర ఈ విద్యను అభ్యసిస్తాను." అన్నాడు సత్యం ప్రాధేయపడుతున్నట్లు.

కేశవరావు మౌనంగా కూర్చున్నాడు. ఏదో ఆలోచిస్తున్నాడు. చాలా సేపు ఆలోచిస్తూనే వుండిపోయాడు. సత్యం, కేశవరావు ముఖంకేసి ఆదుర్దాగా చూస్తూ కూర్చున్నాడు.

"సత్యం ! ఏ కళ యినా రాణింపుకు రావాలంటే విద్యచాలా అవసరం. విద్యలేని చిత్రకళకూడా అంత రాణింపుకురాదు." అంటూ మళ్ళీ ఆలోచనలోకి జారిపోయాడు కేశవరావు.

వెంటనే ఏదో ఆలోచన వచ్చినట్లు అతని కళ్ళు మెరిశాయి. "అయితే ఒకపనిచెయ్యి. శాంతినికేతన్‌కు వెళ్ళు. అక్కడ విద్యతో పాటు చిత్రకళనుకూడా అభ్యసించవచ్చును. రవీంద్రుని సాన్ని ధ్యమే ఓ పెద్ద విజ్ఞానగ్రంథం." అన్నాడు కేశవరావు.

సత్యం కళ్ళలో ఎన్నాళ్ళకో కాంతిరేఖలు కదులాడాయి. విశ్వకవి సాన్నిధ్యంలో తను విజ్ఞానాన్ని ఆర్జించటంకంటే జీవి తంలో కోరుకోవలసింది ఏముంది. కాని తనకు అంత అదృష్టమా? సత్యానికి అదో కలలా, భ్రాంతిలా మాత్రమే అనిపించింది.

"మా నాన్నగారు ఒప్పుకోవాలిగా ?" అన్నాడు ఆలోచనా తరంగాల్లో తేలిపోతూ.

"మీ నాన్నగారిని వప్పించే బాధ్యతను నాకు వదిలేయ్ ! ముందు నీకు ఇష్టమేనా ?" అన్నాడు కేశవరావు.

"అంతకంటే నేను కోరేది ఏమీ వుండదు."

"అయితే వుండు ఇప్పుడే మీ నాన్నగారితో మాటాడి వస్తాను." అంటూ కేశవరావు బయటకువెళ్ళాడు.

సత్యానికి ఆనందంతో గంతులేయాలనిపించింది. సరళకు చెప్పాలనిపించింది. కాని మళ్ళీ తన అదృష్టంమీద సందేహం పీడించసాగింది.

ఐదు నిముషాలకల్లా మాధవయ్య సత్యాన్ని కేక వేసి పిల్చాడు. సత్యం గుబగుబలాడే గుండెలతో తండ్రి ముందుకొచ్చి నిలబడ్డాడు.

"ఏరా సత్యం! శాంతినికేతన్‌కు వెళ్ళి చదువుకుంటావా?"

"వెళతాను !" తండ్రి మాట పూర్తి అయీ కాకుండానే గబుక్కున జవాబు ఇచ్చాడు సత్యం. ఓ క్షణం ఆలస్యం అయితే తండ్రి మనస్సు మారిపోవచ్చును!

మాధవయ్య 'ఊఁ' అంటూ ఓ మూలగు మూలిగి క్షణం పాటు కొడుకు ముఖంలోకి రెప్ప వెయ్యకుండా చూశాడు.

"వాడి ఇష్టమే నా ఇష్టం! వాణ్ణి అక్కడ చేర్పించివచ్చే బాధ్యత కూడా మీకే అప్ప జెపుతున్నాను. మీ ఋణం ఏనాటికీ తీర్చుకోలేనిది." అంటూ మాధవయ్య లేచి వెళ్ళి కేశవరావు రెండు చేతులూ పట్టుకున్నాడు సత్యం కళ్ళు పెద్దవి చేసుకొని విస్తుపోయి చూశాడు.

"ఇందులో నేను చేస్తున్న పెద్ద సహాయం ఏముంది! సత్యం అంటే నాకు నా కన్న కొడుకును చూసినట్లు వుంటుంది. నాకు మొగపిల్లలు లేరు." అన్నాడు కేశవరావు.

"సత్యం చాలా గొప్ప ఆర్టిస్టు అవుతాడు. పెద్ద కీర్తిని సంపాదించుకోగలడు" అన్నాడు కేశవరావే మళ్ళీ.

"అంతా మీ దయా, ఆశీర్వాద బలమూ! ఎంత ఖర్చయినా వెనకాడను. వాణ్ణి అక్కడకు పంపించే బాధ్యత మీకే వదిలేస్తున్నాను.

"సరే! నేను ముందు ఉత్తరం రాసి వివరాలు కనుక్కుంటాను. జవాబు రాగానే వారం రోజులు సెలవుపెట్టి తీసుకెళతాను." అంటూ లేచాడు కేశవరావు.

"మర్చిపోకండేం!" మాధవరావు అన్నాడు.

"మీరు నిశ్చింతగా వుండండి. సత్యం విషయం నాకు వదిలేయండి. నేను వెళ్ళి వస్తాను." అంటూ లేచాడు కేశవరావు.

"కూర్చోండి! కాఫీ పుచ్చుకొని వెళ్ళొచ్చు."

"మళ్ళీ వస్తానుగా! ఇప్పుడు త్వరగా వెళ్ళాలి." అంటూ బయలుదేరుతున్న కేశవరావు పాదాలకు వంగి నమస్కరించాడు సత్యం.

కేశవరావు వంగి రెండు చేతుల్తో సత్యాన్ని లేవదీసి గుండెలకు తల ఆనించుకొని గోముగా నిమిరాడు. ఆ దృశ్యాన్ని చూస్తున్న మాధవయ్యకు ఏదో కొత్త ప్రదేశంలో కాలు పెట్టినట్లయింది. కేశవరావు వెళ్ళిపోయాడు.

"బాబూ!" అన్నాడు మాధవయ్య.

సత్యం ఆనందం పట్టలేక తండ్రిని కౌగలించుకున్నాడు. మాధవయ్య పుత్ర పరిష్వంగ సుఖం ఎలా వుంటుందో మొదటిసారి అనుభవించాడు. తండ్రీ కొడుకుల ఇద్దరి కళ్ళలోనూ నీరు తిరిగింది. ఇంతకాలం నుంచి లభించని ఏదో అమూల్య వస్తువు లభించినట్లనిపించింది మాధవయ్యకు. మాధవయ్య ఏనాడూ పిల్లల్ని ప్రేమగా ఒళ్ళోకి తీసుకున్నవాడు కాదు.

శాంతమ్మ ఈ దృశ్యానికి పులకించిపోయింది. వాకిట్లోనే ఆమె నిలబడి పోయింది. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

(సశేషం)

---

# పాఠకుల లేఖలు

"ఆంధ్రప్రదేశ్" విద్యార్థులందరికీ ప్రియమైన మాస పత్రిక

డి. వెంకట రెడ్డి,
విద్యార్థి రచయితల సంఘం
ఆంధ్ర విశ్వవిద్యాలయం,
విశాఖపట్నం.

ఆగస్టు సంచికలో మీరు ప్రచురించిన ప్రభుత్వ ఉత్తర్వులు చూసి విద్యార్థులు, రైతులు సంతోషించారు. మీ మాస పత్రికను గత ఆరు సంవత్సరము నుండి మేము తెప్పించు చున్నాము.

బొమ్మరెడ్డి సత్యనారాయణ.
తేలప్రోలు, కృష్ణాజిల్లా

"ఆంధ్రప్రదేశ్" స్వాతంత్ర్య దినోత్సవ ప్రత్యేక సంచిక నన్నెంతో ఆకర్షించింది. "స్వాతంత్ర్య సమర విజయ గాథ" అను చిత్రకథ చాలా బాగుగా నున్నది. కరుణశ్రీగారి "స్వతంత్ర భారతి" పాటకుల నందరిని ఆకర్షించిన దనుటలో సందేహము లేదు. "చైతన్య మూర్తులు" ద్వారా మాకు పలువురు ప్రముఖుల జీవిత చరిత్రలను తెలియజేయుచున్నందులకు కృతజ్ఞతలు మీ (మా) పత్రిక ఇంకా అభివృద్ధి నొందగలదని ఆశిస్తున్నాము.

అనుముల వెంకటరమణయ్య
లంజ బండ,
(వయా) వెలుదుర్తి
కర్నూలు జిల్లా.

"ఆంధ్రప్రదేశ్" పత్రిక మొదలు పెట్టినప్పటినుండి నేను కొంటున్నాను. అన్ని పత్రికలకంటె ఈ పత్రికకు ఒక ప్రత్యేకత వున్నదని మా అభిప్రాయం. ప్రభుత్వకార్యక్రమముల గురించి బొమ్మలతో సహా వేస్తున్నందుకు మాకు సంతోషముగావుంది. మీ పత్రిక దినదినాభివృద్ధి పొందుచున్న దనుటలో సందేహంలేదు. మీ (మా) పత్రికవలన విజ్ఞానము కలుగుచున్నది.

వి. వెంకట రామారావు
దాసరి వెంకటేశ్వరరావు
గుండుగొలను,
పశ్చిమ గోదావరి జిల్లా.

గాంధీవాణి

# భిన్నత్వంలో ఏకత్వం



ప్రకృతిలోనే మనకు కన్పించే అనంతమైన వైవిధ్యంలో—భిన్నత్వంలో అంతర్వాహినిగా మౌలికమైన ఏకత్వం ఉన్నది. ఈ సహజలక్షణానికి మతాలు అపవాదము కాదు. ఈ సమైక్యతను శీఘ్రంగా గుర్తించేలా చేయడానికి మానవులకు మత ప్రబోధం జరిగింది. మతాలను వారికి ప్రసాదించినది భిన్నత్వంలో ఏకత్వాన్ని గుర్తించడానికే. క్రైస్తవ మతం, హిందూమతం, ప్రపంచంలో ఇంకా అనేక ఇతర మతాలను గురించి జాగ్రత్తగా పరిశీలిస్తున్నప్పుడు ఈ మతాలు అన్నింటిలో ఎంతో వైవిధ్యం ఉన్నప్పటికీ వాటిలో ప్రాతిపదిక సమైక్యత—సత్యం, వాస్తవికత—నాకు గోచరించాయి.

మతాలు మానవులలో ఒకరి నుంచి ఒకరిని వేరుపరచి వారిలో విభేదాలు కల్పించడానికి ఉద్దేశించినవి కావు. మతాలు మానవులు అందరినీ సమైక్యం చేయడానికి, వారిలో దృఢమైన అనుబంధం కల్పించడానికి ఉద్దేశింపబడినవి. కాని ఈ నాడు వాటికి అపార్థాలు కల్పించడంవల్ల, తప్పుడు వ్యాఖ్యానాలు చేయడం వల్ల మతాలే కల్లోలాలకు, ఆందోళనలకు, సంక్షోభాలకు ప్రబల కారణం కావడం నిజంగా దురదృష్టకరం. అన్ని మతాలలోనూ అంతర్వాహినిగా, ప్రాతిపదికగా ఉన్న ఏకత్వం ప్రకటితం చేయడం అవసరం, యుక్తం కూడానూ. ఈ అంశం గుర్తించడానికి ఒక ప్రబలమైన ప్రధానమైన సాధనం కావాలి. సత్యాహింసలే ఇందుకు అన్నివిధాలా అనువైన సాధనాలు. ఇందుకు అనుగుణమైన దృక్పథం ఇది. ఈ సమ్యక్ దృక్పథం అలవరచుకొని ఏదైనా ఒక మతం తాలూకు సిద్ధాంతాలను జాగ్రత్తగా పరిశీలించినప్పుడు ఆ మతానికీ, ఇతర మతాలకూ మధ్యగల దగ్గర పోలికలు గుర్తించడానికి సులభంగా వీలు అవుతుంది. చెట్టు ఆకులవంక చూచినపుడు అవి పరస్పరం భిన్నమైనవిగా కన్పిస్తాయి కాని ఆ చెట్టు బోదె వంక చూచినప్పుడు అవి ఒకదానికంటె మరొకటి భిన్నమైనవి కావని స్పష్టం అవుతుంది. మతాల విషయంలోనూ అంతే. మౌలికమైన ఈ సమైక్యతను, ఈ ఏకత్వాన్ని, ఈ సారూప్యాన్ని సమంగా గుర్తించనిదే మతం పేరిట జరిగే యుద్ధాలను, వచ్చే సంక్షోభాలను అరికట్టడానికి వీలుపడదు.

భగవంతుడు ఒక్కడే ఉంటే మతం కూడా ఒక్కటే ఉండవద్దా? ఇది చాలా విచిత్రమైన ప్రశ్న. ఒక మహా వృక్షానికి అనేక వేళ్ల, లక్షల ఆకులు ఉన్నట్టుగానే భగవంతుడు ఒక్కడే అయినా ఎంతమంది స్త్రీ పురుషులు ఉన్నారో అన్ని మతాలు ఉన్నాయి. వీటి అన్నింటికి మూలం ఒక్కటే. మనం వివిధ ప్రవక్తలను అనుసరించడంవల్ల ఈనగ్న సత్యాన్ని గుర్తించడంలేదు, పైగా ఎంతమంది ప్రవక్తలు ఉన్నారో అన్ని మతాలు ఉన్నట్లు చెప్పుకొంటాం. వాస్తవానికి నేను హిందువునని విశ్వసిస్తున్నప్పటికీ మిగతా హిందువులు అందరూ, లేదా కొందరు అనుసరిస్తున్న పద్ధతిలో నేను భగవంతుని ధ్యానించడం లేదని నాకు తెలుసు.

ఒక మతం మరో మతం కంటె గొప్పదని భావించడం తప్పని నేను మరోసారి హెచ్చరిస్తున్నాను.

భగవంతునిపట్ల భయం, భక్తీ, విశ్వాసం, వినయం, విధేయత కలవారికి అన్ని మతాలు మంచివే. వారికి అన్ని మతాలు సమానమే. కాని వివిధ మతాచారాలు అనుష్ఠించే వారు మాత్రమే ఒకరితో ఒకరు తగువులాడుకొంటారు. ఫలితంగా ఆ యా మతాలను తిరస్కరిస్తారు.

హిందూ—మహమ్మదీయ సమైక్యతా సాధనకు మహమ్మదీయులు ఇతరుల మతంపట్ల, వారికామతం మీద విశ్వాసం ఉన్నంత కాలం సహనం చూపడం అవసరం. ఏదో సుగుణంలా కాక, ఏదో ఒక విధానంలా కాక సహజంగా, తమ మత విశ్వాసంలో భాగంగా, సిద్ధాంతాలలో ఒకటిగా భావించి, వారు ఇలా సహనం చూపవలసి ఉన్నది. ఇదేవిధంగా హిందువులు కూడా ఇతరుల మతంపట్ల సహనం చూపాలి. వారికి ఇతరుల మతం ఎంత ఎబ్బెట్టుగా, గిట్టనిదిగా, విరుద్ధంగా కన్పించినా వారు ఈ విధమైన సహనం చూపాలి. ప్రస్తుత సమయంలో కావలసింది అందరికీ కలిపి ఒకే మతం కాదు. వివిధ మతాలను అనుసరించే వారి మధ్య పరస్పర సహనం, మన్నన కావాలి. మనం భిన్నత్వంలో ఏకత్వం సాధించవలసి ఉన్నది. ప్రాచీన సంప్రదాయాలనూ, వారసత్వంతాలూకు ప్రభావాలనూ, వాతావరణాది పరిస్థితులనూ రూపుమాపడానికి చేసే ఏ ప్రయత్నం అయినాసరే విఫలంకాక తప్పదు. ప్రాజ్ఞులైనవారు బాహికమైన రూపభేదాలకు ప్రాముఖ్యం ఇవ్వక వాటి అంతర్యాన్ని, మూల సిద్ధాంతాన్ని సమంగా గుర్తిస్తారు.

భారతదేశం సువిశాలమైనది. భారత జాతి ఉదాత్తమైనది. ప్రజలలో విభిన్న సంస్కృతులు కన్పిస్తాయి. ఈ విభిన్న సంస్కృతులు పరస్పర పరిపోషకంగా ఉంటూ, ఒకదానికొకటి అనుగుణంగా పరిణామంచెందుతూ ఒకదానిలో ఒకటి విలీనం అవుతున్నాయి. ఈ సంస్కృతీ సమ్మేళనం పూర్తి కావడానికి మరి కొంత కాలం వేచి ఉండవలసివస్తే నేను వేచి ఉండవలసిందే. ఇలా విభిన్న సంస్కృతుల మేలు కలయిక నా జీవితకాలంలో పూర్తికాక పోవచ్చు. ఇందుకు ఎంతకాలం పడుతుందో అంతకాలమూ వేచి ఉండవలసిందే. సమయం ఆసన్నమైనప్పుడు కార్యసిద్ధి కలుగుతుంది. నాకు ఆ విశ్వాసం ఉంది. ఆ విశ్వాసంతో నేను నిశ్చింతగా ప్రాణాలు విడవడానికి సిద్ధమై, ఇందుకు నేను ఏవిధమైన ఆటంకమూ కలిగించలేదని అనుకోవడమే నాకు సంతృప్తి. *

## కుటుంబనియంత్రణ

### స్టెరిలైజేషన్ శస్త్రచికిత్సలు

గడచిన అగస్టు 10 వ తేదీ నాటితో ముగిసే నెల రోజుల కాలంలో మొత్తం దేశంలో సుమారు 1,25,930 స్టెరిలైజేషన్ ఆపరేషన్లు నిర్వర్తించబడ్డాయి. కేంద్ర ఆరోగ్య కుటుంబనియంత్రణ, పట్టణాభివృద్ధి మంత్రిత్వశాఖకు వివిధ రాష్ట్రాలనుంచి వచ్చిన సమాచారంవల్ల యీ విషయం వెల్లడవుతున్నది.

ఆగస్టు నెలలో జరిగిన శస్త్రచికిత్సలతో సహా మొత్తం యింత వరకు 46,14,975 స్టెరిలైజేషన్ శస్త్రచికిత్సలు జరిగాయి.

జూలై నెలలో యీ విధమైన శస్త్రచికిత్సలు మొత్తం 89,000 జరిగాయి.

### స్టెరిలైజేషన్ ప్రయోజనాలు

ఇద్దరు, లేక ముగ్గురుకన్న ఎక్కువమంది సంతానంవున్న దంపతులకు స్టెరిలైజేషన్ శస్త్రచికిత్స ప్రయోజనాలను గూర్చి తెలియజెప్పాలని కేంద్ర ఆరోగ్యశాఖ కార్యదర్శి శ్రీ గోవింద నారాయణ్ రాష్ట్ర ప్రభుత్వాలకు యిటీవల తెలియపరిచారు. ఇద్దరు గాని, అంతకుతక్కువగాని సంతానంగలమహిళలు కాన్పుకుకాన్పుకు మధ్య వ్యవధిని ఎక్కువగా వుంచడానికి లూప్‌లను, తదితర కాంట్రాసెప్టివ్ పద్ధతులను అనుసరించాలని ఆయన అన్నారు.

### విజయవంతమైన పద్ధతి

1967–68 లో స్టెరిలైజేషన్ కార్యక్రమం ఎంతో విజయవంతమైందని ఆయన చెప్పారు. మహారాష్ట్ర తన లక్ష్యంలో 150 శాతం సాధించింది. పశ్చిమబెంగాలు 118 శాతం, మధ్యప్రదేశ్ 104 శాతం సాధించాయి.

మైసూర్, ఒరిస్సా, ఢిల్లీ, ఆంధ్రప్రదేశ్‌లు ఇంచుమించు నూటికి నూరుపాళ్ళు విజయం సాధించాయి.

### స్వచ్ఛంద కార్యక్రమం

కుటుంబ నియంత్రణ కార్యక్రమం అనేది పూర్తిగా స్వచ్ఛందంగా జరగవలసిన కార్యక్రమం కావడంచేత, ప్రజల అంగీకారం మీదే దీని విజయం నూటికి నూరుపాళ్ళు ఆధారపడి వున్నందున ప్రజలకు అందుబాటులోవున్న కార్యక్రమం ద్వారానే యిది జరగవలసి వుంటుందని శ్రీ నారాయణ్ అన్నారు. కుటుంబ నియంత్రణ వివరాల సమాచారాన్ని ప్రజలకు అందజేయడంలోనూ వారికి యీ విషయాలను ఎరుకజెప్పి బాధ్యతను గుర్తింప జేయడంలోనూ, ప్రజలు స్వచ్ఛందంగా ముందుకు వచ్చేటట్టు చేయడంలోనూ శక్తివంతమైన పద్ధతులను అమలు జరపవలసినదిగా ఆయన కోరారు.

సంతానోత్పత్తి వయసులో వున్న దంపతులు మనదేశంలో 9 కోట్లమంది వుండగా వారిలో 5 నుంచి 5½ కోట్ల మందికి అప్పుడే యిద్దరు గాని ముగ్గురుగాని సంతానం వుండనే వున్నారు. అందువల్లనే యీ నాడు స్టెరిలైజేషన్ కార్యక్రమం యొక్క ప్రాముఖ్యతను అందరిచేతా గుర్తింప జేయడం మరింత అవసరం —అన్నారు శ్రీ నారాయణ్.

---

## సైన్యంలో డాక్టర్లకు మంచి అవకాశాలు

నల్లై అయిదు సంవత్సరాలలోపు వైద్యపట్టభద్రులకు ఆర్మీ మెడికల్ కోర్‌లలో చక్కటి అవకాశాలు యీనాడు ఏర్పడ్డాయి. వైద్యవృత్తిలో అనుభవం గలిగివున్నా, లేక వైద్యశాస్త్రంలో పోస్టు గ్రాడ్యుయేటు అర్హతలు కలిగివున్నా అట్టివారికి పెద్దరేంక్‌లలో ప్రవేశానికి వీలుంటుంది. డాక్టర్లు సైన్యంలో కెప్టెన్ హోదాతో పరిగణింపబడతారు. ఆరేళ్ళపాటు కెప్టెన్ హోదాలో సర్వీసు పూర్తయిన తర్వాత వారికి మేజర్ హోదా యివ్వబడుతుంది. 10½ సంవత్సరాలు మేజర్ హోదాలో పనిచేసిన తర్వాత వారికి లెఫ్టినెంట్ కల్నల్‌కు పర్మనెంట్ కమిషన్డ్ అధికార్లుగా నియమింప బడతారు.

డాక్టర్లు ప్రాక్టీసు చేసుకోనందుకుగాను తొలి ఏడు సం॥రాలు బేసిక్ జీతంలో 25 శాతం చొప్పున, 8 నుంచి 15 సంవత్సరాల వరకు 33-⅓ శాతం చొప్పున, 15 సంవత్సరాల అనంతరం 50 శాతం చొప్పున అలవెన్సు యిస్తారు. అయితే యీ అలవెన్సు నెలకు 600 రూ. మించివుండదు.

బ్రిగేడియర్ హోదావరకు "స్పెషలిస్టుపే" అనుమతింపబడుతుంది. గ్రేడెడ్ స్పెషలిస్టుకు నెలకు రూ 100, క్లాసిఫైడ్ స్పెషలిస్టుకు రూ. 150, సలహాదారుకు రూ 200 యిస్తారు.

దరఖాస్తులు, యితర వివరాలు:—

"డైరెక్టరేట్ జనరల్, ఆర్మెడ్ ఫోర్సెస్ మెడికల్ సర్వీసెస్, ఎఫ్ బ్లాకు, డి హెచ్ క్యు పి. డి. కొత్తఢిల్లీ-11" చిరునామాకు వ్రాసి పొందవచ్చు.

# ఆంధ్ర మహిళాసభ

మూడు దశాబ్దాల క్రిందట 'బాలల మండలి'గా ప్రారంభమైన ఆంధ్ర మహిళాసభ శీఘ్రగతిని పురోగమించి యీ నాడు మద్రాసు, హైదరాబాదు రాష్ట్రాలలో శాఖోపశాఖలతో విస్తరిల్లి అతి ప్రధానమైన మహిళా సంస్థగా రూపొందింది. వైద్యరంగంలో యీ మహిళాసభ చేస్తున్న సేవ అనుపమైంది. దీనికి మద్రాసు, హైదరాబాదు నగరాలలో నర్సింగ్‌హోంలు వున్నాయి. రోగగ్రస్తులకు, గర్భిణీ స్త్రీలకు, కుటుంబాన్ని పరిమితం చేసుకోదలచిన వారికీ యీ మహిళాసంస్థ ఎంతగానో సేవచేస్తున్నది. ప్రతీ యేటా యీ సంస్థ మద్రాసు రాష్ట్రంలో 130 మందికి ఆగ్జిలరీ నర్సుల శిక్షణ యిచ్చి తయారుచేస్తున్నది. ఆంధ్ర ప్రదేశ్‌లో, సంగారెడ్డిలోనూ, మహబూబ్‌నగర్‌లోనూ చెరి ముప్పయ్‌మంది ఆగ్జిలరీ నర్సులను తయారు చేస్తున్నది. దీనికి తోడు హైదరాబాదులో 20 మంది స్టాఫ్ నర్సుల శిక్షణ పొందుతున్నారు. మహిళాసభ నర్సింగ్ హోంలలో రోజుకు ఎనిమిది మంది పిల్లలు జన్మిస్తున్నారు (సంవత్సరం సగటు లెక్కన). ప్రతీఏటా 60,000 మంది అవుట్ పేషంట్లుగా చికిత్స పొందుతున్నారు. అంతేగాక ఈ మహిళాసభ మద్రాసులోనూ, హైదరాబాదులోనూ, మహబూబ్‌నగర్‌లోనూ, సంగారెడ్డిలోనూ కుటుంబ నియంత్రణ క్లినిక్కులను కూడా ఏర్పాటు చేసింది.

యిక్కడ శిక్షణపొందేవారు క్లాస్‌రూం ప్రసంగాలతోపాటు గ్రామాలలో గ్రామ శిబిరాలను ఏర్పాటుచేసి పిల్లలకు ఆటలను నేర్పుతారు. గ్రామీణులు చక్కటి జీవితాన్ని రూపొందించుకోవాలంటే కుటుంబ నియంత్రణ పద్ధతులను అమలుజరుపవలసిన అవసరాన్ని గూర్చి కూడావారికి తెలియజెప్పుతారు.

ఆంధ్రమహిళాసభ సేవాసంస్థలో ప్రధానమైనది బాలల సంక్షేమ కేంద్రం. ఇది 1947 లో మద్రాసులో ఏర్పాటు చేయబడింది. తదనంతరం యిది వైద్యసహాయ కేంద్రంగా విస్తరించింది. కేంద్ర సంఘ సంక్షేమ మండలి యిచ్చిన గ్రాంటుతో 1962 లో ఆపరేషన్ థియేటర్, సర్జికల్ వార్డు ఏర్పాటు చేయబడ్డాయి. వీటిలో బీదవారికి ఉచితంగా చికిత్స లభిస్తుంది.

ఆగ్జిలరీ నర్సు-మంత్రసానుల శిక్షణ కోర్సు ప్రప్రథమంగా మద్రాసు నర్సింగ్‌హోంలో 1953 లో ప్రారంభించబడింది. ఇందుకు సంక్షేమ విస్తరణ, సమాజాభివృద్ధి కార్యక్రమం క్రింద కేంద్ర ఆరోగ్య మంత్రిత్వ శాఖనుండి ఆర్థిక సహాయం యీ సంస్థకు లభించింది. ఇళ్ళల్లో మంత్రసాని పని నిమిత్తం, శిక్షణ పొందేవారి నందరినీ నగరాల్లోని శిశు సంక్షేమ కేంద్రాలకు పంపిస్తుంటారు. హైదరాబాదులో 1966 లో స్టాఫ్ నర్సింగ్ కోర్సులను కూడా ప్రారంభించారు.

కేంద్ర ఆరోగ్య మంత్రిత్వ శాఖ గ్రాంటుతో 1959 లో మద్రాసులోని నర్సింగ్‌హోంలో కుటుంబ సంక్షేమ కార్యకర్తల శిక్షణ కోర్సును ప్రారంభించడం జరిగింది. ప్రతిరోజూ 'మాతృ సమాచార కేంద్రా'న్ని, వారానికి మూడురోజుల్లు పితృ సమాచార కేంద్రా'న్ని ఇక్కడ నిర్వహిస్తుంటారు.

హైదరాబాదులోని కుటుంబ నియంత్రణ క్లినిక్కు 1962 లో ప్రారంభించబడింది. పురుషులు, మహిళలుగల విస్తరణ బోధకులతోనూ, మహిళా సంక్షేమకార్యకర్తలతోనూ, మగ డాక్టరుతోనూ దీనిని ప్రారంభించారు. ఇక్కడి నర్సింగు హోంను ప్రజల విరాళాలతో నిర్వహిస్తున్నారు. బీద రోగులకు ఉచితంగా చికిత్స లభ్యమౌతుంది. చాలావరకు పరికరాలు కేర్, వార్ ఆన్ వాంట్, యునెసెఫ్‌వంటి విదేశీ సంస్థలనుండి బహుమతిగా లభించినవే.

—టి. రాజగోపాలన్





దేశరక్షణ

# ఆధునిక యుద్ధాలలో టాంకుల ప్రాముఖ్యం

ఆటోమాటిక్ ఆయుధాలు అమలులోకి రావటంతో అశ్విక దళం యుద్ధరంగానికి దూరమైంది. అశ్వారూఢులైన సైనికులు ఆటోమాటిక్ ఆయుధాలకు సులభంగా గురికావడానికి వీలుండటంతో వారు యుద్ధం కొనసాగించటం దాదాపు దుస్సాధ్యమైంది. దాంతో 1920 ప్రాంతంలో అశ్విక దళాన్ని వినియోగించే విధానంలోనే మార్పు తీసుకురాబడింది. యుద్ధ నిర్వహణకు వినియోగించటానికి బదులుగా అశ్వికదళాన్ని శత్రువులపై దాడులు జరపటానికీ, ముందుగా వెళ్ళి పరిస్థితులను తెలుసుకొని రావటానికీ, తిరోగమిస్తున్న సైనికులకు రక్షణ సమకూర్చటానికీ మొదలైన చర్యలకు ఎక్కువగా వినియోగించాలన్న అభిప్రాయానికి రావటం జరిగింది.

ఈ మార్పు అశ్విక దళాధికారులలో చాలా మందిలో నిరుత్సాహాన్ని కలుగజేసింది. యుద్ధరంగంలో ఖ్యాతి అతనికి దక్కడమే సాంప్రదాయం. ఆటోమాటిక్ ఆయుధాల ప్రతిభ వారిని ఆకర్షించింది. ఈ రంగంలో వచ్చిన ఈమార్పు ఫలితమే "లోహాశ్వపు" ఆవిర్భావం. ఈ "లోహాశ్వాన్నే" తర్వాత 'టాంకు' అని పిలవనారంభించారు. ఈ కొత్త ఆయుధం యుద్ధరంగంలో ప్రవేశించడంతో అశ్విక దళం యుద్ధరంగంపై ప్రాబల్యాన్ని కలిగి వుండటానికి తిరిగి అవకాశం ఏర్పడింది. అంతేగాకుండా, యుద్ధరంగంలో విజయం సాధించాలంటే టాంకులు, టాంకు దళాలు వుండటం తప్పనిసరైంది.

"టాంకు" అంటే ఏమిటి? సామాన్యునకు మొదట్లో మనస్సుకు తట్టే ప్రశ్న ఇదే. టాంకు అన్నది నడపటానికివీలైన వేదికపై అమర్చబడిన భారీ శతఘ్ని. టాంకును నిర్వహించే సిబ్బందికి రక్షణ కల్పించేందుకు దీనికి తగినంతగా ఆయుధకవచం వుంటుంది. ఎటువంటి ప్రదేశంలోనైనా టాంకు వేగంగా వెళ్ళగలదు. అయితే యివన్నీ టాంకుకు వుండవలసిన ప్రధాన లక్షణాలు మాత్రమే. అధునాతన సాంకేతిక శాస్త్రం దీనికి అదనపు శక్తి సామర్థ్యాలను సమకూర్చింది. నీళ్ళలో ఈదుతూ లేదా పాకుతూ వెళ్ళటానికీ, విమానాలపై సులభంగా తీసుకు వెళ్ళగలగటానికీ, పారాచూట్లతో క్రిందకు విడవగలగటానికీ వీలుగా దీన్ని రూపొందించటం జరిగింది. ఇంకా ఎన్ని మార్పులు రాగలవో ఎవరూ ఊహించలేరు.

## టాంకు శక్తి సామర్థ్యాలు

టాంకుకు ఇన్ని విశిష్ట లక్షణాలుండటంతో యుద్ధరంగంలో ఇది ఎక్కువ స్వేచ్ఛతో విహరించ గలుగుతుంది. టాంకు ఇంత బలమైంది అయినప్పటికీ దీనికి కూడా కొన్ని పరిమితులున్నాయి. కొండలు, అడవులు, ఊబిభూమి మొదలైన అననుకూల ప్రాంతాలలో ఇది ప్రయాణం చేయలేదు. విమానాలు బాగా క్రిందిగా వచ్చి దీనిమీద దాడిచేయటానికి వీలౌతుంది. ఇంకో విషయమేమంటే, దీనికి నిర్వహణ ఖర్చు అధికం. దీనికి సరఫరాలు ఎక్కువగా కావలసి వుంటాయి. ఈ పరిమితులను అధిగమించి, దీనివలన పూర్తి లాభం పొందటానికిగాను నిరంతర విమానదళ రక్షణ క్రింద దీన్ని మైదాన ప్రదేశాలలో ఉపయోగిస్తూవుంటారు. స్వల్ప కాలంలో శత్రువుపై చావు దెబ్బలు కొట్టాలంటే టాంకునే ఉపయోగించాలి.

టాంకు శక్తి సామర్థ్యాలనూ, దీనికున్న పరిమితులనూ దృష్టిలో వుంచుకొని అధునాతన యుద్ధాలలో టాంకులు నిర్వహించవలసిన పాత్రను నిర్ణయించారు. ఈ పాత్రను గురించి చర్చించే ముందు అధునాతన యుద్ధాల తాలూకు కొన్ని ప్రధాన లక్షణాలను తెలుసుకోవటం అవసరం. ఆధునిక యుద్ధాలలో యుద్ధరంగంలో సరియైన స్థానంలో సకాలంలో తగినన్ని ఆయుధాలు వుండటం అవసరమౌతుంది. అధునాతన యుద్ధాలలో విమానాల ప్రాభవం అధికంగా వుంటుంది. ఆఖరి విషయమేమంటే, వీటిలో అణు ఆయుధాల ప్రయోగానికి అవకాశాలున్నాయి. స్వల్పకాలంలో ఒకే ప్రాంతంపై గురిచేసి కాల్పులు కొనసాగించగలగటం, ఎక్కువ ప్రాంతంలో కాల్పులు నిర్వహించగలగటం—అణుయుద్ధాలలో ఇవి చాలా అవసరం. ఈ సామర్థ్యం టాంకుకు ఉన్నది. అణుధార్మిక శక్తికి లోనైన ప్రాంతాలు మొదలైన వాటిలో టాంకు ప్రయాణం చేయగలిగి వుండటంతో అధునాతన యుద్ధాలకు ఇది శక్తివంతమైన ఆయుధంగా రూపొందింది.

## యుద్ధ నిర్వహణ

యుద్ధ నిర్వహణకే టాంకు రూపొందించబడింది. శత్రువుపై బడి యుద్ధం చేయటమే ఇది నిర్వహించవలసిన ప్రధానమైన పాత్ర. అయితే రక్షణ విషయంలో కూడా ఇది ప్రముఖ పాత్ర వహిస్తుంది. శత్రువుపైకి చుమికి యుద్ధం చేయటంలో టాంకులు నిర్వహించే పాత్ర చాలా ప్రధానమైనదని చెప్పవచ్చు. సమర్థతతో సకాలంలో టాంకులను వినియోగించుట జరిగితే, సేనానికి అంతవరకు తాను సాధించిన విజయాలను దిట్టపరచుకోటానికి అవకాశం ఏర్పడుతుంది. దూరదృష్టిగల సేనాని చేసే పనేమిటంటే, పదాతిదళం శత్రు రక్షణ కవచాన్ని బ్రద్దలు కొట్టిన తర్వాత టాంకులను ఉపయోగిస్తాడు. శత్రు ప్రతిఘటన తగ్గినపుడు ఆ శత్రువును పూర్తిగా ధ్వంసం చేయటం టాంకుల పని. శత్రువును వశం చేసుకోవటానికి టాంకులు సహాయపడతాయి. ఈ యుద్ధ చర్యలలో విమానదళం నిర్వహించవలసిన పాత్రను గురించి కూడా తెలుసుకోటం అవసరం. యుద్ధరంగంలో టాంకులు స్వేచ్ఛగా విహరించగలగాలంటే, శత్రు విమానాలను వాటికి దూరంగా వుంచవలసిన అవసరం ఉంది. శత్రు స్థావరాలపై దాడి జరపటానికి మన విమాన దళానికి స్వేచ్ఛవుండాలి.

టాంకులు మరి కొన్ని బాధ్యతలను కూడా నిర్వహిస్తాయి. ముందుగా వెళ్ళి సమాచారాన్ని సేకరించటానికి వీటిని ఉపయోగిస్తారు. ఈ బాధ్యతను సామాన్యంగా తేలికరకపు టాంకులకు అప్పగిస్తారు. శత్రువులపై ప్రతిదాడులు జరపటానికి కూడా టాంకులను ఉపయోగించటం జరుగుతుంది. పోగొట్టుకున్న కీలక ప్రాంతాన్ని తిరిగి పట్టుకోవడమే ఈ చర్యల లక్ష్యం. తిరోగమనం సాగిస్తున్న దళాలకు రక్షణ సమకూర్చటానికి కూడా టాంకులు ఉపయోగపడుతాయి.

ప్రారంభంలో టాంకులు రాత్రిపూట పనిచేయలేకపోయేవి. అయితే సాంకేతిక శాస్త్రం బాగా అభివృద్ధిచెందటంతో రాత్రివేళలో కూడా ఇవి పనిచేయటానికి వీలయ్యేట్టుగా వీటికి కొత్త సాధనాలను యేర్పాటు చేయటానికి అవకాశం ఏర్పడింది. దీనివలన టాంకులు ఇప్పుడు చీకటిలో కూడా సమర్థతతో సంచరించగలవు, పోరాడ గలవు.

## టాంకు దళం

ఈ వ్యాసాన్ని పూర్తిచేసే ముందు ఈ దేశంలో టాంకు దళం సాధించిన ఘనవిజయాలను గురించి కొంతవరకైనా చెప్పటం అవసరం. ఈ దళాన్ని యేర్పాటుచేసి ఎంతో కాలం కాలేదు. 1947లో కాశ్మీర్ చర్యల సందర్భంలో ఈ దళం టాంకులను 11 వేల అడుగుల ఎత్తునవున్న జోజిలాకు చేర్చి, నూతన చరిత్రనే సృష్టించింది. టాంకులను ఇలా ఉపయోగించటంతో శత్రువులు ఆశ్చర్యచకితులు కావటానికితోడు, ప్రపంచంలో సైనిక విషయాలలో నిపుణులు కూడా దిగ్భ్రాంతి చెందారు. మైదాన ప్రాంతాలలోనే టాంకులు ఉపయోగపడతాయన్న పురాతన సిద్ధాంతం దీనితో రూపుమాసి పోయింది. కొండ ప్రాంతాలలో కూడా వీటిని సమర్థతతో వినియోగించవచ్చని దీనితో రూఢి అయింది. 1962లో చైనా దురాక్రమణ జరిపిన సందర్భంలో వీటిని వినియోగించారు. రాత్రికి రాత్రి టాంకులను లడఖ్‌కు తరలించారు. అవి శత్రువుపై కాల్పులు కొనసాగించి అతన్ని తరిమి కొట్టాయి. తర్వాత 1965లో భారత టాంకు దళం పాటన్ టాంకులను ధ్వంసం చేసింది.

మన టాంకులూ, గురిపెట్టి తుపాకులు ప్రేల్చటంలో సమర్థులైన మన సిబ్బందీ శత్రువులను ఎంతగా భీతావహులను చేసాయంటే, పోరాడకుండానే శత్రువులు పలాయనం చిత్తగించ నారంభించారు. పురాతన టాంకులతోనే మన సిబ్బంది ఇంత సమర్థతతో పోరాడగలిగిందంటే, మనవారి శక్తి సామర్థ్యాలెట్టివో ఊహించవచ్చును. ఈ దేశంలో తయారైన "వైజయంతి" టాంకుతో వీరు మరింత సమర్థతతో పనిచేయగలరు. టాంకు దళంలో "వైజయంతి" ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది.

సువిశాలమైన మన దేశంలో ఎక్కువ ప్రాంతం మైదాన ప్రదేశం. అందుచేత ఈ దేశ రక్షణకు టాంకులు అవసరం. శత్రువు అణు ఆయుధాలు ఉపయోగించ తలపెట్టితే, ఆ రోజున మనలను రక్షించే బాధ్యత టాంకులదే అవుతుంది. కాబట్టి సర్వ సమర్థమైన ఈ మారణ ఆయుధపు ప్రాముఖ్యాన్ని గ్రహించటం చాలా అవసరం.



కొండలు యెక్కడంలో శిక్షణ పొందుతున్న సైనికులు





# సాహితీ రంగంలో సవ్యసాచి

# శ్రీ గోపీచంద్

—త్రిపురనేని సుబ్బారావు

తరతరాలనుండి వంశ పారంపర్యంగా వస్తున్న విద్వత్ కుటుంబంలో జన్మించినవారు శ్రీ గోపీచంద్. వీరి బాల్యం అంగలూరు, చౌటపల్లి, రామాపురం గ్రామాలలో గడిచిపోయింది. విద్యార్థి దశలోనే సమాజంలో గతాను గతికంగా వున్న అర్థంలేని ఆచారాలనూ, అంధవిశ్వాసాలనూ నిశితంగా విమర్శిస్తూ ఉండేవారు. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. షేక్సుపియరు, ఇబ్సెన్, బెర్నార్డ్‌షా, ఆస్కార్ వైల్డ్ మొదలైన ఆంగ్లనాటక కర్తల రచనలను సాంగోపాంగంగా చదివారు. తరువాత మద్రాసు విశ్వవిద్యాలయంలో న్యాయవాది పట్టా పుచ్చుకొన్నారు. కొద్దికాలం తెనాలిలో ప్రాక్టీస్ చేశారు. న్యాయవాద వృత్తి వారికి రుచించలేదు. వెంటనే ఆ వృత్తికి స్వస్తి చెప్పారు. ఇలా చేయడంవల్లనే ఆంధ్రసరస్వతికి ఎనలేని మేలు చేకూరింది.

శ్రీ గోపీచంద్ సుప్రసిద్ధ సాంఘిక విప్లవవాది శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారి కుమారులు.

గోపీచంద్‌గారు సాహితీరంగంలో అడుగు పెట్టేనాటికి అతివాస్తవిక వాదం ముమ్మరంగా ప్రచారంలో ఉంది. కళ్ళకు కనిపించిన దాన్ని నమ్మడం, లేనిదాన్ని కాదనడం_ఇదీ ధోరణి. దేవుడు వుంటే చూపించు అనేవరకూ పోయింది ఆ వాస్తవిక వాదం. ఆస్తిక సమాజంలో పుట్టిన గోపీచంద్‌గారు నాస్తిక వాతావరణంలో పెరిగి పెద్దవారయ్యారు.

నాటి సంఘం అల్లకల్లోలంగా వున్నదని, అన్యాయం, అధర్మం, అవినీతి, అసమానతలు పెచ్చు పెరిగిపోతున్నాయని గోపీచంద్‌గారు గమనించారు. వీటిని సమూలంగా నిర్మూలించడానికి సాహితీరంగమే అనువైనదిగా వారు భావించారు. సామాన్య ప్రజలను ప్రబుద్ధం చేయడానికి గాను, వారికి అందుబాటులో వుండే కథ, నవల, నాటకం, వ్యాసం స్వీకరించి తమ అభిప్రాయలను ప్రచారంచేయాలని సంకల్పించారు.

## రాజకీయాల ప్రభావం

ఆ రోజులలోనే వారు మార్క్సిజాన్ని బాగా అధ్యయనం చేశారు. రష్యా విప్లవం అప్పటికే దేశదేశాలలోని యువజనుల హృదయాలలో ఆశాజ్యోతులను వెలిగిస్తూ ఉంది. రష్యన్ రాజకీయ ప్రభావం గోపీచంద్‌గారి రచనలలోకి ప్రసరించింది. రాజకీయాలనే ఇతివృత్తంగా తీసుకొని "బీదవాళ్ళంతా ఒకటి" "దేశం ఏమయ్యేటట్టు", "గోడమీది మూడోవాడు" "ఇలా జరిగేను", "పిరికివాడు" మొదలైన ఆణిముత్యాల్లాంటి కథలనేకం వ్రాశారు. అప్పుడే "మార్క్సిజం అంటే ఏమిటి?" "పట్టాభిగారి సోషలిజం" "సోషలిష్టు ఉద్యమచరిత్ర" వంటి రాజకీయ గ్రంథాలు కూడా రచించారు.

తరువాత యం. యన్. రాయ్‌గారి రాడికల్ డెమోక్రటిక్ పార్టీలో వారు సభ్యులుగా చేరారు. ఆ పార్టీ కార్యదర్శిగా కొంత

కాలం పనిచేశారు. ఆంధ్రదేశంలో 'నవ్య మానవవాదం' వ్యాపింప జేసిన వారిలో గోపీచంద్‌గారు ప్రథమగణ్యులు. వారు ఎంతో మంది యువకులను హేతువాదులుగా తయారు చేశారు. కాని వారు ఏ రాజకీయ పార్టీతోనూ పూర్తిగా ఏకీభవించలేక పోయారు. జీవిత ప్రవాహం రాజకీయపార్టీలనూ, సిద్ధాంతాలనూ అధిగమించక తప్పదని వారి విశ్వాసం. అందుచేత పార్టీ రాజకీయాల నుండి వారు పూర్తిగా విరమించుకొన్నారు. వారి జీవితం పూర్తిగా సాహిత్యసేవకే అంకితం చేయాలనుకొన్నారు.

## కథా రచయితగా

విశ్వకథా సాహిత్యంలో విశిష్టస్థానం సంపాదించిన చెకోవ్, బేట్సు, టాల్‌స్టాయ్, సారోయన్, పుష్కిన్, గోర్కీ, మామ్, మపాసా, ఓహెన్రీ, పెరల్‌బక్ మొదలైన ప్రముఖ రచయితల కథలు గోపీచంద్ గారిని కదలించి ప్రభావితంచేశాయి. ఆ విషయాన్ని గోపీచంద్‌గారు యిలా చెప్పుకొన్నారు. "నాకు ఈ ప్రఖ్యాత కథకులందరూ వొక్కొక్కరు ఒక్కొక్కందుకు రుచిస్తున్నారు. పుష్కిన్ కథ చెప్పేరీతిలోని స్వాభావికతకు నచ్చుతున్నాడు. చెకోవ్ కథ మొదలు పెట్టడంలోనూ, ఆపడం లోనూ వున్న చమత్కృతికి నచ్చుతున్నాడు. గోర్కీ అతనిలోని ప్రతి అక్షర అక్షరానికీ కనుపించే సిన్సియారిటీకి నచ్చుతున్నాడు. మామ్ జీవితాన్ని చిత్రిస్తున్నట్లు కనపడుతూ, కథను చెప్పుకు పోగలుగు తున్నందుకు నచ్చుతున్నాడు. బేట్సు 'ప్లాట్' లేకుండా వాతావరణాన్ని సృష్టించి మనస్సుని జివ్వున లాగ గలుగు తున్నందుకూ, సారోయన్ ప్లాటు లేకుండా కథను చతుర సంభాషణలతో నడుపుకు పోతున్నందుకూ నచ్చుతున్నారు. ఓహెన్రీ తన నైపుణ్యాన్నంతా కథయొక్క చివరి వాక్యంలోకి ప్రవేశపెట్ట గలిగినందుకు నచ్చుతున్నాడు. ఇటీవల నన్ను పెరల్‌బక్ కథలు అమితంగా ఆకర్షిస్తున్నాయి. దీనికి కారణం ఆమె ఆర్ద్ర హృదయం." ఆంధ్రదేశంలో నూతన దృష్టితో కథాసృష్టిచేశారు. గోపీచంద్. 'దేశం ఏమయ్యేట్టు', 'భార్యల్లోనే వుంది', 'గీతా పారాయణం', 'తండ్రులు-కొడుకులు', 'సరే కానివ్వండి', 'ధర్మాసుపత్రి', 'దేవుని జీవితం' 'ఇరుగు-పొరుగు' 'కూపస్థ మాండూక్యం', 'పాత పగలూ-కొత్త వగలూ' -సంపుటాలుగా వెలువడ్డాయి.

"నేను కథ ఎలా వ్రాస్తాను?" అన్నదానికి సమాధానంగా నేను కథవ్రాయడం మానసిక చర్యగా మనస్సులో వ్రాసుకొని కాగితంమీద పెడతాను. నా కథలు నేను ఇంటి దగ్గర పడుకొని చూరువైపుకు చూస్తూ వ్రాస్తాను. వీధులలో నడుస్తూ లోపలికి చూచుకొని వ్రాస్తాను పదిమందితో మాట్లాడుతూ వ్రాస్తాను. కాని అన్నిట్లోకి నాకు నడుస్తూ వ్రాయడమే సరదా" అన్నారు.

ఆయన ఈ నాడు మానవులను కలవర పెడుతున్న అనేక సమస్యలను తమ రచనలకు ఇతివృత్తంగా తీసుకొనే వారు. వ్రాసింది హృదయానికి హత్తుకొనేట్టు వ్రాయడమే కాక అతి సరళంగానూ, నిర్దుష్టంగానూ వ్రాసేవారు. రకరకాల మనస్తత్వాలను అద్భుతంగా చిత్రించే వారు. సరళంగా సున్నితంగా విషయాలను అవగాహనకు వదలడం, ఆలోచనలను రేకెత్తించి, పఠితల జిజ్ఞాసను పెంపొందించడం గోపీచంద్ గారి ప్రత్యేకత. భావస్పష్టీకరణలో, శైలీ సారళ్యంలోనూ ఆయనకు ఆయనే సాటి.

## సినిమా రంగంలో

గోపీచంద్‌గారు కథకులుగా ఖ్యాతి గడించిన నాటికి దక్షిణ భారతావనిలో చలన చిత్ర పరిశ్రమ వృద్ధిలోకి రాసాగింది. దక్షిణాన సినిమా పరిశ్రమకు మద్రాసు కూడలి. తెనుగు సినిమా పరిశ్రమలోకి అభ్యుదయ భావాలు కలిగిన యువకులు అప్పుడప్పుడే అడుగు పెడుతున్నారు. గోపీచంద్‌గారు శ్రీగూడవల్లి రామబ్రహ్మం గారి ప్రోత్సాహంతో సినిమా పరిశ్రమలో ప్రవేశించారు. 1949 నుంచీ 1953 వరకు గోపీచంద్ గారి జీవితం మద్రాసులో గడిచిపోయింది. "రైతు బిడ్డ" "గృహ ప్రవేశం" చిత్రాలకు భావ గర్భితమైన సంభాషణలు వ్రాశారు "రైతు బిడ్డ" "ప్రియురాలు" "లక్ష్మమ్మ" "పేరంటాలు" మొదలైన చిత్రాలకు దర్శకత్వం వహించారు "కలిమి లేములు" "చదువుకున్న అమ్మాయిలు" చిత్రాలకు కూడా వారు మనోరంజకమైన సంభాషణలు వ్రాశారు. హాస్య రస పోషణలోను, భావోద్రేక సన్నివేశాల నిర్వహణలోనూ ఆయన అందెవేసిన చేయి.

గూడవల్లి రామబ్రహ్మంగారు "పల్నాటి యుద్ధం" చిత్రంగా తీయదలచినప్పుడు విషయ సేకరణ బాధ్యతను గోపీచంద్ గారికి అప్పగించారు. అదే ఇతి వృత్తంగా తీసుకొని 'మాంచాల' నాటకం వ్రాశారు.

మద్రాసులో వున్నంత కాలం గ్రంథ రచన అట్టే సాగలేదు. ఎక్కువ కాలం సినిమాలతోనే గడిచిపోయేది. అయినా ప్రతి రోజూ ఉదయం ఎన్ని పనులున్నా ఒక్క గంటసేపు గ్రంథ రచన సాగిస్తూనే ఉండేవారు. ఏ పరిస్థితిలోనూ మనస్సుకి ఆహ్లాదాన్ని కూర్చే రచనా వ్యాసంగాన్ని విడువరాదనేది వారి అభిమతం.

## అరవిందుని ప్రభావం

వారు మద్రాసులో ఉన్నప్పుడు పుదుచ్చేరిలోని 'అరవిందాశ్రమం'కు వెళ్ళడం జరిగింది. అరవిందుని దర్శనం గోపీచంద్‌గారి జీవిత పథాన్ని పూర్తిగా మార్చివేసింది. ఈ మార్పువల్ల సినిమా వాతావరణంలో వారుండలేక పోయారు

ఇదే సమయానికి నూతనంగా ఏర్పడ్డ ఆంధ్ర ప్రభుత్వంలో గోపీచంద్ గారు సమాచార శాఖ డైరెక్టరుగా పని చేశారు. ఆయన అసాధారణ ప్రతిభా సంపత్తి, అకుంఠిత కార్య దీక్ష, పరిపాలనా సామర్థ్యం అప్పటి గవర్నరు శ్రీ సి యం. త్రివేది గారిని ముగ్ధుణ్ణి చేశాయి. వారి ప్రశంసలను కూడా పొందాయి. ప్రభుత్వోద్యోగంలో ఉన్నా ఆయనకు డాబు, దర్పం ఉండేవికావు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డ తరువాత కూడా కొంతకాలంపాటు సమాచార, పౌరసంబంధ శాఖలో సంయుక్త నియంత్రణాధికారిగా పనిచేశారు. అనివార్యమైన కొన్ని కారణాలవల్ల ఆ పదవినికూడా వారు పరిత్యజించారు.

ఆ తరువాత కొద్ది రోజులలోనే ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో "గ్రామస్థుల కార్యక్రమాల ప్రయోక్త"గా ఆఖరు క్షణం వరకు పనిచేశారు. గ్రామస్థుల కార్యక్రమాల నిర్వహణను స్వీకరించిన తర్వాత వాటి రూపురేఖలలో మౌలికమైన మార్పులను తెచ్చారు. గ్రామీణ ప్రజానీకానికి నిజంగా అవసరమైన వేమిటో శ్రీ గోపీచంద్ గారికి బాగా తెలుసు. కారణం_ వారి బాల్యమంతా పల్లె సీమలో గడిచిపోవడమే. వారి "ఉభయ కుశలోపరి"లో మన పల్లెటూళ్ళ యదార్థ చరిత్ర కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. గ్రామీణ జీవితంలోని, మధుర సన్నివేశాలను వారి ఆచార వ్యవహారాలను, జీవిత విధానాలను ఆధారంగా చేసుకొని వారెన్నో ప్రసంగాలను ప్రసారం చేశారు. వారు వివిధ గ్రామాలలో పంచవర్ష ప్రణాళికల క్రింద జరుగుతున్న అభ్యుదయ కార్యక్రమాలను రికార్డు చేసికొని వచ్చి ప్రసారం చేశారు. వారి "లయ తప్పిన మనుషులు" "చీకటి_కోణాలు" "కాల ప్రవాహం", "విచిత్ర ప్రక్రియ" "అభాగిని" "తత్వమసి" "విశ్వరూప సందర్శనం" "నిలబడిన పరువు" "రోడ్డు మధ్య రాయి", "రచ్చబండ" "పేవ్ మెంట్ మీది పుస్తకం" మొదలయిన నాటికలు శ్రోతల అభినందన పరంపరలను అందుకొన్నాయి. వీటన్నింటిలోనూ గోపీచంద్ గారి ప్రతిభ ద్యోతక మవుతుంది.

## నవలలు

గోపీచంద్ గారు కేవలం కథకులు మాత్రమేకాదు నవలా కారులు కూడా। వారి కథ, గల్పిక, నవల పఠితల మనస్సు మీద చెరగని ముద్రవేసి వినూత్న భావాలను రేకెత్తిస్తాయి. అందలి శిల్ప నైపుణి దిగ్భ్రాంతులను చేస్తుంది. వారు ప్రయోగాత్మకమైన ప్రయోజన కరమైన రచనలు చేశారు. వారి లేఖిని నుంచి "అసమర్థుని జీవయాత్ర", "పరివర్తన", "మెరుపుల మరకలు", "పిల్ల తెమ్మెర" "గడియ పడని తలుపులు", "పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా", "ప్రేమోప హతులు" "శిథిలాలయం", "యమ పాశం" "చీకటి గదులు" (అసంపూర్తి) మొదలైన నవలలు పుంఖాను పుంఖంగా వెలువడ్డాయి. ఇవన్నీ స్వతంత్ర రచనలే. అనువాదాలు, అనుసరణలు కావు. తెనుగు సాహిత్య క్షేత్రంలో ఎక్కువగా స్వతంత్ర రచనల పంట పండించిన వారిలో గోపీచంద్ గారు ఒకరు. వెల్లి విరిసిన వారి రచనలతో ఆంధ్ర సాహిత్య సరస్వతి క్రొత్త కాంతులను విరజిమ్మింది.

శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు రన్నట్టు "శ్రీ గోపీచంద్ రచన లన్నింటిలో_అది చిన్న కథ కానివ్వండి, పెద్ద నవల కానివ్వండి_ మూల తత్వ విచారణకై ప్రయత్నం కనపడుతుంది. ఫలితమేమైనా, దీక్షగా, ధైర్యంతో ఆయన ఈ పరిశీలన చేశారు. ఇదే ఆయన రచనలకు ఒక ప్రత్యేకత చేకూర్చింది. ఇదే నాటికి ఒక వైశిష్ట్యాన్ని సాధించింది. జీవితం_సాహిత్యం_ఇవి శ్రీ గోపీచంద్ కు విభిన్న రంగాలు కావు జీవితమే ఆయనకు సాహిత్యం: సాహిత్యమే జీవితం".

## తాత్త్విక కృషి

ఈ విధంగా ఆయన జీవిత, సాహిత్యాలు ఒకదాని నొకటి పెనవేసుకొన్నప్పటికీ ఆయనను "తత్త్వశాస్త్రం" బాగా ఆకర్షించింది. ప్రాచ్య పాశ్చాత్య తత్త్వవేత్తల గ్రంథాలనేకం అవలోకన చేశారు. అరవిందుడు, డాక్టర్ రాధాకృష్ణన్, జాన్ డ్యూయీ, బెర్ట్రండ్ రస్సెల్ మొదలగు పండితుల తాత్విక భావాలను ఆకళింపు చేసుకున్నారు. వారిలో తాత్విక జిజ్ఞాస ఆనాటికానాటికి అభివృద్ధి నొందసాగింది. ఆయన తత్త్వశాస్త్రాన్ని గురించి ఇలా అంటూండే వారు. "ఇప్పుడున్నదంతా సత్యమని మనం అనుకో కూడదు. అలాగని ఇది అసత్యంకూడా కాదు. ఇప్పుడున్నది ఇప్పటివరకే సత్యం. ఇది అర్ధ సత్యం. దీన్ని ఆధారం చేసుకొని మనం నిత్య సత్యం కోసం తపించాలి. ఆ తపనే "తత్వశాస్త్రం." ఆ తపనే ఆయనను శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగా రన్నట్టు "వేదనా జీవి"గా మార్చివేసింది. వారు రెండు భాగాలుగా "తత్వవేత్తలు" అనే గ్రంథం వ్రాశారు.

గోపీచంద్ గారు భౌతిక వాదిగా జీవితం ప్రారంభించారు. క్రమాను గతంగా పరిణత జెంది భగవంతుని మీద పరిపూర్ణమైన విశ్వాసంతో జీవించారు. అరవిందుని ప్రభావం, తత్వగ్రంథ పఠనం. జీవితం నేర్పిన పాఠాలు గోపీచంద్ గారిని ఆధ్యాత్మిక వాదిగా మార్చివేశాయి. సూక్ష్మంగా చూస్తే ఆస్తిక_ నాస్తిక వాదాల ఘర్షణే వారి జీవితం.

తత్త్వ శాస్త్రాన్ని మనం పరిశీలిస్తే భౌతిక, ఆధ్యాత్మిక వాదాలు అనాది నుంచీ వున్నట్టుగా కనిపించుతుంది. ఈ రెండు వాదాలను సమన్వయ పరచవలసిన ఆవశ్యకతను శ్రీ గోపీచంద్ గారు గుర్తించారు. భౌతిక, ఆధ్యాత్మిక వాదాలను సమన్వయ పరుస్తూ "పోస్టుచేయని ఉత్తరాలు" రచించారు.

## వ్యక్తిత్వం

గోపీచంద్ గారిని కలుసుకొని వారితో మాట్లాడడం అదొక అపూర్వమైన అనుభవం. ఆయన పలుకులు దారుణాఖండల శస్త్ర తుల్యమైనవి అయినా, హృదయం నవనీతం లాంటిది. చక్కని సంభాషణా చతురులు. సంభాషణలో చెణుకులు విసురుతుంటే ఎదుటివారు కడుపుబ్బ నవ్వేవారు. అట్లాంటి చెణుకులు ఆయన రచనలలో కూడా రవ్వల్లాగా మెరుస్తూంటాయి.

గోపీచంద్ గారు సదా హరిత జాతికి చెందిన ఫలవృక్షం లాంటి వారు. వారినుంచి మరెన్ని సారస్వత ఫలాలు ఆంధ్ర దేశానికి లభించి వుండేవో చెప్పలేను. విధి హఠాత్తుగా 22_11_62 సాయంత్రం ఆ మహా వృక్షాన్ని కూల్చి వేసింది. అప్పటికి వారి వయస్సు 52 సంవత్సరాలు మాత్రమే.

ఇప్పటికప్పుడే గోపీచంద్ గారు కీర్తి శేషులై ఆరు సంవత్సరాలు గడిచిపోయాయి. కాని ఇంకా కళ్ళతడి ఆరలేదు. ఎంత మరచిపోదామన్నా ఆయన మూర్తి కళ్ళకు కట్టుతూనే ఉంటుంది. ఆయన కూర్చొని కథ చెబుతున్నట్లుగానూ, నేను 'ఊ' కొడుతున్నట్లుగానూ ఉంటుంది. ఆయన ఇంకా సజీవుడుగా ఉన్నాడని, నేను ఆఫీసుకెడుతూ అప్రయత్నంగా ఆకాశవాణి భవనాలకేసి చూస్తూనే ఉన్నాను. ఆయన మరపురాని మహా మనీషి.

గోపీచంద్ గారు చేసిన సాహిత్య సేవ ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగినది. వారు యావదాంధ్రులకు చిరస్మరణీయులు.



# గృహిణి

పిలకా గణపతి శాస్త్రి

## జరిగిన కథ

పార్థసారథి రాఘవనాట్య కళామండలి ద్వారా నాటకాలు వేస్తుండేవాడు. ఒకసారి ఆయన ఏలూరులో కృష్ణతులాభారం నాటకం వేశాడు. ఆ నాటకంలో పాల్గోవలసిన సరోజ రాక పోవడంవల్ల నాటకం వాయిదా పడింది. తిరిగి స్వగ్రామం వచ్చిన పార్థసారథికి సరోజ మద్రాసు వెళ్ళినట్టు తెలిసింది.

ఆలోచిస్తున్నకొద్దీ పార్థసారథికి తమ మండలి నామమాత్రావశిష్టమై నశించిపోగలదేమో అని భయం కలిగింది. నిజానికతడు తాత్కాలికమయిన ధన నష్టానికి కూడా అంతగా భయపడ లేదు ! రాఘవ నాట్య కళామండలి చల్లగావుంటే అప్పటి నష్టం భరీ చేసుకోవడం అంత కష్టంకాదని ఆలోచించాడు. కాని సరోజ లేకపోతే ఆ మండలి మరి నడుస్తుందా అన్న ఆందోళన కలిగింది. ఆ పైన గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్టు ఇంకొక వ్యధ కలిగింది. కాస్త పరిచయం ఉన్నవాళ్ళందరు పనికట్టుకు వచ్చి 'పాపం ! ఏలూరు నాటకంలో చాలా గంద్రగోళం జరిగిందట !' అని తెచ్చిపెట్టుకున్న సానుభూతితో పరామర్శించి వెళ్ళిపోతున్నారు. మరికొందరు అభిమానులు ఆత్మీయమయిన సానుభూతితోనే ఓదారుస్తున్నారు. అయినా వారి మాటలన్ని అతని గుండెల్లో వాడివాడి బాకుల్లాగ సూటిగా పొడుచుకున్నాయి

అదీగాక సరోజ సాహచర్యంలేని జీవితం అతనికిప్పుడు కేవలం అంధకార బంధురంగా కనబడింది. ఇక ఏమి చెయ్యడానికి రవంతయినా ఆసక్తి కలగలేదు. ఆమెమీద తనకింతటి తీవ్రానురక్తి కలిగినట్టు అతనికిప్పుడే బోధపడింది. ఇన్నాళ్ళనించి ఆమె సాంగత్యంలో హాయిగా కాలం వెళ్ళబుచ్చుకోవడం మూలాన



పార్థసారథికి మెయిలులో ఫస్టుక్లాసు టిక్కెట్ దొరకలేదు గాని సెకండ్‌క్లాస్ టిక్కెట్‌కోసం అంత శ్రమపడవలసిన అవసరం కలగలేదు. అయినా మొత్తంమీద అతని ప్రయాణం సుఖంగా కొనసాగలేదు. రాత్రి తెల్లవార్లు కంటికొక్క కునుకయినా పట్టలేదు! అదృష్టవశాత్తు బండిమాత్రం అంతగా లేటు కాలేదు. అరగంట మాత్రమే ఆలస్యంగా మద్రాస్ సెంట్రల్ చేరుకుంది.

పార్థసారథి అన్ని వసతులు ఉన్న స్టేషన్‌దగ్గర సెంట్రల్ హోటల్‌లో దిగాడు. త్వరగా స్నానంచేసి భోజనం ముగించుకుని రవంతసేపు విశ్రమించాడు. రాత్రి నిద్ర పోకపోవడంవల్ల విపరీతమయిన బడలికవల్ల అతనికించుమించుగా ఒక అరగంటసేపు గాఢంగా నిద్రపట్టింది. మెళకువవచ్చిన తరవాత రిస్టువాచీ చూసుకున్నాడు. సుమారు పదకొండు గంటలయింది. ఆదరాబాదరాగా దుస్తులు వేసుకుని, టాక్సీలోకూర్చుని మౌంట్‌రోడ్ పక్కనే ఆనుకుని ఉన్న పెద్ద వీధిలో గోల్డెన్ లాడ్జి దగ్గిర ఆగి డ్రైవరుకు కిరాయి ఇచ్చివేసి లోపలికి వెళ్ళాడు. అది కొంత పెద్ద తరహా హోటలు. రిసెప్షన్ రూమ్‌లో గుమస్తాని కనుక్కుంటే సరోజ, వెంకటకృష్ణయ్య మొదటి అంతస్థులో 18వ నెంబరుగదిలో దిగినట్టు చెప్పాడు. అయితే వారిద్దరు ఒక అరగంట మునుపే టాక్సీలో ఎక్కడికో వెళ్ళారని అన్నాడు.

'తిరిగి ఎప్పటికి తిరిగివస్తారో!'

ఆ గుమాస్తా యాస తెనుగులో తనకా సంగతి ఎలాగ తెలుస్తుందని చెప్పి కొంచెం వెటకారంగా నవ్వాడు. విపరీతమయిన ఆత్రతకొద్ది ఆ విధంగా అడిగినందుకు పార్థసారథి కొంచెం నొచ్చుకున్నాడు. ఆ తరవాత అతనికిక ఏమి చెయ్యడానికి పాలుపోలేదు. పోనీ సెంట్రల్ హోటలుకి తిరిగివెళ్ళి కొంచెం సేపయిన తరవాత వస్తే? అప్పటికిమాత్రం వారిద్దరు అక్కడికి రాగలరన్న ఆశ ఏమి ఉంది! అలాగే నిలబడిపోయాడు.

చూస్తూండగానే మబ్బుపట్టి చిన్నజల్లు పడడం ప్రారంభించింది. అది తగ్గిన తరవాత ఆ వీధి మొగన నిలబడి ఒక అరగంటసేపు అటు ఇటు తచ్చాడుతూ వారికోసం నిరీక్షించాలని నిశ్చయించుకున్నాడు.

క్రమక్రమంగా వానజల్లు పలచబడి పూర్తిగా తగ్గింది. తిరిగి ఎండ పొడ కనబడింది. అప్పటికే ఇంచుమించుగా ఒక అరగంట కావచ్చింది. ఇక వేచిఉండలేక త్వరగా నడిచివెళ్ళి ఆ వీధిమొగలో పేవ్‌మెంటుమీద అటుయిటు పచారులారంభించాడు. ప్రతి కారుకేసి, టాక్సీకేసి బాగా పరిశీలనగా చూశాడు. ఎక్కడా వారి జాడ కనబడలేదు. అలాగ ఎంతసేపని పరీక్షించగలడు? ఉసూరుమని నిట్టూర్చి తిరిగి వెళ్ళిపోవాలని ఆలోచించాడు. అదే సమయంలో ఒక పెద్దటాక్సీ గోల్డెన్‌లాడ్జివైపు దూసుకుపోయింది. దానిలో ముమ్మొందుగా సరోజ సాక్షాత్కరించింది. అతని గుండె గుబగుబలాడింది! బయలుదేరిన వేళావిశేషం మంచిదని సంతోషించాడు. వెంకటకృష్ణయ్య సరోజ ప్రక్కనే కూర్చున్నాడు. పార్థసారథి వారిద్దరిని రెండుమూడు క్షణాలపాటు ఏకాగ్రదృష్టితో పరీక్షిస్తూ నిశ్చల శిలా ప్రతిమలా నిలుచుండిపోయాడు!

సరోజ నెమ్మదిగా టాక్సీలోనుంచి దిగి హోటలు లోపలికి వెళ్ళింది కాని వెంకటకృష్ణయ్య దిగలేదు! మరికొన్ని క్షణాలలోనే టాక్సీ మౌంట్‌రోడ్‌వైపు తిరిగి శరవేగంతో ముమ్మొందుకు సాగిపోయింది! పార్థసారథి హమ్మయ్యా! —అనుకుని పట్టరాని ఉల్లాసంతో ఉబ్బి తబ్బిబ్బయినాడు. సరోజతో సన్నిహితంగా మాట్లాడడానికి చక్కని సదవకాశం దొరికిందిగదా అని ఎంతో సంతోషించాడు.

గోల్డెన్‌లాడ్జి మేడమీదికి వెళ్ళి నెమ్మదిగా తలుపు తట్టి 18 వ నెంబరు గదిలో అడుగుపెట్టాడు. సరోజ అతన్ని చూస్తూనే నిమిషకాలం నిలువునా నిర్ఘాంతపడింది? మరుక్షణంలోనే తమాయించుకుని కిలకిలనవ్వుతూ ప్రశ్నించింది.

'ఎప్పుడు వచ్చారు? ఎక్కడ దిగారు? అంతాకులాసా?'

పార్థసారథి ఆ ఉదయమే మెయిలులో వచ్చి సెంట్రల్ హోటల్‌లో దిగినట్టు, సరోజ కుటుంబంలోను, తమ కుటుంబంలోను అందరు కులాసాగా ఉన్నట్టు చెప్పాడు. ఆమె వెనువెంటనే ఉట్టిపడుతున్న ఆదరంతో అతనికొక సోఫా నిర్దేశించి దానిపక్కనే ఉన్న ఇంకొక సోఫాలో కూర్చున్నది. హోటలు వెయిటర్ని పిలిచి త్వరగా కాఫీ ఫలహారాలు తీసుకురావలసిందని హెచ్చరించింది. రెండుమూడు క్షణాలవరకు పార్థసారథి మరి మాట్లాడలేదు! నిశ్చల నేత్రాలతో ఆమె అలంకరించుకొన్న తీరంతా జాగ్రత్తగా పరిశీలించాడు. సరోజ లేతకావితో కలిసిన తేనెరంగు సిల్కుచీర ధరించింది. దానిమీద ఎర్రగా కాగిన పాలరంగు పట్టు జాకెట్టు వేసుకున్నది. చీరమీద జాకెట్టుమీద జరీపూల అల్లిక పని కొట్టవచ్చినట్టు పెళపెళలాడిపోతున్నది! అంతకు మునుపెన్నడూ ఆమె అంతఖరీదయిన చీర కట్టుకోలేదు! జాకెట్టు వేసుకోలేదు! పాదాలమీద స్లిప్పర్లు విచిత్రమయిన పైడిరంగుతో తళతళ మెరుస్తున్నాయి. చెక్కిళ్ళమీద లోలక్కులకు బదులు రవ్వలు పొదిగిన దుద్దులు తళతళ లాడుతున్నాయి. వేళ్ళమీద వేర్వేరుగా పద్మరాగాలతో పచ్చలతో పొదిగిన ఉంగరాలు రెండు తరళించాయి. సిగలో తురుముకున్న మల్లెపూల సువాసన అల్లనల్లన అతని హృదయంలో అలముకొన్నది.

'అదేమిటి? అలాగున్నారు! ఒంట్లోగాని బాగాలేదా?'

ఆమెగొంతులో ఆత్రతతో ప్రవేశవించిన ఒక అభిమానము, స్నేహము స్ఫురించాయి.

'అబ్బే, ఏమిలేదు? ప్రయాణ బడలిక మూలాన అలాగ కనిపిస్తున్నానేమో! నిన్న బయలుదేరే సమయానికి కొంచెం పులకరం తగిలింది. అంతే!

'ఇప్పుడు బాగా తగ్గిందా?'

'ఆఁ! తగ్గినట్టే?'

పులకరమనేది కొంచెం జ్వరంగా మారినా పార్థసారథి అది తనకేమీ పట్టనట్టు ఒక్కముక్కలో కొట్టిపారవేశాడు. అదే

సరోజ సామాన్య స్నేహాల మాధుర్యంలోగల లోతెంతటిదో అతని కింతకు మునుపు పూర్తిగా అవగాహన కాలేదు. ఇప్పుడిప్పుడే ఆ విషయమయిన తీవ్రానుభూతి కలుగుతున్నది ; కాని అంతలోనే ఆమె తన చెయ్యి దాటిపోతున్నదేమో అని విపరీతమయిన వేదన కలిగింది. అందుచేత సరోజ దగ్గరికి వెళ్ళి ఎలాగో అలాగ ఆ నటీమణిని తనవెంట బెట్టుకొని రావలసినదే అన్న దృఢనిశ్చయం కలిగింది.

కాని ఆదేక్షణంలో అతని మనోవీధిలో వెంకటకృష్ణయ్య వినీలాకృతి ఒక పెద్ద అడ్డంకిలా సాక్షాత్కరించింది పార్థసారథికి. అతడే తన దురదృష్టానికి, దుస్థితికి మూలకారణమని నిశ్చయించుకుని ఈసడించుకున్నాడు. లేకపోతే సరోజ మేనమామతో కలిసి అంత నిలుచున్నపాటుగా ఎందుకు వెళ్ళిపోతుంది ? అయితే పరిస్థితులన్నీ పూర్తిగా తెలియనిదే ఆమె మీదకాని, అతనిమీద కాని అనవసరంగా అనుమాన పడటంవల్ల లాభమేమిటని తిరిగి తనలో తాను సమాధాన పడ్డాడు. ఏది ఏమయినా, ఒక నిమిషమయినా ఆలస్యం చెయ్యకుండా వెంటనే ఆ సాయంత్రం మెయిలులోనే మదరాసు వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు.

ఆ నాడు రకరకాల ఆలోచనలతో, ఆందోళనలతో, వ్యథలతో, తిప్పట బడలికతో అతనికి కొంచెం పులకరం వచ్చింది. దానితోబాటు రవంత తలనెప్పికూడా ప్రారంభమయింది. అయినా పార్థసారథి లక్ష్యపెట్టలేదు. దృఢనిశ్చయంతో ప్రయాణ సన్నాహం ప్రారంభించాడు. విజయలక్ష్మి అది పసికట్టి, అతని దగ్గరికి వెళ్ళి మృదుమధుర స్వరంతో ప్రశ్నించింది.

'ఎక్కడికిలాగ తొందరగా ప్రయాణ మవుతున్నారు ?'

పార్థసారథి ఆమెదగ్గర ఏమి దాచలేదు. మున్ముందు ఏలూరులో ప్రదర్శించబోయే నాటకం సంగతి సరోజతో మాటాడడానికి మద్రాసు వెడుతున్నట్టు వెల్లడించాడు. ఆమె దగ్గరనించి తిన్నగా సమాధానంకూడా రాకపోవడం మూలాన తనకెంతో ఆందోళన కలుగుతున్నదని చెప్పాడు.

'అయితే రెండు మెతుకులు తిని వెడుదురుగాని ; త్వరగా వడ్డిస్తాను ;'

"అక్కరలేదు. అట్టే ఆకలిగా లేదు"

'ఎప్పుడో పొద్దున్ననగా భోజనం చేశారు. మధ్యాహ్నం ఫలహారంకూడా అక్కర లేదన్నారు ; ఎందుకాకలిలేదు?'

విజయలక్ష్మి అతని ఒంటిమీద చెయ్యివేసింది.

'కొంచెం జ్వరం వచ్చినట్టుందే ; పోనీ కాస్త జ్వరం తగ్గాక వెళ్ళకూడదా ?'

'జ్వరంలేదు, గిరంలేదు ; నా ఒంట్లో నింపాదిగానే ఉంది. కొంచెం పులకరం తగిలినట్టుంది అంతే ;'

పార్థసారథి విసుగ్గా సమాధానం చెప్పాడు.

'అయితే, పోనీ కొంచెంచారు, అన్నం తింటారా ?'

'అక్కరలేదు ; తినాలనిలేదు ;'

పార్థసారథి ప్రత్యుత్తరంలో అదేవిధమైన నిర్లక్ష్య ధోరణి ప్రతిధ్వనించింది.

'పోనీ, కొంచెం కాఫీ అయినా పుచ్చుకుని వెళ్ళండి ;'

విజయలక్ష్మి ప్రగాఢమయిన ఆత్మీయతతో బ్రతిమాలుతుంది. అయినా అతడు దానికేవిధంగాను ప్రతిసమాధానం చెప్పలేదు ; అంతలోనే విజయలక్ష్మి వెంటనే లోపలికివెళ్ళి ఫ్లాస్కులో కాఫీ ఒక వెండిగ్లాసులో పోసి అతని చేతికందించింది. అది తీసుకున్న తరవాత తిరిగి తన హోల్డాలు సర్దుకోవడం ప్రారంభించాడు పార్థసారథి. విజయలక్ష్మి పక్కనే ఉండి అతనికి లాల్చీలు, కండువాలు అందిస్తూ కొంచెం సంకోచిస్తూ నెమ్మదిగా బ్రతిమాలుతుంది.

'మీ ప్రయాణానికేమీ నేను అడ్డు చెప్పడంలేదు. జ్వరం కాస్త నింపాదిగా ఉంటే ఈవేళ కాకపోయినా రేపయినా బయలుదేరి వెళ్ళవచ్చును ; దీనికింత తొందరఏమి వచ్చింది. కొంచెం నామాట వినండి;'

ఆమె కంఠంలో డగ్గుత్తిక చూచాయగా స్ఫురించింది. కాని పార్థసారథి దానికేవిధంగాను ప్రతిసమాధానం చెప్పలేదు. ఇక అడ్డు చెప్పడంవల్ల లాభంలేదని గ్రహించి విజయలక్ష్మి ఉసూరుమని నిట్టూర్చి మౌనం వహించింది. మరి ఒక పావుగంటలో పార్థసారథి గుర్రపుబండితో సహా తిరిగివచ్చాడు. బండివాడు అతని సామానులన్ని లోపల పెట్టాడు. వెడుతున్నానని తొందర తొందరగా ఇంటిల్లిపాదితోను చెప్పి పార్థసారథి బండిలో కూర్చున్నాడు.

మరి నాటకంమాటే తలపెట్టక సరోజ మేనమామతో కలిసి మదరాసు వెళ్ళిపోయినదని విని విజయలక్ష్మి మొట్టమొదట కొంత ఆశ్చర్యపడింది. ఆ తరువాత, పోనీ తాత్కాలికంగా నయినా ఆమె బెడద శాంతించగలదని రవంత సంతోషించింది. కాని పార్థసారథి ఇప్పుడావిధంగా ఆదరాబాదరగా ప్రయాణం కట్టడంతోనే తిరిగి ఆమెగుండెల్లో ఆందోళన చెలరేగింది. నాటక ప్రదర్శనంమీద ఆసక్తితోనే, తహతహతోనే మద్రాసు వెడుతున్నట్టు చెప్పినా, సరోజమీది మమకారం మూలాన్నే అంత తొందరగా భర్త ప్రయాణం కట్టినట్టు పసికట్టివేసింది. కాని ఆ భావం ఛాయామాత్రంగా నయినా ముఖం మీద వ్యక్తం కానీయలేదు; పిల్లలిద్దరితోను, అమ్మమ్మతోను కలిసి వీధి గుమ్మంలో నిలబడి కనబడినంత వరకు బండిలో కూర్చున్న భర్త ముఖం మీద ఏకాగ్ర నిశ్చలదృష్టి నిలిపింది. ఆ సమయంలో ఆమె చెక్కిళ్ళ మీద వేడివేడి కన్నీరు ధారకట్టి ప్రవహించింది.

సమయంలో వెయిటరు కాఫీ ఫలహారాలతో అక్కడికి వచ్చి అవి వారికెదురుగా ఉన్న బల్లమీద పెట్టి వెళ్ళిపోయాడు. ఎంతగా బలవంతంచేసినా అక్కరలేదని చెప్పి పార్థసారథి కాఫీ మాత్రమే తీసుకున్నాడు. కాని సరోజ తనపట్టు విడిచిపెట్టలేదు. అందుచేత మరి కాదనలేక ఒకటిరెండు పకోడీలు నోటపెట్టుకున్నాడు. సరోజ ఫలహారం ప్రారంభించి ఎంతో దీనంగా ముఖం పెట్టి, శిరస్సు వంచి క్రీగంటితో అతని వైఖరి పరిశీలించింది. బుంగమూతి పెట్టి నెమ్మదిగా సణిగింది.

'ఎన్నెన్ని విధాల ప్రయత్నించినా నాటకానికి రావడం పడలేదండి ; ఏమిచెయ్యను ! అన్నీ అవాంతరాలే వచ్చాయి : ఇంతకీ ఏ గొడవా లేకుండా అంతా సవ్యంగా జరిగిపోయిందా ?'

'అదేమిటి అలాగడుగుతున్నారు ! నేను రాసిన ఉత్తరం అందలేదా ?'

పార్థసారథి నిలువునా నిర్ఘాంతపడి అడిగాడు.

'ఉత్తరం ఏమిటి ? నాకేదీ అందలేదే !'

ఇంతకీ నాటకం అంతా బాగా సాగిపోయిందా ' సరోజ మరింతగా నిర్ఘాంత పడి అడిగింది.

'ఆఁ ఏం సాగడం! పెద్ద రభస అయింది!' పార్థసారథి ఆనాడు జరిగిన సంఘటన అంతా సంగ్రహంగా చెప్పి కొంత నిష్ఠురంగా అడిగాడు.

'పోనీ వెళ్లేముందు ఒక్క కార్డుముక్క గీసి పారవేస్తే ఇంత గొడవ జరక్కపోవునుగా!'

'బయలుదేరేముందు తప్పకుండా నాటకానికి అందుకోవాలనే అనుకున్నాను ! కాని ఏమిచెయ్యను ? బొత్తిగా వీలుపడలేదు'

'అయితే అంత తొందరగా బయలుదేరవలసినంత అగత్యం ఏమివచ్చింది ?'

పార్థసారథి మరింతగా చిరాకుపడి అడిగాడు. సరోజ ఆ కథ అంతా కొంత ముభావంతో సంగ్రహంగా మొదలుపెట్టింది. మద్రాసులో పెద్ద డైరక్టరు ఒకాయన 'బంగారు నౌక' అన్న సినిమాలో హీరోయిన్‌గా నటించవలసినదని తలవని తలంపుగా అకస్మాత్తుగా తన మేనమామ ద్వారా కోరాడు. ఆ తరవాత దానికి సంబంధించిన కంట్రాక్టు వ్యవహారం కుదుర్చుకోవడానికి వెంటనే బయలుదేరవలసినదని ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం పంపించాడు. తాను నాటకం అయిన తరవాత వెళ్లవచ్చునని పట్టుపట్టింది. కాని మేనమామ తనమాట బొత్తిగా వినిపించుకోలేదు ! ఇక ఒక్క నిమిషమయినా ఆలస్యమయితే ఆ కంట్రాక్టు చెయ్యిదాటి పోగలదని తొందరపెట్టాడు. మొట్టమొదటే హీరోయిన్ ఛాన్సు రావడం చాలా గొప్ప అదృష్టమని అభినందించాడు. అలాంటి అవకాశం జారవిడవడం వట్టి తెలివితక్కువతనమని హెచ్చరించాడు. తల్లి కూడా ఆయనతో ఏకమై వెంటనే బయలుదేరవలసినదని మాటిమాటికి వంత పాడింది. పోనీ కంట్రాక్టుమీద సంతకం పెట్టిన వెంటనే త్వరగా బయలుదేరి తిరిగి ఏలూరు నాటకానికి అందుకోవచ్చునుకదా — అని అతి బలవంతంమీద ప్రయాణానికంగీకరించింది. కాని తీరా మద్రాసు వచ్చిన తరవాత ఆ కంట్రాక్టు వ్యవహారం అనుకున్నంత తొందరగా కుదరలేదు. ఆఖరి క్షణంలో దానికోసం మద్రాసులో ఇంకా కొన్నిరోజులుండక తప్పదని తెలిసింది. మరి గత్యంతరంలేక వెంటనే గుత్తపేట అర్జంటు టెలిగ్రాం కొట్టింది. ఆ నాటకం అలాగ అభాస అయినందుకు తన ప్రగాఢ పశ్చాత్తాపం వెల్లడించింది.

కొంత ముక్తసరిగా ఆమె చెప్పిన ఆకథ అంతా విన్న పిమ్మట పార్థసారథి 'కలగంటున్నానా ? మేలుకొన్నానా ?' అని క్షణకాలం పట్టరాని ఆశ్చర్యంతో ఆందోళనతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు ! ఆ క్షణంలో అతని మనస్సులో ఎన్నెన్నో ఆలోచనలు గజిబిజిగా చిందరవందరగా చెలరేగాయి ! అయినా మర్యాదకోసమని కొంత అర్భకుడిగా అభినందించకుండా ఉండలేకపోయాడు. ఆ సినిమాలలో మొట్టమొదటే హీరోయిన్ ఛాన్సు రావడం చాలా గొప్ప అదృష్టమని అంటీ అంటనట్టు ప్రశంసించాడు. అదంతా నాటకాలలో ఆమె అభినయ శక్తిసామర్థ్యాల ఫలితమే అని మెచ్చుకున్నాడు.

ఆ పొగడతో సరోజలో ఉల్లాసం మరింతగా చెలరేగింది. 'బంగారునౌక'లో హీరోయిన్ వేషం వేస్తున్నందుకు, తనకు ఇరవై వేల దాకా ముట్టబోతున్నట్టు వెల్లడించింది. డైరక్టరు మొదట హీరోయిన్ అవకాశం యివ్వడానికి ఒప్పుకోక పోయినా మేనమామ కాదుకూడదని పట్టుపట్టడంవల్ల నాటకాలలో తనపేరు ప్రఖ్యాతులవల్ల ఎట్టకేలకు చిట్టచివరికంగీకరించారని చెప్పింది. ప్రొడ్యూసరు, వెంకటకృష్ణయ్య చిన్నతనాన్నించి స్నేహితులనీ, అందువల్లనే తనకంతటి గొప్ప అదృష్టం పట్టినదని అసలు రహస్యంకాస్తా బయటపెట్టింది. అయితే తన శక్తిసామర్థ్యాలెంతో గొప్పవని ఆ ప్రొడ్యూసరుకూడా అంగీకరించారని చెప్పి ఉప్పొంగిపోయింది. ఏది ఏమయినా మేనమామ ఋణం మాత్రం తీరేదికాదని అతనిని ఆకాశానికే ఎత్తివేసింది. ఆ మాటలో మాటకలిపి రాఘవకూడా ఆ సినీమాలో నటించబోతున్నట్టు కంట్రాక్టు కుదుర్చుకోవడంకోసం రెండుమూడు రోజులలోనే బయలుదేరి వస్తున్నట్టు చల్లచల్లగా వెల్లడించింది.

పార్థసారథి, సరోజ అదృష్టాన్ని మరింతగాఅభినందించాడు. కానీ అతనికి తన కాళ్ళకింద భూమి కుంగిపోతూన్నట్టనిపించింది ! ఆ తరవాత రెండు మూడు క్షణాలవరకు అతని నోట మాట వెలువడలేదు. ఆమె చెప్పినదానినిబట్టిచూస్తే వెంకటకృష్ణయ్య గట్టిగా పట్టుపట్టి సరోజనక్కడికి తీసుకవచ్చినట్టు స్పష్టపడుతున్నది. బహుశ రాఘవకూడా అతని ప్రోత్సాహ సాహాయ్యాలతోనే అదే సినీమాలో చేరిపోతున్నాడన్న మాట ! మొత్తంమీద ముగ్గురు కలిసి తనకేమి తెలియకుండా గుంభనగా గూడుపుఠానీ కొనసాగిస్తున్నారన్నమాట. కాని సరోజ అదంతా తలవని తలంపుగా జరిగిపోయినట్టు మాట్లాడింది ! అయితే ఆ వ్యవహారం చాలాకాలంనించి నలుగుతున్నట్టు రాఘవ చెప్పాడు. సరోజ అమాంతంగా ఒక కట్టుకథ కల్పించినదన్నమాట. అనుకున్నాడు పార్థసారథి.

(సశేషం)



# పురాతన భారతీయ కళాసంపద

—ఆచంట జానకిరామ్

ఆలోచన అనేది మనిషి సంపాదించుకున్న వరం. అతడు ప్రతి సంఘటననూ తన జ్ఞాపకాల పుటలలో భద్రపరచుకోవాలని చూస్తాడు. కేవలము భద్ర పరచుకోవడమే కాదు, దానికొక మనోహరమైన ఆకృతినిచ్చి అపురూపముగా దాచుకుంటాడు. ఏ వ్యక్తికో చిన్న ఆలోచన వస్తుంది. ఒక అనుభవమో, అనుభూతో కలుగుతుంది. దానిని అతను ఒక కమ్మని కవితలోనో, ఒక రమ్యమైన చిత్రములోనో, ఒక అపూర్వమైన శిల్పములోనో శాశ్వత ప్రతిష్ఠ చేయాలని చూస్తాడు. సమాజం ఒక కట్టడాన్ని నిర్మిస్తుంది. దాని అద్భుతమైన కళా విన్నాణాన్ని బట్టి, నిర్మాణంలోని వస్తువునుబట్టి కాలపు వెల్లువకు ఎదురొడ్డి నిలిచి పరిసర ప్రజలకే కాక దూర దూర తీర భూములలోని తర తరాల ప్రజలకు సైతం కన్నులకు కమ్మని విందు చేకూరుస్తుంది. పురాతన భారతీయ వాస్తు నిర్మాణ సంపద అంతా ఏ ఒక్క వ్యక్తి ఊహాకో రూపకల్పనగాదు. అనేకుల ఊహా సుమాల సుందర కదంబ సుమసౌరభం అది. ఒకే ఒక్క శిల్పి పనితనం కాదు. అనేక తరాలనుండి అనేక శిల్పులు తమ శక్తియుక్తులను కేంద్రీకరించి తమ ప్రతిభా వ్యుత్పత్తులను బహిర్గత మొనర్చి యావత్ జాతినీ ప్రభావితం చేసే అపూర్వ నిర్మాణ సంచయం అది. అందుకే, భారతదేశ మందంతటా వెల్లి విరిసివున్న చారిత్రాత్మక నిర్మాణాలు ఒక విధంగా విలువ కట్టలేని మన అపూర్వమైన నిధులు. వీటి ప్రాభవాన్ని మనం పెంచలేక పోవచ్చును, వాటి సౌంద



అమరావతి రాళ్ళలో ప్రేయసీప్రియులు



విజయనగర శిల్పకళకు మచ్చుతునక.

ర్యాన్ని యినుమడింప జేయలేక పోవచ్చును. అయితే వాటిని రానున్న తరాల వారి కొరకైనా శిథిల పరచకుండా యథా తథంగా భద్రపరచటానికి మనం ప్రయత్నించాలి.

ఈ నాటికీ మనకు మిగిలివున్న తొలి చరిత్రాత్మక నిర్మాణాలు—మౌర్య సామ్రాజ్యాధీశుడైన అశోకుని శిలా శాసనాలు. ఇవి కొద్దో గొప్పో కళాత్మకమైనవే. దేశమంతటా అనేక చోట్ల ఆయన రాతి స్తంభాలను నాటించాడు. తన సువిశాల సామ్రాజ్యమందంతటా బౌద్ధ మత సిద్ధాంతాలను పరివ్యాప్తం చేయడానికై ఆయన ఆ స్తంభాలను ఉపయోగించాడు. ఇవి రెండువేల సంవత్సరాల కన్నా ముందువి. వాటి మీద అశోకుని శాసనాలు, సందేశాలు, న్యాయ సూత్రాలు, ఆయన చేసిన చేతలు: తన ప్రజల భౌతిక, ఆధ్యాత్మిక ప్రాభవాన్ని కోరే ఆయన ఆకాంక్షలు చెక్కబడి వున్నాయి. నునుపుగా చెక్కిన యీ రాతి స్తంభాలు నలభై అడుగులు మొదలుకొని యాభై అడుగుల వరకు ఎత్తు కలిగి వుంటాయి. గుండ్రంగా, నునుపుగా, నిటారుగా వున్న స్తంభం చివరలో బోర్లించివున్న అందమైన తామర పువ్వు వుంటుంది. దానిమీద ఏనుగో, గుర్రమో, ఎద్దో, సింహమో అత్యంత రమణీయంగా చెక్కబడివుంటుంది. లేదా ముందుకి ధర్మ చక్రం వున్న గద్దెమీద వర్తులంగా కూర్చున్న సింహాలు చెక్కబడి వుంటాయి. సారనాద్‌లోని ఆ విధమైన అశోక స్తంభాన్నే స్వతంత్ర భారతావని జాతీయ చిహ్నంగా మనం ఏర్పరుచుకొన్నాం. మన జాతీయ జెండాలో ధర్మ చక్రం అతి ప్రధానమైనది.



దిల్వార జైన్ దేవాలయం పైకప్పు మీది చెక్కడపు పనితనం

మౌర్య శిల్పం తర్వాత శిల్ప కళలో ప్రధానంగా పేర్కొదగది బారహత్ శిల్పం. బుద్ధుడు తన సందేశాన్ని వినిపించిన తావులలోనూ, నడయాడిన ప్రాంతాలలోనూ ఆకాలంలో కట్టడాలు నిర్మించారు. ఈ నిర్మాణాలలో ఎక్కువ స్థూపాలే. బుద్ధుని అస్థికలమీద నిర్మించిన కట్టడాలివి. అలహాబాదు, జబల్‌పూర్ మధ్య



గాంధార శైలిలో చెక్కిన బుద్ధప్రతిమ



బేలూరు శిల్పరీతిలో చెక్కిన ముకుర ముద్దియ

రహత్ స్తూపం వున్నది. అశోకుని కాలంలో బహుశా యీ స్తూపం వుండి వుండవచ్చును. అయితే యీనాడు అక్కడ మనకు కనిపించేవి చెక్కిన రాతి ఫలకలు, ఒంటరిగా నిలిచిన స్తంభాలు, శిథిల ప్రాకారంలోని రాళ్ళు మాత్రమే. ఈ బారహత్ శిల్పం మనకు చారిత్రాత్మకమైన సమాచారాన్ని యివ్వడమేగాక బుద్ధుని జీవితానికీ, అతని ముందరి జన్మలకూ సంబంధించిన ముఖ్యమైన సంఘటనలను తెలియజేస్తుంది. ఎర్ర రాతిలో చెక్కిన ముఖ్యమైన వాటిలో జాతవన ఆరామ గాథ తాలూకు శిల్పం ప్రధానంగా చెప్పుకోదగది. బుధుని భక్తుడౌకరు ఆరామ నిర్మాణానికీ, దాని చుట్టూ తోటలను వేయడానికీ గాను బంగారు నాణేలను పట్టుకొచ్చి బండిలోనుండి దింపుతూన్నట్టు చెక్కబడివున్నది.

బారహత్ శిల్పంలో యివిగాక అతి సుందరంగా చెక్కిన యక్షులు, యక్షిణిలు, దేవతలు, నాగరాజులు వున్నారు. ఈ శిల్పంలోని ఆకృతిలో నిండు దనం వుంది. ఆకర్షణ వుంది. జీవన రసధునిని మునిగి తదాత్మ్యం జెందే కళా ప్రతిభ వుంది.

ప్రాకారం మీద చుట్టూ వున్న శిల్పం, ఫలక శిల్ప రీతిలో వున్నప్పటికీ ప్రతి ఆకృతీ తగు విధంగా ముందుకు ఉబ్బెత్తుగా వుండి, రాతి ఫలకనుండి విడివడుతూ ఒక ప్రత్యేక ప్రతిపత్తిని పొంది వుంటుంది. దీనిమీద చెట్లు, అరణ్యాలు, సరస్సులు, నదులు, ఏనుగులు, లేళ్ళు, వానరాలు, పక్షులు ఎన్నెన్నో యిక్కడి శిల్పంలో కనిపిస్తాయి. బారహత్ శిల్పంలో యుద్ధ ఘట్టాలు కనిపించకపోడం ఒక విశేషం. బుద్ధుణ్ని కూడా ఒక పాద ముద్రగానో, ఒక సింహాసనం రూపంలోనో, ఒకొక్కప్పుడు మహాబోధి వృక్షం రూపంలోనో సూచనా మాత్రంగా చూపించారేగాని ఆకృతిగా చూపించలేదు.

బారహత్ శిల్పాన్ని గూర్చి సుప్రసిద్ధ చరిత్ర కారుడు గెట్రూడ్ ఏమర్‌సన్ సెన్ యీ విధంగా అన్నారు.—

"ఈ చిన్న శిల్పాలు ఏ దంతపు చెక్కడాల్నో, కర్ర చెక్కడాల్నో పోలివున్నాయి. శిల్పులు రాతి చెక్కడపు పనితనంలో యింకా సిద్ధహస్తులు అయినట్టులేరు. ఈ శిల్పాలు ఆ తరువాతి కాలానికి చెందిన సాంచీ, అమరావతి ఆంధ్ర శిల్పాలను నేరుగా పోలివున్నాయి. అక్కడి మాదిరిగానే కొద్దిపాటి స్థలం లోనూ అనేక ఆకృతులు మరీ ఎక్కువగా గుమిగూడి వున్నాయి. అక్కడి లాగే రాతిలో కథ చెప్పడం కనిపిస్తుంది. అక్కడి మాదిరిగానే ఒకే కూర్పులో వున్న వివిధ ఘట్టాలను ప్రకటించేటప్పుడు ప్రధానమైన ఆకృతిని మళ్ళీ మళ్ళీ చూపించడం, అదే మాదిరి అలంకరణ, అదే మాదిరిగా జంతువుల్నీ, పక్షుల్నీ, పూలనూ చెక్కడం, లక్ష్య ప్రకటనలో అదే చిత్త శుద్ధీ అదే అమాయకతా—అంతా అక్కడి శిల్పాన్నే పోలివుంది"

ఆ తరువాతి కాలానికి చెందిన భోపాల్‌లోని సాంచీ స్తూపం, గుంటూరు జిల్లాలో కృష్ణానది కుడివైపు గట్టున వున్న అమరావతి శిల్ప కళా సంపద, ఆ ఎగువనే వున్న నాగార్జున కొండలు పరిశీలిద్దాం.

అశోకుని కాలం మొదలుకొని సుమారు పదమూడు శతాబ్దాల వరకూ సాంచీ శిల్పం నిర్మితమై వచ్చింది. సాంచీ స్తూపమే అనేక శతాబ్దాల తరబడి నిర్మించబడిందనడానికి ఆధారాలు వున్నాయి. అత్యంత సుందరంగా చెక్కిన అవృత కుడ్య ఫలకాలు, బ్రహ్మాండమైన నాలుగు తోరణాలు క్రీస్తుకు పూర్వం ఒకటవ శతాబ్దం నాటివని చెప్తారు. ఈ తోరణాలు నేటికీ అలానే నిలిచి వున్నాయి. కాలానికి ఎదురు నిలిచి చెక్కు చెదరకుండా హుందాగా అలానే రెండువేల సంవత్సరాలుగా నిలిచివున్నాయి. వీని నిండా అతి సూక్ష్మమైన కళాత్మక ప్రతిభను ప్రకటించే చెక్కడపు పనితనం నిండివుంది. ఈ తోరణాలమీద ఊరేగింపు దృశ్యాలు అనేకం చెక్కబడి వున్నాయి. గ్రామీణ జీవన దృశ్యాలు కొల్లలుగా వున్నాయి. గ్రామీణ స్త్రీలు శిగకొప్పులతో, అచ్ఛాదనగా వున్న చిన్న చిన్న వస్త్రాలతో, బరువైన మట్టెలతో, చేతి కంకణాలతో వడ్లు దంపుతూనో, చెరుగుతూనో, తెరచిన తలుపుల్లోంచి లోపల వంట వండుకుంటూనో కనిపిస్తారు. రాజకుటుంబాల వారు లావణ్య స్నిగ్ధ మూర్తులు ఐశ్వర్యానికీ, అధికారానికీ దర్పణాలైన అలంకారాలతో రాజప్రాసాదాలలో వారినికూడా యిక్కడ మనం చూడొచ్చు. ప్రాసాదాలలోనూ, బాల్కనీలోనూ అనేక గృహకృత్యాలకు సంబంధించిన దృశ్యాలు దర్శనమిస్తాయి. బుద్ధుని వానర జన్మకు సంబంధించిన శిల్పం ఒకటి వుంది. తోటి వానరాలు ఆపదలో చిక్కుకుని వున్న తరుణంలో ఆ ఆపదనుంచి వారు దాటుకుని పారిపోవడానికి తన శరీరాన్ని త్యాగం చేసిన సంఘటన యిది. 'సమ కాలీన ఆంధ్ర

నగర, గ్రామీణ, ఆటవీ జీవితం యావత్తూ మానవులూ, జంతువులూ, ఫల పుష్పాదులు అన్నీ మళ్ళీ సాంచీ రాళ్ళలో ప్రాణం పోసుకున్నాయి, అని ప్రసిద్ధ, చారిత్రక విమర్శకుడు గెట్రూడ్ ఎమర్‌సన్ సెన్ సాంచీ కళా ఖండాల అపూర్వ సంపదను ఒక్క వాక్యంలో పేర్కొన్నారు.

'భారత దేశం ఒక్క సాంచీనే నిర్మించి వున్నా అత్యున్నతమైన కళా ప్రతిభగల దేశంగా ప్రపంచం ఎదుట నిలబడగలిగేది. ఆంధ్ర కళా ఖండాల అద్వితీయ సౌందర్యం, స్నిగ్ధమోహన సౌకుమార్యం, ఆధ్యాత్మిక భావ సంపద అమోఘమైనవి.'

విజయవాడకు అతి సమీపంలోనే అపూర్వమైన అమరావతీ కళా సంపద వున్న విషయం యీ తరం ఆంధ్రులకు చాలా మందికి తెలియకపోవడం విచారకరం. ఇక్కడే ఒకప్పుడు ఒక గొప్ప బౌద్ధ విశ్వ విద్యాలయం పరిఢవిల్లింది. ఇక్కడే అశోకుడు ఒక పెద్ద స్తూపాన్ని కూడా నిర్మించాడని చరిత్ర కారులు చెప్తారు. చాలా వరకు అమరావతి శిల్పాలు తరలించి వేయబడ్డాయి. కొన్ని బ్రిటిష్ మ్యూజియంను, మరికొన్ని భారతీయ పురావస్తు ప్రదర్శన శాలలను, ఇంకొన్ని మద్రాసు మ్యూజియంను చేరుకున్నాయి. అక్కడ వీటిని చక్కగా భద్రపరుస్తున్నారు. అయినా యీ నాటి ఆధునిక అమరావతి గ్రామమే ఒక అద్భుతమైన పురావస్తు కేంద్రం. కళాప్రియులకే గాక చరిత్ర విద్యార్థులకు కూడా కన్నుల విందు చేయగల కళా సంపద యిక్కడ వుంది. వెనకటి స్తూపం యిప్పుడు యిక్కడ లేదు. కాని ఆ స్థూపానికి చిన్న ప్రమాణంలో అద్భుతమైన స్థూప శిల్పాలు చుట్టూ వున్న రాతి ఫలకాలమీద ఫలక శిల్ప రీతిలో మలచివున్నవి చూచినప్పుడు యిక్కడ ఒకప్పుడు మహోన్నతమైన స్థూపం వుండి వుండేదన్న సత్యం అవగత మౌతుంది. అమరావతి శిల్పాలు మౌర్య సామ్రాజ్య కాలం



బుద్ధభగవానునికి శిల్పనీరాజనం



పద్మాసనమూర్తి తథాగతుడు

మొదలుకొని ఆరు శతాబ్దాల పాటు నిర్మించబడ్డాయి. శాతవాహనులు, ఇక్ష్వాకులు అనే రెండు సుప్రసిద్ధ రాజవంశాలు యీ శిల్పాలను నిర్మించారు. అమరావతి శిల్పాలు సాంచీ శిల్పాలకన్నా మెరుగైనవి. మద్రాసు మ్యూజియంలో అద్భుతమైన అమరావతి కళాఖండం ఒకటి వుంది. మదించిన ఏనుగును బుద్ధ భగవానుడు అణచివేస్తున్న శిల్పం అది. చక్కటి కళా ప్రతిభను దర్పణం పడుతుంది శిల్పం. మరొక చిర పరిచిత దృశ్యం– పూర్ణకుంభం. పూర్తిగా వికసించిన కలువలతోనూ సంపదకూ సమృద్ధికీ చిహ్నాలైన ఫలప్రతాదులుతోనూ నిండిన అందమైన కలశం యిది. నేటి మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర చిహ్నం యీపూర్ణ కలశమే.

అమరావతి శిల్పకళ జాజ్వల్య మానంగా వెల్లి విరుస్తున్న కాలంలోనే ఆంధ్ర శిల్పులు కొంతమంది కృష్ణానదిమీదుగా ఎగువకు అరవై మైళ్ళ దూరానికి నాగార్జున కొండవరకూ వెళ్ళి మాధ్యమిక వాద ప్రవక్త ఆచార్య నాగార్జునుని ఆధిపత్యం క్రింద అక్కడొక పెద్ద విశ్వ విద్యాలయాన్ని స్థాపించారు. ఇక్కడ అత్యద్భుతమైన శిల్ప కళా ఖండాలు వున్నాయి. అమితారాయ్ మాటల్లో చెప్పాలంటే–

"పూర్ణ వికాసం చెందిన అమరావతీ, నాగార్జున కొండ శిల్పాలలో మధ్య, తూర్పు భారత దేశాలలోని తొలి సామాన్య కర్షక జీవుల సుందర జీవితాన్ని కళ్ళముందుంచే నిండైన ఆకృతి కనుపిస్తుంది. ప్రకృతిని వెనుకకు నెట్టిన శిల్పం యిది. అయితే ప్రకృతిలోని చైతన్య మయత్వాన్ని దాని బహు రూపాలలో కళ్ళకు కట్టినట్టు వెల్లడించింది. నిరంజనరాయ్ చెప్పినట్టు



అమరావతి ఫలక శిల్పాలు



నన్నగా పొడవుగా వున్న లావణ్య మూర్తులు గుంపులు గుంపులుగా ఎక్కడ బడితే అక్కడ చూపువాలిన చోట్లలా కూర్చొనో, నిలుచునో, విశ్రాంతి తీసుకుంటూనో, వంగి పనిచేసుకుంటూనో ఎగురుతూనో, నృత్యంచేస్తూనో, రకరకాల రూపాల్లో, భంగిమల్లో కనిపిస్తూ స్థబ్ధతలేని చైతన్యతను ప్రకటిస్తుంటారు."

భారత దేశాన్ని పాశ్చాత్యులకు పరిచయం చేసినవారు ఆనంద కుమారస్వామి. హేవెల్, మార్షల్, ఆర్చర్. ఈ కోవలో విస్మరించదగని మరొక వ్యక్తి పెర్సీబ్రౌన్. ఒక సందర్భంలో వారు పురాతన భారతీయ శిల్పాల్ని ఉద్దేశించి చెప్తూ యిలా అన్నారు.

'కళా స్వరూపానికి అతీతమైన దానిని దేనినో యివి వ్యక్తంచేస్తాయి. ఒక గొప్ప లక్ష్య సాధనను ప్రకటిస్తాయి. ప్రతి తునకా ఒక సత్యానికి దర్పణం. మనిషి మనసూ, ఆలోచనా ఆచరణా ఒక గొప్ప లక్ష్యాన్ని సాధించడానికి ఏకోన్ముఖమై ఒకదానితో ఒకటి వెనవేసుకు పోయిన అరుదైన సమయంలో జరిగిన బృహత్ సృష్టికి యివి నిదర్శనాలు.



(ఆంగ్ల వ్యాసానికి తెలుగు అనువాదం)

యాత్రలు

# దాక్షారామ భీమేశ్వరాలయం

—పాలెపు నరసింహం

తూర్పుగోదావరి జిల్లాలోని రామచంద్రపురానికి నాలుగు మైళ్ళదూరంలోవున్న పుణ్యక్షేత్రం దాక్షారామము. యిది శైవప్రధానమైన దివ్యక్షేత్రం. పంచారామములలో ఒకటి.

'శ్రీశైల దాక్షారామకాళేశ్వర
మధ్యవర్తిత్వే ఆంధ్రదేశస్య
త్రిలింగదేశ యితి ప్రసిద్ధిః' :—అని అహోబిలపండితుడు వివరించినాడు. ఇచట గల ఆలయములోని ప్రధానదైవము భీమేశ్వరదేవర.

స్థలపురాణము:—తారకాసుర సంహారానంతరం, మహేశ్వరుని మెడలోని లింగము అయిదు ఖండములైనదట. ఆ అయిదు ఖండములూ అయిదు చోట్ల ప్రతిష్ఠింపబడినవి. ఆస్థలములే పంచారామములైనవి. ఈ స్థలమహాత్యం స్కాందపురాణంలోవుంది.

ఇదిగాక దక్షుడు యిచట యజ్ఞము చేసెననీ, అందు వలన దాక్షారామమయినదనీ ఒక ఐతిహ్యము. దక్షుని ఆరామము ఈ దాక్షారామము. భీమేశ్వరలింగాన్ని సూర్యభగవానుడు ప్రతిష్ఠ చేసినట్లు చెబుతారు. పంచారామములలో ఒకటైన దాక్షారామము ఒకప్పటి బౌద్ధారామమనీ, బౌద్ధస్తూపంలోని ఆయకస్తంభాన్ని ఈశ్వరలింగంగా ప్రతిష్ఠచేసి, చాళుక్యులు యిచట ఆలయం నిర్మించారని కొందరు చారిత్రక పరిశోధకుల అభిప్రాయం. ఈ నిర్ణయం అంత సముచిత మనిపించదు. యిందుకు తగినఆధారములు కనపడుటలేదు.

చారిత్రాత్మకంగా దాక్షారామమునకు ఎంతో ప్రాధాన్యత వుంది. సుమారు 380 శాసనములు లభించాయి భీమేశ్వరాలయంలో. ఈ ఆలయాన్నికట్టించింది తూర్పు చాళుక్య వంశానికి చెందిన మొదటి చాళుక్య భీముడు సామర్లకోట చాళుక్య భీమవరములోని ఆలయమునందు, దాక్షారామము భీమేశ్వరాలయమునందు దేవాలయ సూక్ష్మ ప్రతిరూపమొకటి కలదు. యిది ఆగమశాస్త్ర సంప్రదాయానుగుణ్యమే. కట్టనీమతమునందలి.—

త్రిభువన నిష్పాదన కౌశలమివ
పృచ్ఛతో విరించస్య
దర్శయితుం నిజశిల్పం వర్ణకమివ
విశ్వకర్మణాం విరచితం—

అన్న శ్లోకములో చెప్పబడిన వర్ణక మనుదానికి యించుమించుసరిపోవుచున్నది. యిది కట్టబోవు దేవాలయమునకు ముందు తయారు చేసివుంచిన నమూనా. ఆంధ్రదేశాన్ని పరిపాలించిన రాజులు ఎందరో భీమేశ్వర దేవరపై తమకుగల అభిమానాన్ని పురస్కరించుకొని, శాశ్వత ధూపదీపనైవేద్యములు జరిపించుటకుగాను విరివిగా దానములు చేసిరి. వెలనాడు ముఖ్యమంత్రి 'కులోత్తుంగ చోడగొంక' కోష్ఠాగారాన్ని నిర్మించి యిచ్చాడు. కొంచీనాయకుడు హోమమండపాన్ని నెలకొల్పినాడు. 1420 క్రీ. శ. లో బెండపూడి అన్నమంత్రి ద్వాదశ స్తంభములతో కూడినమండపాన్ని నిర్మించెను. హైహాయవంశానికి చెందిన భీముడు ఐదు ఖండ్రికల భూమిని దానంచేసెను. ఈ దానములకు సంబంధించిన వివరములు 'దక్షిణ' హిందూ శిలా శాసనములు నాలుగవ సంపుటంలో లభిస్తాయి.



భీమేశ్వరలింగము సమున్నతమైనది. ఆలయంచుట్టూ పద్దెనిమిది అడుగుల ఎత్తుగల ప్రాకారము వున్నది. ప్రాకారానికి నాలుగువైపులా నాలుగు గోపురాలు వున్నవి. యాత్రికులు తూర్పు ద్వారంలోంచి లోపలికి ప్రవేశిస్తారు. ఆలయం రెండతస్తులుగా విభజించబడింది. క్రింది యంతస్థు చీకటికొట్టు. దేవరను అర్చించేది పై యంతస్థుమీదనే.

## క్షేత్ర ప్రాధాన్యత

దాక్షారామము క్రమముగా ప్రజలనోళ్ళలోపడి ద్రాక్షారామమైనది. పూర్వపురోజుల్లో దాక్షారామమును డకరేమి, పెదడాకరేమి అను పేర్లతో వ్యవహరించే వారట. (డాక—ద్రాక్ష; రేమి—తోట).

ప్రతిసంవత్సరం శివరాత్రికి యిక్కడ పెద్దఉత్సవం జరుగుతుంది. ఆ వుత్సవానికి దేశం నలుమూలల నుంచీ యాత్రికులు వస్తారు. ప్రభుత్వపు సహకారంతో దేవస్థానంవారు యాత్రికులకు కావలసిన సదుపాయములు కలిగిస్తున్నారు. దేవాలయ అభివృద్ధికి కృషిచేస్తున్నారు. దేవాలయ అభివృద్ధి కార్యక్రమాన్ని సక్రమంగా జరిపించే బాధ్యతను ప్రభుత్వమే స్వీకరించి, యాత్రికులను ఆకర్షించేటందుకు తగిన ప్రయత్నాలు చేస్తూవుండటం ఆనందించ తగిన విషయం. ×

# పండుగలూ పర్వదినాలూ

## కాళిదాస జయంతి

సంస్కృత సాహిత్య రంగంలో కాళిదాసు పేరు, ఆంగ్ల సాహిత్యంలో షేక్స్పియర్‌వలె దేదీప్యమానంగా ప్రకాశిస్తుంది. ఆయన పుట్టుపూర్వోత్తరాలను గురించిగాని, జీవిత కాలాన్ని గురించిగాని, వ్యక్తిగత జీవితాన్ని గురించి గాని యిదమిద్ధమని తేల్చలేకున్నారు. కాని, కార్తీకశుద్ధ ఏకాదశిని (ఈ సంవత్సరం అందుకు సరియైన తేది నవంబరు ఒకటి) కాళిదాస జయంతి దినంగా భావించి ఉత్సవాలు జరుగుతున్నాయి. కాళిదాసు జీవిత కాలాన్ని గురించి పండితులు క్రీస్తుపూర్వం 1వ శతాబ్దం మొదలు కొని క్రీస్తుశకం 1వ శతాబ్దం వరకు, వివిధ రకాలుగా పేర్కొంటున్నారు. ఆయన ఉజ్జయినికి చెందినవాడనీ, విక్రమాదిత్యుని ఆస్థానాన్ని అలంకరించినవాడనీ చెప్తారు.

కాళిదాసు రచించిన మూడు నాటకాలు, నాలుగు కావ్యాలు నేడు మనకున్నవి. అభిజ్ఞాన శాకుంతలం, విక్రమోర్వశీయం, మాళవికాగ్నిమిత్రం- అనేవి నాటకాలు. రఘువంశం, కుమార సంభవం, మేఘదూత, ఋతుసంహారం అనేవి కావ్యాలు.

కాళిదాసు దివ్యహస్తాల్లో సంస్కృత కవితావధూటి నూత్నాలంకారాన్ని, ప్రత్యేక ప్రతిభను, నాణ్యతను సంతరింపజేసుకున్నది. క్లిష్టపదాడంబరతకు, వ్యర్థపదజాల ప్రయోగానికి ఆయన కవిత్వంలో తావులేదు. స్పష్టత, సంక్షిప్తతా లక్షణాలుగా కలిగిన సహజసంపన్నమైన ఆయన శైలిద్రాక్షాపాకం. ఒడుదుడుకులులేకుండా ప్రవహించే ఆయన భాషా స్రవంతి, ఉపమలకు (వీటిలో ఆయనది అందెవేసిన చేయి) సంప్రదాయ సిద్ధమైన సామెతలకు కాణాచి. ప్రకృతి కవిగా, మానవ ప్రకృతి నెరిగిన తాత్వికునిగా ఔత్కృష్ట్యాన్నీ, సౌందర్యాన్నీ విడమరచి చిత్రించడంలో కాళిదాసు భావనాశక్తి అమోఘమైనది.

సాహిత్యశిల్ప పరిపూర్ణతను ప్రతిఫలింప జేసేదే నాటక రచన అని అంటారు. కాళిదాసు 'శాకుంతలం నాటకం' భారతీయ నాటక రచనలలో వెలుగులు విరజిమ్మే మణి పూస వంటిది. ప్రపంచ కవిశేఖరులలో ఒకడైన ప్రముఖ జర్మన్ కవివరేణ్యుడు 'గోథే' శకుంతల నాటకానికి ముగ్ధుడై తన ఆనందాతిరేకాన్ని కట్టలు తెంచుకొని ప్రవహించే కవితావాహిని రూపంలో యిలా వర్ణించారు :

"శకుంతలా ! నిన్నెలా వర్ణించేది ?-
పరవళ్ళు త్రొక్కే యవ్వన వికాస మందునా-!
చరమస్థాయి నందుకొన్న పరువపు ఫలసిద్ధి యందునా !
ఆత్మకు పరిపుష్టి చేకూర్చి, ఆనందాతిరేకాన్నీ, దివ్యానుభూతినీ ప్రసాదించే సర్వశక్తి స్వరూప మందునా ?
దివినీ, భువినీ ఏకీకరించిన దివ్య నామ మందునా !

వీటన్నిటినీ ఏకరూపంలో, ఏకకాలంలో సాక్షాత్కరింపజేయగల శకుంతల నామంతోనే నిన్ను వ్యవహరిస్తాను."

## కార్తీక పౌర్ణిమ

సంవత్సరం పొడుగునావచ్చే పున్నమలలో కార్తీకపౌర్ణిమ అతి పవిత్రమైనది. సంవత్సరంలోకల్లా మిక్కిలి ప్రకాశమానమైనది ఆనాటి రాత్రి. మనోజ్ఞమైన వెన్నెల రాత్రులకు శరత్కాలాన్ని పేర్కొంటాము. కార్తీక పౌర్ణమి చంద్రుని షోడశకళలను ప్రతిఫలింపజేసి సర్వశోభాయమానంగా ప్రకాశింపజేస్తుంది. కార్తీక పౌర్ణమినాడు గంగానదీ తీరంలో పెద్ద పెద్ద మేళాలు జరుగుతాయి యమునా తటిపై శ్రీకృష్ణ దైవాన్ని ఆరాధిస్తారు పురత్రయాన్ని, త్రిపురా సురులను శివుడు నాశనం చేసిన దినం కావడంతో ఈ కార్తీక పున్నమి రోజున త్రిపుర పున్నమి అనే పేరుమీద కూడా ఉత్సవాలు జరుపుకుంటారు.

## గురునానక్ జయంతి

శిక్కుమత స్థాపకుడు గురునానక్‌దేవ్ జయంత్యుత్సవం కార్తీక పున్నమి రోజుననే జరుగుతుంది. చిన్ననాటి నుండి ఆయన ఆధ్యాత్మిక చింతనపట్ల ఆసక్తిని ప్రదర్శించేవారు. తోటి మిత్రులు ఆటపాటలలో కాలం గడిపే సమయంలో ఆయన దీర్ఘ ఆలోచనలో మునిగిపొయ్యేవారు. ఐదేళ్ళ ప్రాయంలోనే గురునానక్‌దేవ్, వేద శాస్త్రాల్ని గురించి చర్చించేవారు. ఉపనయన మహోత్సవ సమయం ఆసన్నమైనప్పుడు పురోహితుడు నానక్‌కు యజ్ఞోపవీతాన్ని ప్రసాదించ బోయాడు. అందుకాకుర్రవాడు తన తిరస్కృతిని తెలిపాడు. ఇటువంటి ఆచార వ్యవహారాలకు నానక్ వ్యతిరేకి.

పౌరోహిత్యపు ఆధిపత్యంపట్ల, మతం పేరిటసాగే హింసాకాండపట్ల ఆయన తిరుగుబాటు గావించారు. హిందూ మతం కావచ్చు, లేదా మహమ్మదీయమతం కావచ్చు. వాటి మత సాంప్రదాయాలను నానక్ నిరసించారు. సృష్టికర్త ఒక్కరేఅన్నది ఆయన భావన. సర్వశక్తి సంపన్నుడైనవాడూ, ప్రేమామృతాని

వర్షించేవాడూ ఆయన ఒక్కడే. నిరాడంబరతతో, నిజాయితీ తత్వముతో, నిష్కల్మష హృదయంతో వినమ్రులమై మనం ఆయన పజ్జచేరాలి. భక్తి ప్రేమలతో ఆయన పవిత్ర నామాన్ని జపించాలి -అని నానక్ ప్రవచించేవారు. దేవుని సందేశామృతం వెదజల్లుకుంటూ నాలుగుసార్లు ఆయన దీర్ఘ పర్యటనలు జరిపారు. మక్కాలో ఆయన పర్యటించేటప్పుడు ఆయన 'కబా' మసీదువైపు నడిచి వెళ్ళారు. ఆయన చర్యలకు మౌలానాలు, ఖాజీలు కోపోద్దీపితులైనారు అప్పుడు ఆయన 'సోదరులారా 'అల్లా' లేని చోటుకు దయచేసి నాకు దారిచూపించండి' అని సమాధాన మిచ్చారు. నానక్ ఏవైపు తిరిగితే కబా మసీదు కూడా అదే దిక్కు తిరిగేది. దేవుడు సర్వాంతర్యామి అనే విషయాన్ని విశదీకరించడమే ఈ ఉదాహరణ ఉద్దేశ్యమై వుంటుంది.

గురునానక్ భౌతికకాయానికి అంత్యక్రియలు జరిపే విషయంలో హిందువులూ, మహమ్మదీయులు పోటీలు పడ్డారు. ఆయన గౌరవార్థం, స్మృత్యర్థం శిక్కులు దేవాలయాన్ని నిర్మిస్తే, రావీనదీ తీరాన ముస్లింలు మసీదును నిర్మించారు.

## స్కంద (సుబ్రహ్మణ్య) షష్ఠి

సుబ్రహ్మణ్యస్వామి తారకాసురుని సంహరించిన పవిత్రదినంగా 'మార్గశిర శుక్ల షష్ఠి'ని పరిగణిస్తారు. దీనినే స్కంద షష్ఠి అని అంటాము. దక్షిణాదిన కందన్, మురుగన్, వేలన్ అనేవి శ్రీ సుబ్రహ్మణ్యస్వామికి నామాంతరాలు.

స్కందుడు యుద్ధదేవత. దేవతల సైన్యాధ్యక్షుడుగా ఈ దేవతలను 'సేనాపతి' అని పిలుస్తారు. పరవాని అనబడే నెమలి వాహనారూఢుడై ఈ సేనాపతి ఒక చేతిలో దండం మరొక చేత బాణం ధరించి వున్నట్లు వర్ణించబడి వున్నది. పురాణాలలో బృహత్పురాణమైన స్కంద పురాణం పేరిట, స్కందుడనే నామధేయంతో సుబ్రహ్మణ్యస్వామిని వ్యవహరిస్తారు.

-కమలా త్రివేణి

## షబ్-ఇ-బరాత్

'షబ్' 'బరాత్' అనేవి పర్షియన్ పదాలు. వీటినుండి వచ్చినవే 'షబ్-ఇ-బరాత్' అనే మాట. 'షబ్' అంటే రాత్రి అనీ, 'బరాత్' అంటే 'చెక్కు' లేక నిలువధనాన్ని తీసుకొనేందుకు ఉపయోగించే పత్రమనీ అంటారు. శాస్త్ర రీత్యా చెప్పినపుడు 'బరాత్' అంటే మానవులకు దేవుడు కేటాయించే భృతి భాగం. షబ్-ఇ-బరాత్ అనేది ఆ దివ్య భాగాన్ని ప్రసాదించే అపూర్వ రాత్రి. ముస్లిం కాలెండర్‌నుబట్టి ఈ రాత్రి ఎనిమిదవ నెలలో పదిహేనవ దినానికి ముందురాత్రి అవుతుంది. ఇదేరోజున దైవం స్వర్గం నుండి దేవతల ద్వారా భూలోకంలో తన సృష్టిలోని ప్రాణులకు సంవత్సరానికి సరిపడే జీవన భృతిని అందజేస్తాడని ప్రతీతి. ఈనాడే, వచ్చే సంవత్సరంలో మానవులు నిర్వహించే చర్యలను దేవుడు వ్రాసివుంచుతాడని చెప్పబడుతుంది. షబ్-ఇ-బరాత్ కాలంలోనే తన దివ్య సింహాసనం నుండి, కురాన్ పవిత్ర గ్రంథాన్ని భూలోకానికి పంపవలసిందిగా దైవం ఆజ్ఞాపించినట్లు ఒక నమ్మకం. అయితే కురాన్ ప్రపంచంలో వెల్లడి కాబడింది రంజాన్ మాసంలోనే దివి నుండి భువికి కురాన్ అవతరించిన శుభ సమయం కావడంతో షబ్-ఇ-బరాత్ కూడా పవిత్రమైనదిగా భావించబడుతూంది.

ఆనాటి రాత్రి ఉపవాసాలూ, జాగరణలు విధిగా జరుగుతాయి. ప్రార్థనాపూరిత ప్రణామాలు నూరుకుపైగా చేయవలసి వుంటుంది. హిందువుల దీపావళి పండుగ వలెనే షబ్-ఇ-బరాత్ పర్వదినం కూడా బాణసంచాలతోనూ, దీపాలంకరణలతోనూ దేదీప్యమానంగా విలసిల్లుతుంది. సనాతన ఇస్లాంమత సంప్రదాయాన్ననుసరించి ఆనాటి రాత్రి వేడుకలు, సరదాలు నిషిద్ధం. స్వర్గస్థులైన బంధువర్గానికీ, మిత్రబృందానికీ మోక్షాన్ని ప్రసాదించమని దైవాన్ని అందరూ ప్రార్థించవలసిన పుణ్యతరుణం. పశ్చాత్తాప హృదయంతో పాపపరిహారార్థం ప్రతి ఒక్కరూ పరమేశ్వరుని ప్రార్థించ వలసిన పరమ పవిత్ర సమయం.

-దౌలత్ బేగం

◆◆◆◆◆◆◆◆

ఈ సంచికలోని వివిధ శీర్షికలను గురించి, ఇందలి రచనలను గురించి మీ అభిప్రాయాలు తెలుపండి. మీ సూచనలకు, సలహాలకు, విమర్శలకు స్వాగతం.

# అజాద్ హింద్ ప్రభుత్వ రజతోత్సవాలు

వి. యల్. సుందరరావు

దేశం వెలుపల నుండి భారతీయ దేశభక్తులూ, నాయకులూ సాగించిన స్వాతంత్ర్యోద్యమ చరిత్ర—ఒక విధంగా చూస్తే—పరిధిలోనూ, ప్రమాణంలోనూ, పరిమాణంలోనూ, ప్రభావంలోనూ భారత జాతీయ కాంగ్రెస్ అధ్వర్యంలో నడిచిన స్వాతంత్ర్యోద్యమ చరిత్రకు ఏ మాత్రం తీసిపోదు. దేశ స్వాతంత్ర్యం సిద్ధింపజేసే పోరాటం తుది ఘట్టాలో దేశంలోపల నుండి మహాత్మాగాంధీజీ, దేశం వెలుపల నుండి సుభాష్‌చంద్రబోస్‌లే ఈ ఉద్యమాలకు సారథ్యం వహించి వాటిని విజయవంతంగా నడిపించిన మహానాయకులు.

మొదటి ప్రపంచ యుద్ధం జరిగే సమయంలో బ్రిటన్‌నూ, దాని మిత్రదేశాలనూ ఎదిరించి జర్మనీ పోరాటం సాగిస్తున్న తరుణంలో, భారత దేశం నుంచి బ్రిటిష్‌వారిని వైదొలగించేందుకు కైసర్‌తోనూ, అతని మిత్రులతోనూ చేతులు కలిపి పనిచేసేందుకు కృషి జరిగింది చిన్న ఎత్తులో ఆయుధాలు దిగుమతి కూడా జరిగింది. భారతీయ విప్లవకారులకూ, బ్రిటిష్ సైనికులకూ బెంగాలు తీరంలో ముఖాముఖి భీషణ పోరాటాలు జరిగాయి.

విముక్తి సేనలను తయారు చేసుకొని, యుద్ధ పరిణామాన్ని అవకాశంగా తీసుకొని బ్రిటిష్ పాలకులపై పోరాటం సాగిస్తే నేతప్ప దేశానికి దాస్యవిముక్తి లభించదని నేతాజీ మొదటి నుంచీ భావిస్తూవచ్చారు ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో అదనుకు తగినట్లు వ్యవహరించి బ్రిటిష్ సేనలను ముప్పతిప్పలు పెట్టి, వాటి ఆక్రమణ నుండి మాతృదేశానికి విముక్తి లభింపచేయాలని తన దృఢ సంకల్పాన్ని విజయవంతంగా నెరవేర్చుకున్నారు నేతాజీ.

రెండవ ప్రపంచయుద్ధం సంభవించేందుకు చాలా పూర్వమే నేతాజీ తన అంతర్జాతీయ విధానాన్ని రూపొందించుకొన్నారు. 1939లో యుద్ధం ప్రారంభమైన వెంటనే తన విధానాన్ని బహిరంగంగా దేశంలో ప్రకటించారు. బ్రిటన్ యుద్ధంలో ప్రవేశించిన మరుక్షణం నుండి ఒక్కుమ్మడిగా పౌర సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించి, తాను సూచించిన కార్యాచరణ పద్ధతిని అవలంబించ వలసిందిగా గాంధీగారితోనూ, జాతీయ కాంగ్రెస్ నాయకులతోనూ నేతాజీ వాదించారు. కాని యిందుకు ఆయన వారిని ఒప్పించలేకపోయారు ఇక వెంటనే తన సొంత యేర్పాట్లు గావించుకొని, ఉద్యమ నిర్వహణకు 1940 జనవరిలో సరిహద్దులు దాటి భారతదేశాన్ని వదిలి వెళ్ళారు.

జర్మనీ చేరుకొని భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనా దీక్ష విషయంలో ప్రచారం ప్రారంభించారు. భారతదేశ పరిస్థితిని గూర్చి బ్రిటిష్‌వారు చేసిన దుష్ప్రచారానికి తగు విధంగా సమాధానాలు చెప్పి దాన్ని ఖండించారు. బ్రిటిష్‌వారిని ఎదుర్కొనేందుకు దూరప్రాచ్య దేశాలలో అప్పటికే ఉద్యమాలు, సన్నాహాలు బయలుదేరాయి. సరియైన సమయంలోనే తూర్పుదేశనాయకులూ, స్వేచ్ఛకు పాటుపడే భారతీయ సంఘమూ, నేతాజీని అక్కడికి విచ్చేసి నాయకత్వం వహించ వలసిందిగా ఆహ్వానించారు. 1943లో ఈ ప్రయాణానికి ఆయన సన్నద్ధం అయినారు. జర్మనీ నుండి సింగపూరుకు మందు పాతరలు పెట్టిన సముద్ర జలాల గుండా జలాంతర్గామిలో బయలుదేరి దాదాపు 3 మాసాల కాలం ప్రమాదకరమైన ప్రయాణంచేసి, జూలై 2వ తేదీన సింగపూర్ చేరుకున్నారు. టోక్యోకు వెళ్ళి జనరల్ టోజో, ఇతర జపాన్ ప్రముఖ నాయకులను కలుసుకుని స్వతంత్రంగా, స్వయంగా వారితో ఒప్పందాలు కుదుర్చుకొని సర్వసన్నాహాలూ చేసుకున్నారు.

1943 అక్టోబరు 21— చరిత్రాత్మకమైన దినం. ఆనాడే తాత్కాలిక అజాద్‌హింద్ ప్రభుత్వం స్థాపించబడింది. ప్రభుత్వాధినేతగా, అజాద్‌హింద్ ఫౌజ్ సర్వసేనానిగా సుభాష్‌చంద్రబోస్ పదవీ స్వీకారం చేశారు. అక్టోబరు 23న అంతర్జాతీయ సర్వసంప్రదాయానుగుణంగా బ్రిటన్‌పైన, దాని మిత్రదేశాలపైన అజాద్‌హింద్ ప్రభుత్వం యుద్ధం ప్రకటించింది. నేతాజీ సింగపూర్ వచ్చి ఈ ప్రకటన చేసిన తరుణంలో రెండు లక్షలకుపైగా భారతీయ సైనికులు సమీకరించబడి వారికి తగిన శిక్షణ యివ్వబడింది. దూరప్రాచ్యంలో ముఖ్యంగా ఇండోనీషియా, మలయా, థాయ్‌లెండ్, కంబోడియా తదితర దేశాలలో అజాద్‌హింద్ ప్రభుత్వానికి మద్దతుయిచ్చే భారతీయుల సంఖ్య దాదాపు 30 లక్షలు. వీరు 170 లక్షల రూపాయలు అజాద్‌హింద్ బ్యాంకుకు విరాళంగా యిచ్చారు. ప్రతి ఒకరూ నేరుగానో, యితర విధంగానో అజాద్ హింద్ ఉద్యమానికు, తత్సంబంధమైన సన్నాహాలకు సహాయ సహకారాలందించారు. దూరప్రాచ్య దేశాలలో ప్రతి భారతీయుని—సైనికుని మొదలు సంస్థానాధీశుని వరకు—నేతాజీ అపూర్వ వ్యక్తిత్వం, వక్తృత్వం, క్రియాచరణైక ధీశక్తి ఆవేశపూరితుణ్ణి చేశాయి. భారత దాస్యవిముక్తికై సర్వస్వం త్యాగం చేయగల అపూర్వ శక్తిసంపత్తులను వారిలో కలిగించాయి. ఈ సందర్భంలో మహిళాలోకం ప్రదర్శించిన త్యాగనిరతి, దేశభక్తి ప్రత్యేకంగా పేర్కొనదగినవి. ఉత్సాహపూరితంగా వారు ఉద్యమాల్లో పాల్గొనడమే కాకుండా, ఝాన్సీ సైనిక పటాల శ్రేణులలో చేరి ధైర్యసాహసాలను ప్రకటించారు. పురుషులతోపాటు యుద్ధరంగంలో ప్రవేశించారు. పర్వతప్రాంతాలు, అగాధమైనలోయలు, దట్టమైన అడవులగుండా నడిచారు. తుపాకులు ధరించి, బ్రిటిష్ సైన్యంతో ముఖాముఖిగా పోరాడారు. విదేశీయులూహించుకొన్నట్లు అలంకరించబడిన ఆటబొమ్మలుగా కాక—భారత నారీమణులు 1857 నాటి సంఘటనను తిరిగి గుర్తుకుతెచ్చే వీరనారి ఝాన్సీరాణి స్వభావ సంప్రదాయాలను పుణికి పుచ్చుకొన్న వారసురాండ్రుగా నిరూపించుకున్నారు.

సైన్యం మొత్తం నాలుగు భాగాలుగా ఏర్పడింది. సుభాష్ పటాలం, గాంధీపటాలం, అజాద్ పటాలం, నెహ్రూ పటాలం. సైనికులకు స్వచ్ఛమైన భారతీయ సైనికాధికారులచే హిందూస్థా

నీలో సమగ్రమైన శిక్షణ తరగతులు నిర్వహించబడ్డాయి. శిక్షణ కాలంలో ఉపన్యాసాలకు, విద్యగరపేందుకు రెండు గంటలపాటు కాలం కేటాయించారు. సైనికులందరూ హిందూస్తానీ నేర్చుకొనే టట్లు చేశారు. భారత స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి బ్రిటీషు వారు వ్యాపింపజేసిన దుష్ప్రచారాన్నీ, కల్లబొల్లి రూపకల్పనలనూ, అనుమానాలనూ ఉపన్యాసాల ద్వారా తొలగింపజేశారు. 1857నుండి నాటి వరకూ భారత వీరశిఖామణుల మహత్తర త్యాగ ప్రదర్శనా ఘట్టాలను ఉడుకు నెత్తురు శరీరంలో ప్రవహింపజేసే వివిధ వివరిస్తూ నేతాజీ ఉపన్యాసాలిచ్చారు. భారత జాతీయ కాంగ్రెస్ నిష్కళంక చరిత్రనూ, మహాత్మాగాంధీ వహించిన ప్రభావపూరిత మైన జాతి నాయకత్వాన్ని గురించీ ప్రబోధించారు. తన సైనిక శ్రేణులలో సమైక్యతా భావాన్ని వర్ధిల్లజేయుటకు నేతాజీ శాయ శక్తులా కృషి చేశారు. ఆదిలోనూ-తుదిలోనూ భారతీయులమనే నిజమైన జాతీయతా భావాన్ని నేతాజీ వారిలో కలిగించారు ఆయన ఆజ్ఞానుసారం సైనికులు యుద్ధరంగంలో ముందుకునడిచి అనేక చోట్ల శత్రుకూటాలను మట్టుబెట్టారు ఇంఫాల్, మణిపూర్, ధిమాపూర్, సిక్కింలలో ప్రధానమైన స్వాతంత్ర్యోద్యమ సమరాలు నడిపించబడ్డాయి. ప్రతి భారతీయ సైనికుని చేతిలోనూ పదిమంది చొప్పున బ్రిటిష్ సైనికులు నేలకొరిగారు.

ప్రపంచంలో అతి దట్టమైన అడవులవెంట, ప్రతిధ్వనించే పర్వత ప్రాంతాలవెంట, బ్రహ్మాండమైన లోయలవెంట వందల కొలది మైళ్లు నడచి సైన్యం ముందుకు సాగింది. భారత భూభాగంలో కొంత ప్రాంతానికి విముక్తి లభింపజేసింది. రెండు శతాబ్దాలపాటు సాగిన దాస్యాంధకారం తరువాత తిరిగి నేతాజీ నాయ కత్వం క్రింద, అజాద్‌హింద్ ప్రభుత్వ రక్షణక్రింద, భారతావని విముక్తి వెలుగును చూడగలిగింది. దాస్యవిముక్తి లభించిన మాతృదేశ భూభాగంపై 1944 ఏప్రిల్ 1న త్రివర్ణ పతాకం స్వేచ్ఛగా ఎగురసాగింది.

ఉధృతంగా సాగిన ఈ పోరాటాల్లో దాదాపు 16 వేల మంది అజాద్‌హింద్ సైనికులు మరణించినట్లు అంచనా. సైనికులకు వీర మరణాన్ని ప్రసాదించిన ఆ కొండ లోయలలో యిప్పటికీ మృత వీరుల మాంసఖండాలు, అస్తిపంజరాలూ 'స్వేచ్ఛా భారతి' నినాదాలను ప్రతిధ్వనింపజేస్తూనే వున్నాయి.

జపాన్‌వారి విమాన దళానికి చెందిన బాంబరు సమయానికి రక్షణ కల్పించలేక పోవడంతో అజాద్‌హింద్ ఫౌజ్ నిస్సహాయ స్థితిలో పడిపోయింది. మరీ ముందుగాపడిన అకాల వర్షాలు రవాణా రాకపోకలకూ, సైన్యసమీకరణకూ తీరని అంతరాయం కలిగించినవి. హిరోషిమా, నాగసాకిలపై అణుబాంబులు పడటంతో జపాన్ పట్టు సడలిపోతూనే యుద్ధం సాగించి చివరకు లొంగి పోయింది.

దీనితో అజాద్‌హింద్ ఫౌజ్ పోరాటం కూడా ఉపసంహ రించబడింది. యుద్ధం విరమించ వలసిందిగా నేతాజీ ఉత్తరువు చేశారు. అతి కష్టంమీద సేనలను ఆయన ప్రధాన స్థావరానికి చేర్చవలసి వచ్చింది. నేతాజీ సాగించిన ఉద్యమం బ్రిటిష్ యిండియా సైన్యాలలో హృదయ పరివర్తన కలిగించి, వారిని నిజమైన భారత దేశభక్తులుగా మార్చింది. 1946 ఫిబ్రవరిలో బొంబాయి, కరాచీలలో భారతీయ నౌకాదళం సాగించిన తిరుగు బాటు తక్కిన సైనికులకు మార్గదర్శకమైంది. నేతాజీ సుభాష్ చంద్రబోస్, అజాద్‌హింద్ ప్రభుత్వాల అపూర్వ సేవా ఫలితంగా భారత స్వాతంత్ర్య ప్రాంగణంలో మనం అడుగు పెట్టాం.

అజాద్‌హింద్ ప్రభుత్వ రజతోత్సవం జరుపుకుంటున్న ఈ సందర్భంలో, నాటి వీర సైనికుల ధైర్యసాహసాలు, త్యాగ నిరతి, ప్రతిభా సంపన్నమైన నేతాజీ నాయకత్వ ప్రాభవం స్మృతికి తెచ్చుకోవడం ప్రతి భారతీయ పౌరుని కర్తవ్యం.

అజాద్‌హింద్ తాత్కాలిక ప్రభుత్వ సంస్థాపక రజతోత్సవాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రజలు అమితో త్సాహంతో అక్టోబరు 21 న జరుపుకున్నారు. ఉదయం ప్రభాతభేరీలు, ప్రార్థనలు జరిగాయి. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో జాతీయ పతాకాలు ఆవిష్కరింపబడినాయి. నేతాజీ చిత్రపటాలకు, విగ్రహాలకు పూలమాలలు వేశారు. పలుప్రాంతాలలో జరిగిన సమావేశాలలో స్థానిక నాయకులు స్వాతంత్ర్య సంగ్రామంలో భారత జాతీయ సైనికదళం వహించినపాత్ర, చేసిన త్యాగాలను గూర్చి ప్రసంగించారు. నేతాజీ, అజాద్ హింద్‌ఫౌజ్‌కు సంబంధించిన ఛాయాచిత్రాలు, సారస్వత ప్రదర్శన హైదరాబాదులో జరిగింది. నేతాజీపై ఫిలింప్రదర్శనలు కూడా జరిగాయి.

జనసంబంధ శాఖ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్‌బాపూజీ అధ్యక్షతనగల ఉత్సవ సంఘం ఆటలు, వ్యాసరచన, వక్తృత్వం, సంగీతం, నృత్యాలలో పోటీలు నిర్వహించింది.

ఊరేగింపులలో ఎన్. సి. సి., హోంగార్డులు, స్కౌట్ దళాలు పాల్గొన్నవి.

హైదరాబాద్‌లో జరిగిన ఉత్సవంలో ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి మాట్లాడుతూ గాంధీజీ, నేతాజీవంటి మహాపురుషుల అడుగుజాడలను అనుసరించవలసినదిగా ప్రజలను కోరారు. నేతాజీ చేసినత్యాగాలు, ఆయన దేశభక్తి సాటిలేనివని ముఖ్యమంత్రి అన్నారు.

తొలుత ఐ. ఎన్. ఏ. కు చెందిన 12 మంది సభ్యులకు ఆయన ప్రశంసాచిహ్నాలను బహూకరించారు. వారిలో మాజీ కేంద్రమంత్రి డి. ఎస్. రాజు కూడా ఉన్నారు. కవాతు ప్రదర్శనలో ముఖ్యమంత్రి గౌరవవందనం స్వీకరించి నేతాజీ చిత్రపటానికి పూలమాల వేశారు. సాయంత్రం సాంస్కృతిక కార్యక్రమం జరిగింది. రవీంద్రభారతిలో బహుభాషా కవి సమ్మేళనం నిర్వహించబడింది.

# ఉస్మానియా విశ్వవిద్యాలయం

-టి. వి. ఆర్.



భారత రాష్ట్రపతి డా. జాకీర్ హుస్సేన్ ఉస్మానియా విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవాలను ప్రారంభించడానికై అక్టోబరు 4న నగరానికి వచ్చినప్పుడు బేగంపేట విమానాశ్రయంలో రాష్ట్ర గవర్నరు, ముఖ్యమంత్రి తదితరులు స్వాగతం చెప్పినప్పటి చిత్రం

రాష్ట్రపతి డా. జాకీర్‌హుస్సేన్ ప్రారంభోత్సవం జరిపిన ఉస్మానియా విశ్వవిద్యాలయం స్వర్ణోత్సవాలు 5 రోజులపాటు ఎంతోఘనంగా, వైభవంగా నిర్వహించబడినాయి. ఈ విశ్వ విద్యాలయంతో సన్నిహిత సంబంధం గలవారు మాత్రమేగాక ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రజలందరు ఎంతో సంతోషించాల్సిన సమయం. గత అర్ధ శతాబ్దిగా ఉస్మానియా విశ్వవిద్యాలయం చారిత్రక మార్పులకు అనుగుణంగా, పెరుగుతున్న ఉన్నత విద్య సాంఘిక అవసరాలను తీరుస్తూ ఉన్నది. దూర దృష్టి కలిగిన, పరిపాలనాదక్షుడు సర్ అక్బర్ హైదరీ ప్రేరణతో 7 వ నిజాం కీ. శే. నవాబు మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ నెలకొల్పిన యీ విద్యాపీఠం. సంస్థానాధీశులు నెలకొల్పిన వాటిలో అతి పురాతనమైనది. భారతదేశంలో ఉన్నత విద్యాబోధనకు గల సంప్రదాయాన్ని విసర్జించి యీ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు మారుగా ఉర్దూను బోధనా భాషగా ప్రవేశపెట్టారు. స్వతంత్ర భారతదేశంలో హైదరాబాదు రాష్ట్రం విలీనం కావడంతో ఉస్మానియా విశ్వవిద్యాలయం " ఒక సారి గతాన్ని స్మరించుకుని తమ ఉత్తమ సంప్రదాయనికి గర్వపడుతూనే భవిష్యత్తులో ఆత్మవిశ్వాసంతో" అడుగుపెట్టింది. బోధనా భాషగా ఉర్దూకు బదులు ఇంగ్లీషును ప్రవేశపెట్టారు. నేడు దానికి అనుబంధంగా ఉన్న అనేక కళాశాలల్లో ఇంగ్లీషు బోధనా భాషగా కొనసాగుతున్నప్పటికీ దాని అనుబంధంగా ఉన్న ఒక ఆర్ట్సుకళాశాలలో హిందీ, మరో దానిలో ఉర్దూ బోధనాభాషలు ఉన్నాయి. తెలుగు బోధనా భాషగాగల ఒక కళాశాల గత సంవత్సరం నెలకొల్పబడింది.

ఉస్మానియా విశ్వవిద్యాలయం, విద్యారంగంలో అనేక విషయాలలో పురోభివృద్ధి సాధిస్తున్నది.

ఇప్పుడు యీ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా 74 కళాశాలలు ఉన్నాయి, 1968 లో 43,245 మంది విద్యార్థులు ఉన్నారు. అందులో 7,476 మంది మహిళలు ఉన్నారు. ఈనాడు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 49 విషయాలలో బ్యాచులర్స్ పట్టాలను, 46 విషయాలలో మాస్టర్స్ డిగ్రీలను, 30 విషయాలలో పి. హెచ్. డి డిగ్రీలను పది విషయాలలో డిప్లొమాలను, 11 విషయాలలో పోస్టు గ్రాడ్యుయేటు డిప్లొమాలను, వైద్య డిగ్రీలను యిస్తున్నారు. ఫ్రెంచ్, జర్మన్, రష్యన్ భాషలలో జూనియర్, సీనియర్ డిప్లొమాలను కూడ యిస్తున్నారు. అన్ని సబ్జెక్టులలో పరిశోధనా విభాగాలను కూడ ఏర్పాటు చేశారు. అణుశక్తి కమీషన్ఆధ్వర్యంలో రేడియేషన్ జనెటిక్స్ విభాగం కూడ యీ విశ్వవిద్యాలయంలో ప్రారంభించారు. ఖగోళశాస్త్రంలో ఉన్నత పరిశోధనకు కేంద్రంగా విశ్వవిద్యాలయం గ్రాంట్స్ కమీషన్ యీ విశ్వవిద్యాలయాన్ని సెలక్టు చేసింది. ఈ విశ్వవిద్యాలయం నిర్వహణలో ఉన్న నిజామియా అబ్జర్వేటరీ నిమిత్తం రంగాపురంలో బృహత్తరమైన 48 అంగుళాల దూరదర్శిని యంత్రాన్ని నెలకొల్పుతున్నారు. ఇది ప్రాంతీయ విశ్వవిద్యాలయమే అయినా యిటీవలి కాలంలో విదేశీ విశ్వవిద్యాలయాలతో సన్నిహిత సంబంధాలను నెలకొల్పుకుంటున్నది. ఉస్మానియాలో ఆయా దేశాల భాషలను బోధించడానికి ఫ్రాన్సు, జర్మనీ, రష్యా ప్రభుత్వాలు అధ్యాపకులను పంపాయి. అమెరికాలోని మినెసోటా విశ్వవిద్యాలయంతో అధ్యాపకుల పరస్పర మార్పిడికి సంబంధించి ఒప్పందం కూడా కుదుర్చుకున్నది.

భారత_రష్యాల మధ్య జరిగిన ఒప్పందం ప్రకారం భూగర్భ శాస్త్రం ఆచార్యుడు యిక్కడి ఇంజనీరింగ్ కళాశాలలో చేరారు. ఇటీవల కొంత కాలంగా ఉస్మానియావిశ్వవిద్యాలయం విదేశ విద్యార్థులను ఎంతగానో ఆకర్షిస్తున్నది.

ఈ స్వర్ణోత్సవం సంవత్సరంలో యిది భవిష్యత్తులోకి అడుగిడి సమాజ అవసరాలను తీర్చడానికి మరింతగా ఆయత్తమవుతున్నది. ఈ విషయాలను గుర్తించి, ఆంధ్రమహాభారత



ఉద్గ్రంథాల అధ్యయనంవంటి అనేక నూతనపథకాలను అమలుజర పాలని ఉద్దేశించారు. తెలుగు మహాభారత ప్రథమ సంపుటాన్ని ఆవిష్కరిస్తూ డా॥ సునీతికుమార్ చటర్జి, తెలుగు పండితులు తెలుగు కావ్యాలను యింగ్లీషులోకీ యితర భారతీయ భాషలలోకీ అనువదించడానికి ముందుకు రావాలని అన్నారు. మహాభారతం సంస్కృత భాషలో ఉన్నా మరే యితర భాషలో ఉన్నా ప్రపంచంలో అది శ్రేష్ఠమైన ఉద్గ్రంథమని ఆయన ప్రస్తుతించారు. ఈ పథకానికి కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు అవసరమైన సహాయాన్ని అందజేశాయి. పబ్లి పరిశ్రమల రంగంలో పరిశోధన, హైదరాబాదు, మెట్రోపాలిటన్ పరిశోధన, అరబ్ భాషలోని అపూర్వమైన గ్రంథాల ప్రచురణ వంటి యితర పథకాలను కూడ యీ విశ్వవిద్యాలయంలో చేపట్టుతున్నారు. విశ్వవిద్యాలయ ఆవరణలో విద్యార్థుల అధ్యయన కేంద్రం అదనంగా మహిళలహాస్టల్ నిర్మాణ పనులను స్వర్ణోత్సవ పథకంలో చేర్చారు. అంతేగాక సాంస్కృతికమ్యూజియం, ఐడియాలజీ, ఇస్లామిక్ అధ్యయనం, ఆధునిక భారతీయ భాషల పీఠాలను నెలకొల్పడం వంటి కార్యక్రమాలను కూడ అమలు జరుపుతారు.

ఈ విశ్వవిద్యాలయంలో విద్యా స్థాయి ఉన్నత స్థాయిలో ఉన్నదని డా॥ జాకిర్‌హుస్సేన్ అంతటి వ్యక్తి ప్రస్తుతించారు. రాష్ట్రపతి యిక్కడి విద్యాస్థాయిని విశ్వవిద్యాలయం ఆవరణ పేరుతో పోల్చారు. ఇది "అధిక్‌మెట్టు" లోఉన్నది. అంటే విద్యాస్థాయి కూడ ఉన్నత స్థాయిలో అధిక వర్ణించారు. "గత చరిత్ర గమనార్హమైనదైనప్పటికీ, భవిష్యత్తును గూర్చి కూడ ఆలోచించాలి" అని ఆయన అన్నారు. ఉన్నత విద్యా పరిస్థితి ఆందోళనకరంగా ఉంది డా॥ జాకిర్‌హుస్సేన్ వంటి విద్యావేత్తలు "జాతీయ జీవితంలో పునరుద్ధరణ" జరగాలని అన్నారు మన ఉన్నత విద్యా విధానంలో యీ మార్పుకు దోహదం కల్పించాలి. జాతీయ అభివృద్ధికి అనుగుణంగా నేటి ఉన్నత విద్యావిధానాన్ని పునర్నిర్మించాలని రాష్ట్రపతి అన్ని విశ్వవిద్యాలయాలకు సూచించారు. ఈ సమస్యకు సంబంధించి మూడు అంశాలను ఆయన పేర్కొన్నారు. (1) పరివర్తన (2) ప్రామాణిక ప్రగతి (3) క్రమబద్ధమైన అభివృద్ధి. గాంధీజీ టాగూర్, డా॥ అనిబిసెంట్ తదితరులు రూపొందించిన విలువను పునరావలోకనం చేయడం మొదటి అంశం. నిరంతర కృషి, కొత్తగా కళాశాలలను నెలకొల్పడంలో జాగ్రత్తగా ఆలోచించాలని సూచిస్తున్నది.

విశ్వవిద్యాలయాలు వాటితాలూకు రాష్ట్రప్రభుత్వాల ఆర్థిక సహాయంపై ఆధారపడి ఉన్నాయి. ఈ విషయంలో కూడ



ఉస్మానియా విశ్వవిద్యాలయం స్వర్ణోత్సవాలకు అక్టోబరు 6న ప్రారంభోత్సవంచేస్తున్న భారత రాష్ట్రపతి డా. జాకిర్ హుస్సేన్



స్నాతకోత్సవ ప్రదేశం-విశ్వవిద్యాలయ లేడ్ స్కేప్ గార్డెన్

ఆంధ్రప్రదేశ్ ముందడుగు వేసింది. ప్రముఖ ఇంజనీరు, కీ.శే. నవాబు అలీనవాజ్ జంగ్ స్మృతి చిహ్నంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో హైడ్రాలిక్ ఇంజనీరింగ్‌లో పీఠం ఏర్పరచడానికి ప్రభుత్వం నిధులను సమకూరుస్తుందని ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అన్నారు. "తాము ఉద్దేశించిన ప్రయోజనానికి వినియోగించే" నిమిత్తం రాష్ట్రవిద్యుచ్ఛక్తి బోర్డు 1½ లక్షల రూపాయలు మంజూరు చేయడానికి అంగీకరించిందని ముఖ్యమంత్రి వెల్లడించారు. దుర్భిక్ష పరిస్థితుల ఫలితంగా ఏర్పడిన ఆర్థిక యిబ్బందులు తొలగిన తర్వాత విశ్వవిద్యాలయం ఆర్థిక వనరులు మెరుగుపడడానికి ప్రభుత్వం కృషి చేస్తుందని ఆయన అన్నారు.

# ఆదర్శఘట్టాలు

## కొల్లూరు జిల్లాపరిషత్ హైస్కూలు సాధించిన అభివృద్ధి

గుంటూరుజిల్లా కొల్లూరు పరిషత్ హైస్కూలు బహు పురాతనమైనది. గత దశాబ్దంలో యీ విద్యా సంస్థ గణనీయమైన ఫలితాలు సాధించింది. ప్రతి సంవత్సరం ఈ పాఠశాలనుండి ఎస్. ఎస్. ఎల్. సి పబ్లిక్ పరీక్షకు 60 మంది మొదలు 70 మంది వరకు బాల బాలికలు వెళ్తారు. 1960 నుండి 64 వరకు 90 నుండి 99 శాతం వరకు విద్యార్థులు కృతార్థులయ్యారు. 1967_68 లో ఉత్తమ విద్యార్థి 508 మొత్తంతోను, కాంపోజిట్ లెక్కల్లో నూరుశాతంతోను, ఉత్తీర్ణులగుట గణనీయమైన విషయం. ప్రముఖ సినీనటుడు, ఆ పాఠశాల పూర్వ విద్యార్థి అయిన శ్రీగుమ్మడి వేంకటేశ్వరరావు ఈ పాఠశాలలో 'వేంకటేశ్వర కళా మందిర్' నిర్మించి యిచ్చారు.

### ఉత్తీర్ణత వివరాలు

| సంవత్సరము | హాజరైన విద్యార్థులసంఖ్య | ఉత్తీర్ణులైన వారు | సరాసరి | ఎక్కువ మొత్తము |
|---|---|---|---|---|
| 1964_65 | 65 | 65 | 389 | 463 |
| 1965_66 | 65 | 65 | 377 | 488 |
| 1966_67 | 63 | 63 | 376 | 469 |
| 1967_68 | 67 | 67 | 425 | 508 |



నరసరావుపేట సమితిలోని కుంకలగుంట గ్రామంలో ఎలిమెంటరీ పాఠశాల నిమిత్తం రూ 9000లు ఖరీదుచేసే అసంపూర్తి భవనాన్ని, 15 సెంట్ల భూమినీ విరాళంగా ఇచ్చిన శ్రీమతి పొందుగు నరసమ్మ.

# — గాంధీజీ శతజయంతి



గాంధీ శతజయంతి ఉత్సవాలకు అక్టోబరు 2వ తేదీన గాంధీభవన్‌లో రాష్ట్రగవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ప్రారంభోత్సవంచేస్తున్నదృశ్యం



సికింద్రాబాదులోని గాంధీ ఆసుపత్రిలో అక్టోబరు 1వ తేదీన ప్రసూతి వార్డుకు శంకుస్థాపన చేసిన ముఖ్యమంత్రి

భారతదేశంలోని యితర రాష్ట్రాలతో పాటుగా ఆంధ్ర ప్రదేశ్ కూడ మహాత్మాగాంధీ శతజయంతి ఉత్సవాలను జరుపుకుంటున్నది. ఆంధ్రులను గూర్చి జాతి పితకు సదభిప్రాయం ఉంది. ఆంధ్రులకు కూడ ఆయనపై ఎనలేని ప్రేమాభిమానాలు ఉన్నాయి. అక్టోబరు 2 తేదీనాటి కార్యక్రమంలో ప్రభాతభేరీలు, గాంధీజీ జీవితానికి సంబంధించిన ప్రసంగాలు ప్రధానాంశాలుగా వున్నాయి. రాష్ట్ర రాజధానిలో గాంధీ భవనంలో జరిగిన ప్రధాన సమావేశంలో రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్‌దేశాయ్ యీ ఉత్సవాలకు ప్రారంభోత్సవంచేశారు. ఆ సందర్భంలో గాంధీ సాహిత్య ప్రదర్శనకు ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. శివరామ్‌పల్లి కేంద్రంలో నూరు నిముషాలసేపు సామూహికంగా నూలు వడికే కార్యక్రమం నిర్వహించబడింది. హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ వారు యీ సందర్భంగా విస్తృత ప్రాతిపదికపై మురికి వాడల పరిశుభ్రతా కార్యక్రమాన్ని నిర్వహించారు. నగర మేయరు శ్రీమతి కుముద్‌నాయక్, కార్పొరేషన్ సభ్యులు, అధికార అనధికార ప్రముఖులు యీ కార్యక్రమాలలో పాల్గొన్నారు.

గాంధీ శత జయంతి ఉత్సవాలకు శుభ సూచకంగా అక్టోబరులో ఆంధ్రప్రదేశ్‌లో వర్షాలు రావడమేగాక నిర్మాణాత్మకమైన కృషికూడ తీవ్రస్థాయిలో జరుగుతున్నది. గాంధీ ఆసుపత్రిలో ప్రసూతి విభాగానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఈ పథకానికి రాజ్‌బహదూర్ మోతిలాల్ ట్రస్టువారు రూ 60,000/-లు విరాళంగా యిచ్చారు. ఇప్పుడు గాంధీ ఆసుపత్రిగా వ్యవహరించబడుతున్న యీ కె.ఇ.ఎం. ఆసుపత్రికి బన్సీలాల్ కాలనీవారు గత మూడు దశాబ్దాలనుండి క్రమం తప్పకుండా రూ. 10,000/- విరాళంగా యిస్తున్నారు. అప్పటి హైదరాబాదు రాష్ట్రంలో గాంధీ ఆసుపత్రి అతి పురాతనమైనది. 1851 లో చిన్న స్థాయిలో నెలకొల్పబడిన యీ సంస్థ సాటిలేని ఉత్తమ సంస్థగా అభివృద్ధి సాధించింది. నెలలు తక్కువ బిడ్డల వార్డుకు శంకు స్థాపన చేసిన శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డికి వైద్య సర్వీసుల డైరెక్టరు స్వాగతం పలుకుతూ పసిపిల్లల మరణానికి కారణాలలో అకాల జననంకూడ ఒకటని అన్నారు.

## టి. బి సీళ్ళ అమ్మకం

గాంధీజీ జన్మదినోత్సవంనాడు 19వ టి.బి. సీళ్ల అమ్మకం ఉద్యమానికి వైద్య, ఆరోగ్యశాఖల మంత్రి, శ్రీ ఇబ్రాహిం అలీ అన్సారీ ప్రారంభోత్సవం చేశారు. భయంకరమైన క్షయవ్యాధిని గూర్చి మంత్రి సంఖ్యాపరంగా వివరించారు. దాదాపు 25 వేల మంది ప్రజలు యీ వ్యాధికి గురి అవుతున్నారు. ఏటా దాదాపు 6 వేలకు పైగా యీ వ్యాధికి బలిఅవుతున్నారు.

టి బి సీళ్ల అమ్మకం ఉద్యమం ప్రజలలో క్షయ వ్యాధిని గూర్చి ప్రబోధం కలిగించడమేగాక యీ వ్యాధి నిరోధానికి చికిత్స నిమిత్తం నిధులను కూడ సమకూరుస్తున్నది. ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్‌మాట్లాడుతూ "ఆంధ్రప్రదేశ్ క్షయ వ్యాధినిరోధక సంఘంవారు పేద క్షయ రోగులకు ఆర్థిక సహాయం అందజేయడంతో పాటు హైదరాబాదులోని ఆరామ్‌ఘర్‌లో 13 ప్రత్యేక టి. బి. షెల్టర్‌హోమ్‌లను నిర్మించడం సంతోషకరమైన విషయం" అని అన్నారు.

## అంధత్వ నివారణ దినం

సరోజినీదేవి కంటి ఆసుపత్రిలో "అంధత్వ నివారణ" దినోత్సవాన్ని జరిపారు. ఈ సందర్భంగా అధ్యక్షత వహించిన కార్మిక మంత్రి శ్రీ కె. వి. నారాయణ రెడ్డి, ఆసుపత్రిలోని బ్యాంకుకు తమ కన్నులను దానంగా యిస్తానని ప్రకటించారు. అంధత్వనివారణను గూర్చి ప్రజలకు బోధించడానికి నిరంతరం కృషి జరగాలని ఆయన అన్నారు.

— టి. వెంకటరావు

# చైతన్యమూర్తులు

## మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి

( జననం : నవంబరు 19, 1835 )



లక్ష్మీబాయి మహారాష్ట్రంలోని సితారాబాడి గ్రామంలో జన్మించింది. ఆమె చిన్ననాటి పేరు మనూబాయి. కాశీలోని ఒక జ్యోతిష్కుడు ఆమెను చూచి పరాక్రమ వంతురాలు అవుతుందని భవిష్యత్తు చెప్పాడు.

ప్రథమ భారతీయ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రశంసనీయమైన పాత్ర వహించిన నానాసాహెబ్‌తో కలిసి విద్య అభ్యసించి లక్ష్మీబాయి తన బాల్యంలోనే యుద్ధతంత్రప్రవీణ అయింది. ఆమె రాణి పాత్ర ధరించి దోషులను దండించేది. ఇది చూచి తండ్రి ఆశ్చర్యపడేవాడు.

ఒకనాడు నానాసాహెబ్ ఏనుగు మీద పోతూ ఉంటే తాను కూడా అతని వెంట వెడతానని మారాము చేసింది. తండ్రి కోపించి "ఏనుగు మీద కూర్చోవాలి అని ఉంటే ఏ మహారాజు ఇంటనో జన్మించి ఉండవలసినది" అని అనగా "ఏనుగు ఏమి గొప్ప. పది ఏనుగుల యోగం ఉంది నాకు" అంది మనూ.

ఆంగ్లేయుల అన్యాయాలను అరికట్టడానికి 1857 ఏప్రిల్ 25 నాటికి మీరట్ కంటోన్మెంట్‌లో విప్లవం చెలరేగింది. ఇది బరేలీ, శాహజహాన్‌పూర్, మురాదాబాద్ నగరాలకు వ్యాపించింది. నానాపర్నవీస్ మొదలగు వారు యుద్ధం చేస్తున్నా లక్ష్మీబాయి శాంతం వహించి ఉంది. ఆంగ్లేయులు న్యాయ బద్ధులనే విశ్వాసం ఆమెకు అప్పటికి ఇంకా పోలేదు.

సర్ హ్యూరోజ్, విప్లవకారులను అణచుటలో కృతార్థుడయ్యే సమయంలో ఝాన్సీరాణి రాజపుత్రుల నందరినీ ఏకం చేయ సాగింది. రోజ్ అడుగడుగునా విప్లవకారులను ఎదుర్కొనవలసివచ్చింది. తాంతియాతోపే ఆంగ్లేయులను సౌరకాయలుగా నరకడం ఆరంభించాడు. ఆంగ్లేయులు తమ యెడల ఆదరపూర్వకంగా ఎప్పుడూ ప్రవర్తించలేదని ఝాన్సీరాణి చెప్పిన మాటలు విని ఝాన్సీరాణిపై యుద్ధానికి దిగారనీ, అది వారి తెలివి తక్కువే అనీ చరిత్రకారులు వ్రాశారు.

రాణి ఆంగ్లేయుల ముందు ఎప్పుడును తల వంచలేదు. ఆమెకు గల శక్తి సామర్థ్యాలను వారు పొగడకుండా ఉండలేక పోయారు. ఉత్తమ సైన్యాధిపతి ఎవరైనా ఉంటే అట్టి వ్యక్తి ఝాన్సీలక్ష్మీబాయియే అని శత్రువులైన ఆంగ్లేయులే ఆమెను ప్రశంసించారు.

ఆంగ్లేయ సేనాధిపతి హ్యూరోజ్, ఝాన్సీ రాజ్యాన్ని జయించడానికి బయలుదేరాడే కాని అది సులభసాధ్యం కాదని త్వరలో తెలుసుకొన్నాడు. లక్ష్మీబాయి సైన్యాన్ని పటిష్ఠం చేయడంలో నిమగ్నురాలైంది. అన్ని హంగులతో యుద్ధానికి సిద్ధపడింది. హ్యూరోజ్ ఉదయాన్నే యుద్ధ భేరి మోగించాడు. రాణీ సైనికులు ఆంగ్లేయులపై దాడి చేసి వారిని భయభ్రాంతులకు చేశారు. రాణి రెండు కత్తులు పట్టుకొని నరుకుతూ ముందంజ వేయసాగింది. రాణి దత్తపుత్రుడు కత్తితో శత్రువులను సంహరిస్తూ ఉన్నాడు. నానాసాహెబ్ తాకిడికి ఆంగ్లేయులు పలాయనం చిత్తగించారు.

మహారాణి శక్తి స్వరూపిణియై శత్రువులను ఎదుర్కొనసాగింది. అందరికీ ధైర్యం చెప్పుతూ అశ్వారూఢయై కీథూ నది సమీపానికి చేరింది. గుర్రం అలసిపోవుట చేత దానిని ప్రేమతో దువ్వి లాలించే సమయంలో తుపాకీ గుండు ఒకటి వచ్చి తొడకు తగిలింది. ఒక కత్తి చేతినుండి జారిపోయింది. రెండవ కత్తితో కాళీరూపం ధరించి వీర విహారం చేయసాగింది. ఏడు దినముల నుండి ఆహారం లేక పోవుటచేతనూ, రక్తం ధారలుగా పోవుట చేతనూ మహారాణి నేల కూలింది. ఝాన్సీరాణి మనదేశ స్వాతంత్ర్య చారిత్రాకాశంలో ధ్రువతారగా నిలిచింది. ధైర్య సాహసాలకు, స్వాతంత్ర్య దీక్షకు ప్రతీకగా ఆమెను భారతీయులు స్మరించుకుంటారు.

—ఎమ్. పద్మావతి

## చార్లెస్ ఫిలిప్ బ్రౌన్

( జననం : నవంబరు 10, 1798 )

> మూర్ఖార్లు లెక్క చేయక
> పేర్లెక్కిన విబుధ వరుల బిలిపించుచు వే
> మార్ధ మిచ్చు వితరణి
> చార్లెసు ఫీలిప్పు బ్రౌను సాహెబు కరుణన్.

ఎవరయ్యా ఈ చార్లెసు ఫిలిప్పు బ్రౌన్ సాహెబు? పేర్లెక్కిన విబుధవరులను ఎందుకు పిలిపించేవాడు? అర్థ వితరణం ఎందుకు చేసేవాడట?

మన దేశాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీ పాలిస్తూ ఉండిన కాలంలో ఆ కంఫినీ కొలువులో ఉండి కడప, మచిలీపట్నం మొదలైన చోట్ల చాలా సంవత్సరాల పాటు జడ్జీగా పనిచేసిన ఇంగ్లీషు దొర బ్రౌన్. ఎందరు దొరలు మన దేశానికి రాలేదు? ఎందరు ఇక్కడ కొలువు చేయలేదు? తమ దేశం కొలువు చేస్తూ మనదేశాన్ని కొల్లగొట్టలేదు? ఐతే ఈ బ్రౌన్ దొర విశేషం ఏమిటి?

ఈ బ్రౌన్ దొర తన దేశాన్ని కొలుస్తూ ఆ కొలువుకు ఏమాత్రమూ భంగం కలగకుండా అంతకంటె ఎక్కువగా తెలుగు దేశపు కొలువు చేశాడు. మనలను కొల్లగొట్టలేదు సరికదా తన డబ్బే విస్తారంగా మనకోసం వెచ్చించాడు- నిస్స్వార్థంగా తెలుగు భాష సేవలో, తెలుగు సాహిత్యం ఉద్ధరణకోసం ఎన్నో ఉత్తమ గ్రంథాలను చెదపురుగుల నోట పడకుండా కాపాడాడు. అనేక కావ్యాల వ్రాత ప్రతులను సంపాదించి తప్పుల కుప్పలుగా ఉన్న వాటిని శ్రద్ధగా పరిశీలించి సంస్కరించి ముద్రింపించాడు. తెలుగు- ఇంగ్లీషు నిఘంటువును, ఇంగ్లీషు- తెలుగు నిఘంటువును కూర్చాడు ఈ మహా భాషా సాహిత్య వ్యవసాయానికి ఆయనే మదుపు పెట్టాడు. మదుపు పెట్టిన దానికి ఆయన అపేక్షించిన ప్రతిఫలం ఆంధ్రుల విజ్ఞానమూ, వికాసమూను. మరి ఆ భాషా సేవలో తనకు సహాయ పడడానికోసమే బ్రౌన్ దొర పేర్లెక్కిన విబుధ వరులను పిలిపించి తాను స్వయంగా వేతనాలు ఇచ్చి పోషించాడు.

ఆయన వేమార్లర్థమిచ్చు వితరణి కూడా. కష్టంలో ఉన్న ఒకాయన- కొంత పాండిత్యం ఉన్నవాడై ఉండాలికూడా- తనకు సహాయం చేయవలసినదిగా బ్రౌన్ దొరగారిని అర్థిస్తూ దొరగారు పండితుడు కనుక ఆయనను కొంచెం మెప్పించినట్లవుతుందని భాగవతం గజేంద్ర మోక్ష ఘట్టంలోని పద్యం వ్రాసి పంపించాడట!

లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె
ప్రాణంబులున్
తావుల్ దప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్
శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప ఇతఃపరం బెరుగ మన్నింపన్ దగున్
దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షించు
భద్రాత్మకా.

బ్రౌన్ దొర కొంత సొమ్ము ముట్టజెప్పాడట. ఆ వచ్చిన పద్యపు అర్జీమీద పద్యంలోనే ఒక ఎండార్స్‌మెంట్ కూడా వ్రాశాడట. ఆ పద్యంకూడ భాగవతంలోనిదే!

ఏను మృతుండ నౌదునని యింత భయంబు
మనంబులోపలన్
మానుము సంభవంబుగల మానవకోటికి చావు
నిక్కమౌ
గాన హరిం దలంపు మిక గల్గదు జన్మము
నీకు ధాత్రిపై
మానవ నాథ పొందెదవు మాధవలోక
నివాస సౌఖ్యముల్.

బ్రౌన్ దొర పండితుడు. పండితాభిమాని, న్యాయమూర్తి. రావణ దమ్మీయ ద్వ్యర్థికావ్యాన్ని రచించిన పిండిప్రోలు లక్ష్మణ కవి మేనల్లునికి ఒక వ్యాజ్యెంలో అన్యాయం జరిగింది. న్యాయాధికారి లంచం తీసుకొని అన్యాయమైన తీర్పు చెప్పాడు. అప్పుడు రాజమహేంద్రవరంలో జిల్లా జడ్జీగా ఉన్న బ్రౌన్ దొర దగ్గరికి అప్పీలు వచ్చింది. లక్ష్మణ కవి దొరగారిని దర్శించి ఒక పద్యం చెప్పాడు.

మధువైరికిన్ వనమాలికి గౌస్తుభ
హారునకును సంశ్రితావనునకు
రాధికా ప్రియునకు రామసోదరునకు
జగదీశునకు దయాసాగరునకు
శ్రీ నాథునకును రక్షిత దేవ సమితికి
బ్రౌఢ భావునకు నారాయణునకు
నురగేంద్ర తల్పున కరి శంఖ ధరునకు
దొగల రాయని గేరు మొగముదొంకు
రణ నిహత దుష్ట రాక్షస రమణునకును
గాన మోహిత వల్లవీ కాంతునకును
రిపు విదారికి హరికి శ్రీ కృష్ణునకును
కిల్బిషారికి నే నమస్కృతి యొనర్తు.

శ్రీ కృష్ణునికి నమస్కారం అని చెప్పిన ఈ పద్యం ప్రతి పాదంలోని మొదటి అక్షరాలను వరసగా చదివితే 'మహారాజశ్రీ బ్రౌన్ దొరగారికి' అని అవుతుంది. జరిగిన అక్రమాన్ని ఆలకించి న్యాయమూర్తి బ్రౌన్ దొర న్యాయం చేకూర్చాడట.

విదేశీయులు తెలుగు నేర్చుకోవడానికి సహాయపడే తెలుగు వ్యాకరణాన్ని రచించాడు బ్రౌన్. తెలుగు వారికి ఎంతగానో ఉపకరించే తెలుగు- ఇంగ్లీషు నిఘంటువును, ఇంగ్లీషు- తెలుగు నిఘంటువును తయారు చేశాడు.

బ్రౌన్ దొర అభ్యుదయ వాది. ఛాందస పండితులు పట్టుకొని వ్రేలాడే అర్ధానుస్వార శకట రేఫాలు వాడుక నుండి ఏనాడో నిష్క్రమించిన అర్థరహితమైన సంజ్ఞలు అని ధైర్యంగా చెప్పగలిగాడు. ఆయన తరవాత దాదాపు ఒక శతాబ్దానికి కాని గిడుగు రామమూర్తి పంతులు గారి కృషి ఫలితంగా వ్యావహారిక భాషకు మన్నన కలుగలేదు. బ్రౌన్ దొర ఏనాడో వ్యావహారిక భాషకు గౌరవం కలగజేశాడు.

బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో పాఠశాలా పరీక్షలలో తరుచు అడుగుతూ ఉండే ప్రశ్న ఒకటి ఉండేది : "బ్రిటిష్ పాలన వలన మనకు కలిగిన లాభములేవి"? అని. రైళ్ళు, తపాలా ఆఫీసులు వగైరా ఏవేవో విద్యార్థులు జవాబుగా వ్రాస్తూ ఉండేవారు. వాటి మాట ఎలా ఉన్నా బ్రిటిష్ పరిపాలన వలన తెలుగు దేశానికి కలిగిన ఒక పెద్ద ప్రయోజనం-చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

— ఎన్. శివనారాయణ

## జవహర్‌లాల్

( జననం : నవంబరు 14, 1889 )



"కొంతమంది గొప్పవారుగా పుడతారు; కొంతమంది గొప్పతనాన్ని సాధిస్తారు; మరి కొంతమందిని గొప్పతనం హఠాత్తుగా వరిస్తుంది." అన్నారు షేక్స్పియర్. జవహర్‌లాల్ నెహ్రూ పుట్టుకతోనే గొప్పవారు. ఆయనగొప్పతనాన్ని సాధించారు. అంతేగాని బలవంతంగా ఆయనకు గొప్పతనం ఆపాదించబడలేదు.

1916లో నెహ్రూ, కమలాకౌల్‌ను వివాహమాడారు 1917లో ఆ దంపతుల నోముల పంటగా ఇందిరా ప్రియదర్శిని జన్మించింది.

జలియన్‌వాలా జనసంహారం, దారుణ మారణ హోమం నెహ్రూను కదిలించివేసింది. క్రమేపి ఆయన, మహాత్ముని సహాయ నిరాకరణోద్యమం వైపు ఆకర్షింప బడ్డారు. ప్రిన్సు ఆఫ్ వేల్స్ (వేల్స్ రాకుమారుడు) ఇండియా వచ్చినపుడు, 1921 లో తొలిసారిగా నెహ్రూ అరెస్టు గావించబడ్డారు.

భార్యనూ, పుత్రికనూ వెంటబెట్టుకొని 1926 లో నెహ్రూ ప్రపంచ పర్యటనకు బయలుదేరారు. 1927 లో ఆయన రష్యను విప్లవ దశమ వార్షికోత్సవానికి హాజరైనారు. అదే సంవత్సరంలోనే నెహ్రూ, సంపూర్ణ స్వాతంత్ర్యమే కాంగ్రెస్ ధ్యేయమని ప్రకటించారు.

1947 సంవత్సరం ఆగస్టు 15 న భారత దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. స్వతంత్ర భారత తొలి ప్రధానిగా నెహ్రూ పదవీ స్వీకారం చేశారు. అవి చాలా గడ్డురోజులు. ఒకవైపు కాందిశీకుల సమస్య. మరోవైపు మత కలహాలు, అల్లర్లు; యింకొక వైపు కాశ్మీరుపై దండయాత్ర — ఇటువంటి క్లిష్ట పరిస్థితులను, ప్రధానిగా నెహ్రూ ఎదుర్కొనవలసి వచ్చింది. అయితే ఆయన ధైర్యంతో పరిస్థితుల నెదుర్కొన్నారు. దీనికి తోడు 1948 లో మహాత్ముడు హంతకుని గుండు దెబ్బకు గురికావడంతో నెహ్రూ ఒక్కరే జాతికి దిక్కు అయ్యారు.

స్వాతంత్ర్యం సిద్ధించేవరకు జరిగిందంతా ఒక పెద్ద గాథ అయితే, స్వాతంత్ర్యంసిద్ధించిన అనంతరం జరిగిందికూడా ఒక పెద్ద గాథగానే తయారయింది. భారత భాగ్యవిధాతగా నెహ్రూ సాగించిన 17 సంవత్సరాల పరిపాలనా కాలం వివిధ సన్నివేశ పరంపరలతో క్రిక్కిరిసి పోయింది. ఆయన అవలంబించిన తాటస్థ్య విధానం, కొంతవరకూ వ్యాఖ్యానాలకు గురియైనా మొత్తంమీద అది మనకు బాగానే ఉపకరించింది. అప్పుడే ఏర్పడిన ప్రజాస్వామ్య దేశంగా, రిపబ్లిక్‌గా భారత దేశానికి అనేక సమస్యలు వచ్చిపడ్డాయి. దేశ సౌభాగ్యానికి పథకాలనూ, ప్రణాళికలనూ ఆలోచిస్తూ, దేశాన్ని శ్రేయోరాజ్య లక్ష్యంవైపు పురోగమింప జేయాలనే సంకల్పంతో నెహ్రూ కృషి చేశారు. సోషలిస్టు తరహా నవసమాజ స్థాపనకు ఆయన అనేక విధాలుగా పాటు పడ్డారు

ఆయన జీవితకాలం ప్రత్యేకించి చెప్పదగిన ఒకయుగం. ఆయన ఒక యుగపురుషుడు. ఆయన శక్తి సామర్థ్యాలను మనం లెక్కకట్టలేం. ప్రాక్పశ్చిమ సంప్రదాయ సమ్మిళితమైన విశిష్ట వ్యక్తి ఆయన. స్వాతంత్ర్య యోధుడు, తాత్వికుడు, రచయిత, చరిత్ర కారుడు. అంతేకాక చరిత్ర సృష్టించిన మహనీయుడు. ఒక అపూర్వ త్యాగ పురుషుడు, కర్మిష్ఠి, సంపన్నులలో ప్రజాస్వామికుడు, ప్రజా స్వామికులలో సంపన్నుడుగా భాసించిన ధీశాలి. ఆదర్శవాది, వేయేల ఆయన భారత రత్నం.

## శ్రీమతి ఇందిరా గాంధీ

( జననం 19 నవంబరు 1917 )



నెహ్రూ కుటుంబానికి ప్రియతమమైన ఇందిర 1917 నవంబరు 19 వ తేదీన జన్మించింది. అప్పటి ప్రపంచ ప్రథమ సంగ్రామం ఉధృతంగా కొనసాగుతున్నది. ప్రపంచ చరిత్రలో ఒక పెద్ద మలుపుగా పరిగణించబడిన రష్యా విప్లవం ఆదేసంవత్సరం అదే నెలలో జరిగింది. జవహర్‌లాల్ నెహ్రూ జన్మించింది కూడా నవంబరు నెలలోనే. మహారాణీ ఝాన్సీ లక్ష్మీబాయి కూడా నవంబరు 19 వ తేదీన జన్మించింది. ఈ విధంగా నవంబరు 19 వ తేదీ ఒక విధమైన ప్రత్యేకతను సంతరించుకున్నది. 1917 వ సంవత్సరం కూడా అంతే ప్రాధాన్యతను కలిగిఉంది.

పూనాలో మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణురాలైన తర్వాత ఇందిర శాంతినికేతన్ వెళ్ళి, తనకై ఎటువంటి ప్రత్యేక సౌకర్యాలు లేకుండా యితర సామాన్య బాలికలతోపాటు హాస్టల్‌లో నివసిస్తూ సామూహిక కార్యక్రమాలలో పాల్గొన్నది. ఆమె అక్కడ కళాభవన్‌లో చిత్రలేఖనం, సంగీతం, నృత్యం అభ్యసించింది. విదేశాలలో తల్లి వ్యాధిగ్రస్తురాలై ఉన్న కారణంగా రవీంద్ర భారతి ఆశ్రమంలో ఇందిర ఎక్కువ కాలం ఉండలేకపోయింది. కణ్వుడు శకుంతలకు వీడ్కోలు చెప్పిన విధంగా టాగూరు ఇందిరకు దుఃఖభారంతో వీడ్కోలు చెప్పాడు. ఆయన నెహ్రూకు ఉత్తరం వ్రాస్తూ.... " ఆమెను నేను చాలా సన్నిహితంగా పరిశీలించాను. మీరు ఆమెను పెంచిన తీరుకు ముగ్ధుణ్ణి అయ్యాను. మీ సౌశీల్యం, లక్ష్యాలు ఆమెలో ఉన్నాయి." అన్నారు ఆ తర్వాత ఇందిర లండన్, ఆక్స్‌ఫర్డ్, స్విట్జర్లాండులలో విద్యాభ్యాసం చేసింది.

స్వార్థత్యాగం, సేవాతత్పరతగల వాతావరణంలో పెరిగిన ఇందిర, సాంఘిక సేవాకార్యకర్తగా సుప్రసిద్ధురాలైంది. 1947లో ఆమె, గాంధీతో కలిసి, మత కలహాలకు గురి అయి ఢిల్లీలో బాధితులకు సహాయక కార్యక్రమాలను నిర్వహించింది.

రాజకీయ రంగంలో ప్రవేశించిన తర్వాత కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సభ్యురాలుగాను, కాంగ్రెసు పార్టీ స్త్రీల విభాగం అధ్యక్షురాలు గాను, కేంద్ర పార్లమెంటరీ బోర్డు సభ్యురాలుగాను. ఎ. ఐ. సి. సి. యువజన సలహా మండలి సభ్యురాలుగాను వ్యవహరించింది. అఖిల భారత కాంగ్రెసుకు 4 వ మహిళా అధ్యక్షురాలుగాను, స్వతంత్ర భారత ప్రథమ మహిళా ప్రధాన మంత్రిగాను వ్యవహరించే గౌరవం ఆమెకు దక్కింది.

కాంగ్రెసు అధ్యక్షురాలుగా ఆమె ఎంతో సాహసం ధైర్యం ప్రదర్శించింది. కార్యవర్గంలో యువజనులకు స్థానం కల్పించింది. బొంబాయి విభజన అనివార్యమని ఆమెను ఒప్పించిన తర్వాత తన తండ్రితో సహా ప్రతి పక్ష నాయకులను ధైర్యంగా ఎదిరించి మహారాష్ట్ర, గుజరాత్ రెండు ప్రత్యేక రాష్ట్రాల ప్రతిపాదనను కాంగ్రెసు ఆమోదించే విధంగా చేసింది.

లాల్ బహదూర్ శాస్త్రి ప్రధానమంత్రి కాగానే కేంద్రమంత్రి వర్గంలోకి ఇందిరా గాంధీని చేర్చుకొని సమాచార ప్రసార మంత్రిత్వశాఖలను యిచ్చారు. ఆ శాఖలను ఆమె ఎంతో సమర్థతతో నిర్వహించారు. శాస్త్రి మరణించడంతో ప్రభుత్వ నాయకత్వం ఇందిరాగాంధీకి లభించింది. ఆ విధంగా దేశనాయకత్వం యువతరం చేతుల్లోకి వచ్చింది.

నాయకత్వం స్వీకరించగానే ఇందిరాగాంధీ ప్రసంగిస్తూ తనను తాను స్త్రీగా భావించననీ, కర్తవ్యాన్ని నిర్వహించాల్సిన వ్యక్తిగా భావిస్తాననీ ఆమె ప్రకటించింది. ఆమె స్త్రీ హృదయంతో సమస్యలను పరిశీలిస్తూ పురుషుని కార్యభారాన్ని నిర్వహిస్తున్నది.

## డా. సి. వి రామన్

( జననం : నవంబరు 7, 1888 )

భారతీయ భౌతిక శాస్త్రవేత్త డా॥సి. వి. రామన్‌కు మధ్యధరా సముద్రపు నీలివర్ణం అత్యంత మనోహరంగా కనిపించింది. ఈ ప్రకృతి సౌందర్య స్వరూపంవెనక, ఈ కవితోద్దీపక రసమయ రమ్యరూపంవెనక కారణభూతమైన శాస్త్రీయ అర్థంఏదోవున్నదని అనిపించింది. జలబిందువుల మీద పడిన సూర్య కిరణాలు పరావర్తనమై చెదరిపోయే విధానం మీద ఈనిక్షిప్తసౌందర్యం. రహస్యం యిమిడి వుండ వచ్చునిపించింది. 1921 లో సెప్టెంబరులో కలకత్తాకు తిరిగి వచ్చిన తర్వాత ఆయన ఈవిషయంలో ప్రయోగాలుచేశారు. తత్ఫలితంగా ఓ గొప్ప సిద్ధాంతాన్ని కనుగొన్నారు. రామన్‌కను గొన్నయీ వెలుగు పరావర్తన సిద్ధాంతానికి 1930లో ఆయనకు భౌతిక శాస్త్రంలో నోబెల్ బహుమతి లభించింది.

భౌతిక శాస్త్రంలో ఈ కొత్త సిద్ధాంతం అత్యంత ప్రధానమైనదిగా పరిగణించ బడింది. అనేక పరిశోధనలకు యీసిద్ధాంతం ఎంతో అవకాశాన్ని యిచ్చింది. ఈ విషయంమీద అసంఖ్యాకంగా గ్రంథాలు బయల్వెడలాయి. ప్రపంచంలోని వివిధ దేశాల శాస్త్రవేత్తలు యీ 'రామన్ సిద్ధాంతం' మీద సుమారు 6,000

వ్యాసాలను వ్రాశారు. పదార్థ స్వరూపాన్ని తెలుసుకోడానికి రామన్ కనుగొన్న సిద్ధాంతమూ, దాన్ని ఆధారంచేసుకుని ఆపైయింకా కొనసాగిన పరిశోధనలూ విస్తృతమైన అవకాశాన్ని కలిగించాయి.

రామన్ సాధించిన విజయాలకు ఒక ప్రత్యేకతవున్నది. ఆయన ఏ పాశ్చాత్య విశ్వవిద్యాలయాలలోనూ విజ్ఞాన శాస్త్రాన్ని అభ్యసించలేదు, పరిశోధనలు కొనసాగించలేదు. తమ క్రింద అణగివుండే పాలితుల యోగ్యతనూ, ప్రతిభనూ అలక్ష్యంగా గుర్తించే ఆంగ్లేయప్రభుత్వ పరిపాలనా కాలంలో రామన్ పదేళ్ళ అతి విలువైన కాలాన్ని భారతీయ ఆర్థిక శాఖలో ఒక అధికారిగా వ్యర్థపుచ్చవలసివచ్చింది. అటువంటి స్థాయినించి ఆయన యించుమించు తన స్వయంకృషి ద్వారా ప్రపంచంలో ఒక ప్రముఖ శాస్త్రవేత్తగా రూపొందగలిగారు.

వెంకటరామన్ తిరుచిరాపల్లిలో జన్మించారు. వీరితండ్రిగారైన చంద్రశేఖర్ అయ్యర్‌గారు విశాఖపట్టణంలోని ఎ.వి.ఎన్. మహిళా కళాశాలలో భౌతికశాస్త్ర ఆచార్యులుగా నియుక్తులు కావడంతో వెంకటరామన్ తమ నాలుగవయేటనే విశాఖకు తరలి వెళ్ళవలసివచ్చింది. పన్నెండవ యేటనే రామన్ మెట్రిక్యులేషన్ పరీక్షలోనూ, ఆ తరువాత రెండేళ్ళకు ఎఫ్. ఎ. పరీక్షలోనూ ఉత్తీర్ణులయ్యారు. అటుపిమ్మట మద్రాసులోని ప్రెసిడెన్సీ కళాశాలలో చేరి 1904 లో స్వర్ణపతకంతోబాటు పట్టాపొందారు. ఆ ఏడాది సైన్సులో ప్రథమ శ్రేణిలో వచ్చిన వారు ఆయనొక్కరే. 1907 లో ప్రథమశ్రేణిలో ఎం. ఎ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. మద్రాసు విశ్వ విద్యాలయంలో భౌతిక శాస్త్రంలో ప్రథమశ్రేణి సంపాదించిన వారిలో ఆయనే ప్రథములు. భారతీయ ఆర్థిక విషయాల సర్వీసుకు జరిగిన పోటీ పరీక్షలో ప్రథములుగా వచ్చారు.



చంద్రశేఖర్ వెంకటరామన్ తమ 18వ యేటనే అసిస్టెంట్ అకౌంటెంట్ జనరల్ అయ్యారు. కలకత్తా, రంగూన్, నాగపూర్‌లలోనూ, తిరిగి కలకత్తాలోనూ ఉద్యోగంచేశారు. నాగపూర్‌లో డిప్యూటీ అకౌంటెంట్ జనరల్‌గా ఆయన చాలా ఖచ్చితమైన వ్యక్తిగా, యోగ్యుడైన నిర్వాహకుడిగా పేరుకెక్కారు. మొదట్లో కలకత్తాలో ఉద్యోగం చేస్తున్న రోజుల్లో 'ఇండియన్ అసోసియేషన్ ఫర్ ది కల్టివేషన్ ఆఫ్ సైన్సు' పేరుతో ఒక సంస్థను చూసి ఆయన ఎగిరి గంతేశారు. ఆ సంస్థలో పరిశోధన కొనసాగించారు. రంగూన్, నాగపూర్‌లలో కొంతకాలం పాటు ఉద్యోగంచేసి తిరిగి కలకత్తాకు, తంతితపాలా శాఖలో అకౌంటెంట్ జనరల్‌గా వచ్చినప్పుడు కలకత్తా విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ సర్ అశతోష్‌ముఖర్జీ, రామన్‌ను ఆ విశ్వ విద్యాలయంలో భౌతికశాస్త్రాచార్యునిగా నియమించారు.

దీనితో ఆదాయ వ్యవహారాలు, మిగుళ్ళు, తూడిలు తీసివేతలు మొదలైన అంకెల గజిబిజి నుంచి రామన్‌కు విమోచనం లభించింది. తనఅభిరుచికితగ్గ మార్గంలో అడుగుపెట్టారు. ఆనాటి నుంచి విజ్ఞాన సముపార్జనకు నిరంతరంగా ప్రయత్నించడానికి తగిన అవకాశం లభించింది.

1924_25లో రామన్ ప్రపంచ పర్యటన జరిపారు. అదొక శాస్త్రజ్ఞాన యాత్ర. మరొక విధంగా చెప్పాలంటే జైత్రయాత్ర కూడా. లండన్‌లోని రాయల్ సొసైటీ ఫెలోషిప్ యిచ్చి రామన్‌ను గౌరవించింది. డేవీ ఫరడే లేబరేటరీలో ఎక్స్_రే కిరణాల మీద పరిశోధన చేశారు. కెల్విన్ వార్షికోత్సవాలకు హాజరయ్యారు. ఆ తర్వాత కెనడాకువెళ్ళి అక్కడ సైన్సు అభివృద్ధివిషయాల బ్రిటిష్ సంస్థలో కాంతిబిందువుల వికేంద్రీకరణ అన్న అంశంమీద ఉపన్యసించారు. గణిత శాస్త్రజ్ఞుల అంతర్జాతీయ కాంగ్రెసు సమావేశంలో గణిత భౌతికశాస్త్ర విభాగానికి అధ్యక్షత వహించారు. అనేక కెనడియన్ విశ్వవిద్యాలయాలను సందర్శించారు. అమెరికాలో కూడా పర్యటించారు. వాషింగ్‌టన్, చికాగో, ఫిలడల్ఫియా, అయోవాలలో అనేక శాస్త్ర పరిశోధనాగారాలను సందర్శించారు. ఫాగ్‌స్టాఫ్‌లో లోవెల్ అబ్జర్వేటరీని, అరిజోనాలో గ్రేండ్‌కెన్యాన్‌లను సందర్శించారు. పసడేనాలో కాలిఫోర్నియా ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా వుండేవారు. మౌంట్‌విల్సన్ అబ్జర్వేటరీలో 100 అంగుళాల పరావర్తని పరిశోధనలు కొనసాగించారు. వెస్టన్ ఎలక్ట్రిక్ కంపెనీ, జెనరల్ ఎలక్ట్రిక్ కంపెనీల పరిశోధక లేబరేటరీల పనితీరును పరిశీలించే అవకాశం ఆయనకు లభించింది. నార్వేలోని బోర్ లేబరేటరీని సందర్శించారు. బెర్లిన్, ప్యారిస్‌లకు కూడా వెళ్ళారు. తమ పర్యటనలో ప్రపంచ ప్రసిద్ధులైన శాస్త్ర వేత్తలను ఆయన కలుసుకున్నారు. అందమైన ప్రకృతి దృశ్యాలనెన్నిటినో దర్శించారు. శాస్త్ర విషయాల మీదేగాక భారతీయ నాగరికత మీదకూడా అనేక ప్రసంగాలు చేశారు. రష్యన్ సైన్సు అకాడమీ ద్విశత వార్షికోత్సవాలకు 1925 లో భారతదేశం తరఫున హాజరయ్యారు. ఆతర్వాత యూరప్‌లో అనేక దేశాలలో పర్యటించారు.

డా॥ సి. వి. రామన్‌ను ఎన్నో గౌరవాలు వరించాయి. రాయల్ సొసైటీ సభ్యునిగా ఆయన నియమింపబడ్డారు. ఇంగ్లాండు

సభుత్వం నైట్ బిరుదుతో గౌరవించింది. ఇటాలియన్ సొసైటీ ఆఫ్ సైన్సెస్ వారి మెటిస్సీ పతకం, లండన్‌లోని రాయల్ సొసైటీ వారి హగెస్ పతకం వీరికి లభించాయి. అనేక భారతీయ, విదేశీయ విశ్వవిద్యాలయాలు గౌరవ డాక్టరేట్‌లను వీరికి బహూకరించాయి. అనేక విజ్ఞాన సంఘాలలో సభ్యులుగాపునా రు. ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ పదహారవ సమావేశానికి వీరు అధ్యక్షత వహించారు.

శాస్త్రపరిశోధనా కేంద్రాన్ని ఒకదానిని నెలకొల్పాలని రామన్ కలలుకన్నారు. ఆ కలలు నిజమయ్యాయి. అలాటికేంద్రం ఒకటి యీనాడు బెంగుళూరులో వుంది. గడచిన నెలలో ఉస్మానియా విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవ సభలో ఉపన్యసిస్తూ తన మరొక కలను వెల్లడించారు. అదొక అపురూపమైన కల. వజ్రాలకల.

కడపలో పెద్ద ఎతున వజ్రాలు నిక్షిప్తమైవుండవచ్చునని వాటిని వెలికి తీసేప్రయత్నం చేయవలసినదని ఆయన శాస్త్రవేత్తలను కోరారు. ఆయన కన్నకలలు నిజమైతే, మనం రామన్ వజ్రాలకు వారసుల మౌతాము. ఆయనకలలు నిజమౌతాయనే ఆశిద్దాం.

భారత దేశం రాజకీయ స్వాతంత్ర్యంలేక అణగారి వున్నప్పుడు ప్రపంచ శాస్త్రవిజ్ఞాన వీధులలో భారతదేశానికి సమున్నత పీఠాన్ని వేసి భారతదేశ గౌరవాన్ని యినుమడింపజేసిన ఘనత రామన్‌కేదక్కినది.

జి. కల్యాణసింగ్

## సర్ అక్బర్ హైదరీ

(నవాబ్ హైదర్ నవాజ్‌జంగ్ బహదూర్)

(జననం ; నవంబరు 8, 1869)

బొహ్రా తెగవారు ముసల్మానులలో వణిజులు. మహమ్మద్ అక్బర్ నజరాలీ హైదరీ బొంబాయిలోని సంపన్న బొహ్రాకుటుంబంలో జన్మించారు. బొంబాయిలోని సెంటో ఎవియర్స్ కళాశాలలో విద్యాభ్యాసం కొనసాగించారు.

1905లో హైదర్ అకౌంటెంట్ జనరల్‌గా హైదరాబాదుకు వచ్చారు. 1906 లో ఆర్థిక కార్యదర్శిగా నియుక్తులయ్యారు. 1907 లో సర్‌జార్జివాకర్ స్థానే నియుక్తులైనప్పుడు అనేక సంస్కరణలను ప్రవేశపెట్టారు. 1911లో న్యాయశాఖ, పోలీసు శాఖ, జనరల్ డిపార్ట్‌మెంట్ ఇన్ చార్జ్‌గా హోంశాఖ కార్యదర్శిగా నియుక్తులయ్యారు. వీరికాలంలోనే హైకోర్టు, సిటీ కాలేజీవంటి సుందరకట్టడాలు నిర్మాణమయ్యాయి. ఆ కాలంలోనే వైద్యశాఖ పునర్వ్యవస్థీకరించబడింది. దేశీయ వైద్య విధానాలకు ప్రోత్సాహం యివ్వబడింది. విద్యమీద ఖర్చును 10 లక్షల రూపాయలనుంచి 72 లక్షల రూపాయలకు పెంచడం జరిగింది.

ఆరోజుల్లో నిజాంరాజ్యంలో వుంటూవచ్చిన అజంతా, ఎల్లోరా గుహలు; దౌలతాబాదు, బీదర్, గుల్‌బర్గాలలో వాస్తు నిర్మాణ శిధిలాలు పరిరక్షించడానికిగాను వీరు పురావస్తు శాఖను ఏర్పాటుచేశారు.

హైదరీగారి కృషిఫలితమే ఉస్మానియా విశ్వవిద్యాలయం. ప్రాంతీయభాషలో విద్యాబోధన గావించిన తొలి భారతీయ విశ్వవిద్యాలయమిది. సాంకేతిక పదాలను రూపొందించడానికీ, పాశ్చాత్య సాహిత్య, శాస్త్ర, సాంకేతిక గ్రంథాలను, పాఠ్య గ్రంథాలను అనువదించడానికీ ఒక బ్యూరోను ఏర్పాటు చేశారు.

1920లో తిరిగి హైదరీ బొంబాయి వెళ్లారు. అక్కడ భారత ప్రభుత్వ సర్వీసులో అకౌంటెంట్ జనరలుగా కొంతకాలం పాటు పనిచేశారు. 1921లో తిరిగి వీరు నిజాంప్రభుత్వ నిర్వహణ సంఘంలో ఆర్థిక, రైల్వేసభ్యుడుగా హైదరాబాదుకు తిరిగివచ్చారు. కరువునిధిని నెలకొల్పారు. హైదరాబాదు సివిల్ సర్వీస్ పరీక్షలను ప్రారంభించారు. పరిశ్రమలకు ఆర్థిక సహాయాన్ని కల్పించడానికై ఒక కోటి రూపాయల నిధిని ఏర్పాటు చేశారు. వరద నిరోధకానికి, డ్రైనేజి పనులకు, నగర అభివృద్ధికి ఒక పథకాన్ని రూపొందించే నిమిత్తం శ్రీ మోక్షగుండ విశ్వేశ్వరయ్యగారిని హైదరాబాదుకు ఆహ్వానించారు. హైదరీగారి పటిష్ఠమైన ఆర్థిక విధానంవల్ల హైదరాబాదు రాజ్య కోశాగారం ఎట్టి ఒడుదుడుకులకు లోనుకాలేదు.

మహిళలకు విద్యగరిపే విషయంలో యీనాడు ఎట్టి వ్యతిరేకాభిప్రాయములేదు. ఆ రోజుల్లోమాత్రం — ముఖ్యంగా హైదరాబాదు రాజ్యంలో — ఎంతో వ్యతిరేకతవుండేది. అట్టి తరుణంలో హైదరీ "దేశంలో మహిళలు అజ్ఞానంతో మ్రగ్గివున్నంతకాలము పురుషులు ఎంత విజ్ఞానవంతులై వున్నప్పటికీ ఆదేశం పురోగతి చెందలేదు". అని అతి నిర్భయంగా ప్రకటించారు. చాదర్ ఘాట్ వద్దగల మహబూబియా బాలికల పాఠశాల వీరి మహిళా విద్యాభివృద్ధికృషికి దృష్టాంతరం.

రాజకీయాలోకూడా వీరు ప్రముఖపాత్ర వహించారు. లండన్‌లో జరిగిన రౌండుటేబిల్ సమావేశానికి హాజరయిన ప్రతినిధివర్గానికి హైదరీ నాయకత్వం వహించారు. 1933లో బ్రిటీష్ పార్లమెంటు భారత రాజ్యాంగ సంస్కరణలపై ఏర్పాటు చేసిన సెలెక్టు కమిటీలో వీరు నిజాంస్టేట్ ప్రతినిధి. 1934లో ఇండియన్ స్టేట్‌మంత్రుల సంఘానికి అధ్యక్షత వహించారు. 1937లో నిజాం ఎక్జిక్యూటివ్ కౌన్సిల్‌కు అధ్యక్షులుగా నియుక్తులయ్యారు. 1936లో ప్రీవీ కౌన్సిలర్‌గా నియమింప బడ్డారు.

హైదరీ జాతీయ సమైక్యతకు విశేషంగా కృషిచేశారు. కలకత్తాలో జరిగిన అఖిల భారత మహమ్మదీయ విద్యావిషయక సమావేశంలో వీరు చేసిన అధ్యక్షోపన్యాసం యీనాటికీ మనలను ఉత్తేజితులను చేస్తుంది. "భారతదేశంలోని ముసల్మానులు అశోకుని గొప్పతనాన్ని, చంద్రగుప్తుని గొప్పతనాన్ని గుర్తించక పోవడం ; ఎల్లోరా కళాఖండాల ప్రాభవ వైభవాలను గుర్తించక పోవడం ; వాటినిచూసి ఆనందించలేక పోవడం; జయదేవుడు

తుకారాంలు వ్రాసిన అపూర్వమైన పాటలకు ప్రభావితం కాకపోవడం, వాటినుండి స్ఫూర్తిని పొందలేకపోవడం, బుద్ధుడు, శ్రీకృష్ణుడు చేసిన ప్రవచనాలనుంచి మానసిక వికాసాన్ని ఆశించకపోవడంగాని జరిగితే అది భారతీయ ముసల్మానుల అభివృద్ధి ఎంతమాత్రంకాదు, అది వారిలోని భారత జాతీయత లోపించడం క్రిందే లెక్క. హిందువులు కూడ మొగలు వాస్తు నిర్మాణ ప్రాభవాన్ని గుర్తించకపోవడం, షేర్‌షా, అక్బర్ వంటి గొప్ప గొప్ప పరిపాలకులు సాధించిన రాజకీయ విజయాలను గుర్తించక పోవడం; చాంద్‌బీబీ, నూర్జహాన్‌ల వీరోచిత సాహసాలను అభినందించలేకపోవడం, మహమ్మద్ గవాన్, అబుల్‌ఫజల్ వంటి మంత్రుల విశాల దృక్పథాన్ని అర్థంచేసుకోలేకపోవడం, అల్‌బెరూనీ, ఫైజీ వంటి పండితుల ప్రతిభను గుర్తించలేక పోవడం, అమీర్‌ఖుస్రూ, గాలిబ్ వంటి కవుల రచనల మాధుర్యాన్ని గ్రోలలేకపోవడం అది హిందువులలో భారత జాతీయత లోపించిందనడానికి తార్కాణం"

—జి. కల్యాణసింగ్

## డా॥ పట్టాభి సీతారామయ్య

(జననం: నవంబరు 11, 1880)



పట్టాభి సీతారామయ్యగారిలో ప్రత్యేకించి చెప్పుకోదగ్గ గుణం దృఢనిశ్చయంతో ముందుకు కదలడం. ఆయన ఆత్మస్థైర్యాన్ని ఆలంబనగా చేసుకున్నారేతప్ప అనుకోని అదృష్టంమీద ఏనాడూ ఆధారపడలేదు. ఆయన విజయం వచ్చినప్పుడు ఉప్పొంగిపోలేదు. పరాజయం పొందినప్పుడు అణగారి పోనూలేదు.

మన జీవితంలో ఆత్మశక్తిగలవ్యక్తి ఎవరన్నా తటస్థపడ్డారంటే ఆయన పట్టాభి సీతారామయ్యగారే. నాలుగైదేళ్ళ వయస్సులోనే అతి హీనస్థితిలో జీవిస్తూ, నెలకు పదిరూపాయలకన్నా తక్కువ ఆదాయంమీద ఆధారపడి బ్రతికే అయిదుగురు సభ్యులుగల కుటుంబంలోనివారు సీతారామయ్యగారు. అలా ఆ పది రూపాయల ఆదాయంతోనూ పదమూడు సంవత్సరాలు గడపవలసి వచ్చింది వారికి. క్లాసు పుస్తకాలు కొనుక్కోడానికి కూడా ఆయనకు డబ్బులేదు. ఒకే ఒక చొక్కాతో ఏడేళ్ళు గడిపాడు. అయితే ప్రతి పోటీలోనూ ప్రథముడిగావచ్చి స్కాలర్‌షిప్పు పొందుతూ తద్వారా తన చదువును పూర్తిచేసుకో గలిగారాయన. చాలా కాలంపాటు పట్టాభిగారిలోని ప్రతిభ నివురుగప్పిన నిప్పులా అణగివుండలేదంటే అది ఆయనలోపం కాదు. 1906లోనే స్వరాజ్యశంఖారావంవిని ఉత్తేజితులై, స్వదేశీ ఉద్యమంతో ప్రభావితులై ప్రజాజీవితంలోకి అడుగుపెట్టి ఆంధ్రదేశంలో దానికొక క్రొత్త స్వరూపాన్ని, నూతన శక్తినీయిచ్చారు. వారు చేపట్టిన కార్యకలాపాలూ, సాధించిన విజయాలూ అసంఖ్యాలు. 1910లో జాతీయ విద్యావ్యాప్తికి ముందునిలిచి ఆంధ్ర జాతీయకళాశాల ఆవిర్భావానికి కారకులయ్యారు. ఈ కళాశాల దీనికిదేసాటి. 1911లో ఇండియన్ నేషనలిజం అనే గ్రంథాన్ని రచించారు. 1913లోనే భాషా ప్రాతిపదిక మీద రాష్ట్రాల ఏర్పాటుకై నిర్భీతిగా ఎలుగెత్తి చాటారు. 1917లో కాంగ్రెసులో ఆంధ్ర దేశానికి గౌరవమైన పీఠాన్ని ప్రతిష్ఠించారు. 1916లోనే రాబడిబాగావున్న తన వైద్యవృత్తిని వదలుకొని పూర్తి కాలాన్ని ప్రజా సేవకు అంకితంచేశారు.

1919లో "జన్మభూమి" అనే ఇంగ్లీషు వారపత్రికను స్థాపించారు. ఆనాటినుంచి 1930లో కారాగారానికి వెళ్ళేవరకు ఒంటరిగానే ఆ పత్రికను నడిపారు. అసాధారణ రచనా ప్రతిభవల్ల, అద్వితీయ వ్యాఖ్యాన నైపుణ్యంవల్లా జాతీయ పాత్రికేయ రంగంలో చిరస్థాయిగా నిలిచిపోయారు. 1922లో ఆంధ్రదేశంలో తొలిబ్యాంకును, 1923లో తొలి ఇన్సూరెన్సు కంపెనీని ఏర్పాటు చేశారు. గాంధీజీ ప్రవేశానికి పూర్వమే కాంగ్రెసు నిర్మాణాత్మక కార్యక్రమాన్ని ప్రతిదాన్నీ—ఒక్క చరఖా కార్యక్రమం మినహా—చేపట్టి నిర్వహించిన ఆయన రాజకీయ దూరదృష్టి అసమానమైనది. 1919లో జరిగిన అమృతసర్ కాంగ్రెసు సమావేశం, 1920లోని కలకత్తా ప్రత్యేక సమావేశం మధ్యకాలంలో ఆయన గాంధీజీని సరిగా అర్థం చేసుకోలేదనే చెప్పాలి. అయితే మూడునెలల అనంతరం నాగపూర్‌లో జరిగిన సమావేశంలో ఆయన పూర్తిగా గాంధేయులయ్యారు. కాంగ్రెసులో పాతికేళ్ళపాటు ఆయన ఒక చైతన్యవ్యక్తిగా మెలిగారు. వారి వాగ్ధాటినీ, ప్రతిభనూ తిలక్, అనిబెసెంట్‌లు గుర్తించి అభినందించారు. విజయరాఘవ చారియార్ ఆయనను విషయనిర్ణాయక సంఘంలో, అసాధారణ ప్రతిభా వ్యుత్పత్తులుగల వ్యక్తిగా మెచ్చుకున్నారు. కాంగ్రెసులో కప్పదాట్లువేయని స్థితప్రజ్ఞుడుగా లాలాలజపత్‌రాయ్ పేర్కొన్నారు. పట్టాభిగారి సూక్ష్మబుద్ధిని రాజాజీ మెచ్చుకున్నారు, పట్టాభి తనకు భాష్యకారుడుగా గాంధీజీ పేర్కొన్నారు.

ఆయనకు అఖండ కీర్తిని ప్రసాదించినవాటిలో ముఖ్యంగా పేర్కొదగ్గవి రెండు. మొదటిది—కాంగ్రెసు చరిత్రపేరున ఆయన వ్రాసిన బృహద్గ్రంథం, రెండవది—సంస్థానాల ప్రజలకు ఆయన నిరంతరంగా చేసినసేవ. స్వేచ్ఛా భారతదేశపు తొలి కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షత వహించిన ఘనత పట్టాభిగారిదే. మధ్యప్రదేశ్‌కు గవర్నరుగావుండి ఆయన రిటైరయ్యారు. "ఒక లక్ష్యంతో పనిచేయడం, బాధ్యతకు పూర్తిగా అంకితమైవుండడం, స్వతంత్రమైన భావప్రవృత్తిని కలిగివుండడం—ఇవే ఆయనను యావద్భారత దేశంలోనూ ఒక ప్రముఖవ్యక్తిగా తీర్చిదిద్దాయి".

—కె. ఈశ్వరదత్

# మహాభారతము

తెమ్మెగంటుల లక్ష్మణశాస్త్రి

ధర్మరాజు సూర్యుని ఆరాధింపదలచి తత్క్రమము ఉపదేశింపుమని ధౌమ్యాచార్యుని వేడగా, ఆయన తొలుత ఆ దేవునికి గల 'సూర్య, అర్యమ, భగ' మొదలగు నూట యెనిమిది పేర్లను తెలిపెను. తొలుత ఈ యష్టోత్తర శతనామములను ఉచ్చరించి సమస్త దేవదానవులు సూర్యభగవానుని అర్చించెదరు. సూర్యోదయమునందు ఈ నామములను పఠించి స్త్రీ పురుషులు సమస్త ఐహిక సుఖములనేకాక పూర్వజన్మ స్మృతినిగూడ పొంద గలరు. సంసార సముద్రమును తరించెదరు. ఈ మాటలు విని యుధిష్ఠిరుడు బ్రాహ్మణ పాలనమును సూర్యోపాసన ద్వారా చేయ దలచి గంగాజలములో నిలిచి, ఆచమనముచేసి నిష్ఠతో ఏకాగ్ర చిత్తముతో సూర్యుని నామములన్నియు జపించి అనేక విధములుగా ఆ దేవునిగూర్చి స్తోత్రముచేసెను. ఆయన తపస్సునకు, స్తుతికి మెచ్చి, ప్రసన్నుడై, సూర్యుడు ప్రత్యక్షమయ్యెను. 'యుధిష్ఠిరా! నీ కోర్కెలన్నియు తీరుగాక! నేను నీకు పన్నెండు సంవత్సరముల వరకు తరుగకుండునట్లు ఆహారమునిచ్చెదను. ఈ తామ్రపాత్రమును తీసుకొనుము. ఈ పాత్రమును నీ వంట ఇంటిలో నుంచినచో ఇది మీకు వలయు పండ్లు, కూరలు, మాంసము మొదలగు చతుర్విధాహారములను పుష్కలముగా ఇచ్చుచుండును. ద్రౌపది తాను భుజించకుండా ఇతరులకు వడ్డించుచుండునంతవరకు కోరిన ఆహార పదార్థములన్నియు దీనిలోనుండి వచ్చుచుండును. నేటినుండి పదునాలుగవ సంవత్సరమున నీకు తిరిగి రాజ్యము లభించగలదు.' అని చెప్పి సూర్యుడు అంతర్ధానము చెందెను.

ఈ స్తోత్రమును ప్రతిదినము భక్తితో పఠించువారి నీపుత్రులు కపటముతో ఓడించి ధర్మమునెడల విశ్వాస ఘాతముచేసిరి. వారు చేసిన యన్యాయము శాంతించుటకు ఉపాయము చెప్పెదను. అట్లు చేయుము. దానివలన నీపుత్రులు పాపవిముక్తులై లోకములో కీర్తి గాంచగలరు. పాండవుల రాజ్యము వారికి తిరిగి లభించవలెను. రాజు తన ధనముతోనే తృప్తిచెంది ఇతరుల ధనమును ఆశించకుండుట అన్నిటికంటె గొప్పధర్మము. దానివలన నీ కీర్తి నశించదు. భ్రాతృవర్గములో ద్వేషము ఉండదు. నీవు ధర్మాత్ముడవనిపించుకొందువు. పాండవులను చేరదీసి శకునిని తిరస్కరించుట నీకు ముఖ్యకర్తవ్యము. అట్లునీవు చేయనియెడల కౌరవకులము పూర్తిగా నశించును. క్రుద్ధులైన భీమార్జునులు శత్రుసేనలో ఎవరినీ మిగిలించరు. వారి సహాయముగల పాండవులకు, లభింపజాలని వస్తువు ఉండదు. దుర్యోధనుని జన్మ కాలమునందు కలిగిన అపశకునములు గమనించి అప్పుడేనేను 'కులనాశకుడైన ఈ పుత్రుని విసర్జించు'మని హితమును బోధించితిని. నీవు పెడచెవిని బెట్టితివి. దానివలన ఇప్పుడు పశ్చాత్తాప పడుచుంటివి. ఇప్పటి నా ఈ హితబోధనను గూడ పాటించనిచో మున్ముందు నీవు అత్యధికముగా పశ్చాత్తాపమును పొందవలసి వచ్చునునీ. పుత్రుడు పాండవులతో కలసి రాజ్యము నేలినచో నీకు ఈ చింతపోయి నీవు ప్రసన్నుడవయ్యెదవు. దుర్యోధనుడు నీమాట వినకున్నచో అతనిని నిగ్రహించి యుంచుము. దాని వలన కులమున కంతటికిని సుఖము కలుగును. ఆతరువాత యుధిష్ఠిరునకు రాజ్యపట్టాభిషేకము చేయుము. అతడు ఎవరియెడల రాగద్వేషములులేని అజాతశత్రువు. రాజా! నీవంశములోఇప్పుడు యుధిష్ఠిరుడొకడే ధర్మపూర్వకముగా రాజ్యపాలనము చేయుటకు అర్హుడు. అప్పుడు రాజులందరు వైశ్యులవలే కానుకలను తెచ్చి కౌరవులకు అర్పింతురు. కర్ణ, శకుని, దుర్యోధనులు కూడ పాండవులను ఆదరించవలెను. దుశ్శాసనుడు సభలో భీముని, ద్రౌపదిని క్షమార్పణ కోరవలెను. నీవు [illegible] గౌరవ పూర్వకముగా రాజ్యమునందు ప్రతిష్ఠించుము. రాజా! హితమును బోధించుమని నన్ను కోరితివి. నేను చెప్పితిని, ఇంతకన్న నీకు వేరు హితము ఉండదు. నామాట వినినచో నీవు ధన్యుడవై సుఖింతువు"

ఈ మాటలు విని ధృతరాష్ట్రుడు ఇట్లనెను "విదురా! నీవు చెప్పిన మాటలు పాండవులకు హితములు గాను, నాకొడులకు అహితములు గాను వున్నవి. దీనికి నేను అంగీకరింపను. ఈ నీ మాటల వలన నీవు పాండవ పక్షపాతివని స్పష్టముగా తెలిసినది. నాహితమును నీవు కోరువాడవు కావు. పాండవులకుగాను నాపుత్రులను ఎట్లు విడువజాలుదును? పాండవులు నాకొడుకులే. కాని దుర్యోధనుడు సాక్షాత్తు నాశరీరము నుండి జనించినవాడు. కనుక సమత్వ బుద్ధి యెంత ఉన్నను ఈ ఇరువురిలో అంతరము ఉన్నది. ఇతరులకొరకై నా శరీరమును ఎట్లు విడువగలను? పుత్రుడు ఆత్మయేకదా! విదురా! నిన్ను నేను మిక్కిలి గౌరవించితిని. కాని నీవు కుటిలముగా ఉపదేశించుచున్నావు. నీవు ఇక్కడనుండి వెడలి పొమ్ము. నీతో నాకు ఎట్టి ఉపయోగమునులేదు. కులటను ఎంత ఆదరించినను, అది తన స్వామిని విడిచియే పోవునుకదా; నీవుగూడ అంతే" అనిచెప్పి ధృత

రాష్ట్రుడు తొందరగా లేచి, ఇంటిలోనికి వెడలిపోయెను. అప్పుడు విదురుడు 'ఈకులమునకు నాశము కలుగుట తథ్యము' అనిచెప్పి పాండవుల కడకు పోయెను.

ఏకాకిగా విదురుడు తమ కడకు వచ్చు చుండుట జూచి యుధిష్ఠిరుడు భీమునితో నిట్లనెను: తమ్ముడా, విదురుడు మనవద్దకు వచ్చుచున్నాడు. ఎందులకో తెలియదు, శకుని ప్రోత్సాహముపై తిరిగి మనను జూదమునకు పిలుచుటకు వచ్చియుండునా? లేక ఆ నీచుడైన శకుని మనను రప్పించి తిరిగి జూదములో మన ఆయుధములనుగూడ గెలుచుకొనుటకు ఇతనిని పంపియుండునా? యుద్ధమునకు గాని, జూదమునకు గాని రమ్మని నన్ను పిలిచినపుడు నేను వెనుకాడలేను. ఇట్టి పరిస్థితిలో ఒకవేళ గాండీవమును జూదములో ఓడినచో మనకు తిరిగి రాజ్యము లభించుట సందేహము', అనిచెప్పెను అంతట పాండవులు విదురుని ఎదుర్కొని స్వాగత సత్కారపూర్వకముగా సుఖాసీనుని చేసిరి. అతడు వచ్చిన కారణమును కుశలప్రశ్న పూర్వకముగా నడిగిరి. విదురుడు తనకు ధృతరాష్ట్రునితో జరిగిన సంభాషణమును తెలిపి 'ధర్మరాజా! రోగికి పథ్యము రుచించనట్లు అతనికి నాహిత వచనము ఇష్టము కాలేదు. శ్రోత్రియవంశములో దుష్టురాలైన స్త్రీని సన్మార్గమునకు తెచ్చుట అసంభవమైనట్లే ధృతరాష్ట్రునికూడ మంచిమార్గమునకు తేలేకపోయితిని. అతనికి నాహిత వాక్కు చిన్నవయస్సు కన్నెకకు వృద్ధపతివలెనే నచ్చలేదు. కనుక రాజా! కౌరవ కులము తప్పక నశించగలదు అని తోచుచున్నది. అందువలన ఆ అంధరాజు కుపితుడై: "నీయిష్టము వచ్చిన చోటికి వెడలిపొమ్ము. ఇక రాజ్యపాలనకు నీసహాయమును కోరను" అని నన్ను విసర్జించెను.

"ధర్మజా! ఇప్పుడు మీకు ఉపదేశించుటకు వచ్చితిని. శత్రువులు పెట్టిన దుర్భర క్లేశములను సహించి తమకు అనుకూలమైన సమయమునకొరకు వేచియుండి, అల్పమైనఅగ్నిని చిన్న గడ్డి పోచలతోను పుల్లతోను ప్రజ్వలింప జేసినట్లుగా, ఇతరుల సహాయమును కొని సమయము వచ్చినప్పుడు తమశక్తిని చూపించ గలవా డొక్కడే సమస్త పృథ్వీరాజ్యమును అనుభవించగలడు. తన ధనమును తన సహాయకులు తమదిగా భావించి అనుభవించువారే తన దుఃఖమును పంచుకొనగలరు. కనుక ఉదారముగా ధనమునిచ్చి సహాయకులను చేరదీసికొనవలెను. అప్పుడు సమస్త రాజ్యము తనను చేరినట్లుగానే నిశ్చయించు కొనవచ్చును. వేయి మాటలు వ్యర్థముగా వదరుటకన్న ఒక్క సత్యవాక్యము శ్రేష్ఠము తనకు తోడుగా నున్న బంధు జనముతో కలిసి భుజించవలెను. వారి ఎదుట తన గొప్పదనమును మాన్యతనుగూర్చి చెప్పి కొనకూడదు ఇట్లు మెలగురాజునకు సర్వదా ఉన్నతికలుగును."

నీ హితవాక్యములను తప్పక అనుసరించెదననిచెప్పి యుధిష్ఠిరుడు 'మహాత్మా! దేశ కాలానుసారముగా ఇప్పటి నా కర్తవ్యమును ఆదేశించుము. తప్పక పరిపాలించెదను', అనెను

విదురుడు పాండవులకడకు పోయినతరువాత ధృతరాష్ట్రునకు మిక్కిలి పశ్చాత్తాపము కలిగెను. మహా నీతిమంతుడైన విదురుడు పాండవులకడ చేరినచో వారికి భవిష్యత్తులో గొప్ప అభ్యుదయము కలుగ గలదని చింతించుచు, సభలో మూర్ఛిల్లి క్రిందపడెను. మూర్ఛదేరి, విదురుని తిరిగి పిలుచుకొని రమ్మని సంజయుని పొమ్మనెను. "విదురుడు ధర్మ స్వరూపుడు, నాకు సోదరుడు. అతడు లేకుండ నేనునిలువ జాలను' అనిచెప్పిమిక్కిలి దుఃఖించెను, 'సంజయా! విదురుని జాడ కనుగొనుము. పాపిష్ఠుడనైన నేను కోపముచేత అతనిని వెడల గొట్టితిని. అయ్యో! అతడు బ్రతికియున్నాడో లేదో! ఎప్పుడును అతడు కించిత్తు అపరాధమైనను చేయలేదు. నేను అతనికి చాల ద్రోహము చేసితిని. అతనిని నీవు తోడుకొని రాకున్నచో నేనుప్రాణత్యాగము చేసెదను' అని చెప్పెను. వెంటనే సంజయుడు కామ్యక వనమునకుపోయి, యుధిష్ఠిరాదుల పూజలనందుకొని రాజాజ్ఞదెలిపి విదురుని హస్తిపురికి తోడుకొని వచ్చెను. ధృతరాష్ట్రుడు మిక్కిలిసంతసించి విదురుని కౌగిలించుకొనెను. తననుక్షమించ మనెను. ఆ మాటవిని విదురుడు: 'రాజా! నేనెప్పుడును ప్రసన్నుడనే. నాకు, నీకొడుకులు, పాండవులు సమానులే. అయినను దీనదశలోనున్న వారిని ఆదరించుట ధర్మముకనుక అట్టిధర్మబుద్ధిచే నేను ఇప్పుడు దీనులుగానున్న పాండవులను ఊరడించుటకు పోయితిని. వేరుకాదు" అనిచెప్పెను. ఇట్టి పరస్పర సంభాషణతో ఆ ఇరువురు ప్రసన్నులై యుండిరి.

విదురుడు తిరిగి వచ్చినాడని తెలిసి దుర్యోధనుడు మిక్కిలి పరితపించెను. కర్ణ, శకుని, దుశ్శాసనులతో దురాలోచనలను చేసెను. "విదురుడు రాజుయొక్క బుద్ధిని మరలించి పాండవులను అడవులనుండి రప్పించులోపల మీరు నా హితమునకై ఆలోచింపుడు. తిరిగి పాండవులు ఇక్కడికి వచ్చినచో అన్నోదకములను వీడి శుష్కించిపోయెదను. విషము త్రాగెదను. ఉరిబోసికొనెదను. కత్తితో పొడుచు కొనెదను. అగ్నిప్రవేశము చేసెదను. తిరిగి పాండవులు వృద్ధిచెంది సంతోషముతో నుండుటను చూచి నేను సహించలేను."

ఆ మాటకు శకుని ఇట్లనెను; "రాజా! మూర్ఖబాలునివలె నీవు విచారింపకుము. పార్థులు ప్రతిజ్ఞాభంగము చేసి తిరిగి వనము నుండి పురమునకు వచ్చెదరని తలంపకుము. పాండవులు సత్యమును పాలించెదరు. మీతండ్రి పిలిచినను వారు రారు. ఒకవేళ అట్లు తిరిగివచ్చినను మనము మధ్యస్థులముగానుండి రంధ్రాన్వేషణము చేసెదముగాక," దుశ్శాసనుడు శకునిమాటతో ఏకీభవించెను. కర్ణుడు, 'వారువచ్చినచో మరల జూదమాడి ఓడించెదముగాక! వారు సత్యప్రతిజ్ఞులు గనుక తిరిగి రారనియే నా భావము.' ఈ మాటలు విని దుర్యోధనుడు మూతిముడుచుకొని అప్రసన్నుడుగా నుండెను. అది చూచి కర్ణుడు కోపించి గ్రుడ్లు ఉరిమి వారితో నిటనెను 'మనమందరము దుర్యోధనునకు కింకరులమై చేదోడువాదోడుగా నుండెదము. అందరము ఇతనికి హితమైనపనియే చేసెదము. మనమిప్పుడు అడవికి పోయి పాండవులను చంపుటకు వారిపై దాడి సల్పెదముగాక! వారు మరణించినచో మనకు వారితోగల జగడములు నశించును. వారు కష్టములలో దుఃఖములలో నిస్సహాయులై ఉన్నప్పుడే వారిని సులభముగా జయించగలమని నా భావము.' ఇట్లు కుట్రలు పన్ని ఆ నలుగురు రథములపై పాండవ వధార్థమై అడవికి

బయలుదేరిరి. వీరి కుతంత్రమును వ్యాసభగవానుడు దివ్యదృష్టితో కనుగొని త్వరగా హస్తిపురికివచ్చి ఆ ప్రయత్నమునుండి వారిని వారించి, ధృతరాష్ట్రునివద్దకు పోయి ఇట్లనెను.

'రాజా ! కౌరవుల హితమునుగోరి నీకొక్కమాటను చెప్పెదను వినుము. మాయజూదములో వారిని ఓడించి అడవికి పంపుట శ్రేయస్కరముకాదు. పదిమూడు వర్షములు సమయపాలనము చేసి వారు తిరిగివచ్చి నీ కుమారులను హతమార్చెదరు. వారిశక్తి తెలిసికూడ నీ కొడుకులు రాజ్యకాంక్షచేత వారిని ఇప్పుడు అడవిలో చంపదలచినారు. ఇట్టి మూర్ఖులను నీవు వారించుము. వారిని శాంతపరచుము. పాండవులను చంపబోయి తప్పక వారు తమ ప్రాణములను గోల్పోయెదరు. నేను, విదురుడు, భీష్ముడు, కృపాచార్యుడు, ద్రోణాచార్యులవలె నీవును సాధుస్వభావము కలవాడవు. బంధుజనముతో విరోధము అకీర్తికరము. ఇప్పుడు దుర్యోధనుని నీవు ఉపేక్షించినచో నీ వంశము నశించును. పాండవాగ్నికి అతడు ఇప్పుడు శలభము కానున్నాడు. ఇది శ్రేయస్కరముకాదు. పాండవులను నీవు చేరదీసినచో క్రమముగా ఇరువర్గములలో స్నేహభావము పెంపొందగలదు. దాని వలన నీకు శాంతి చేకూరగలదు. పుట్టుకతో వచ్చిన గుణము పుడకలలో పెట్టినను పోదుకదా ! అందువలన నీ కొడుకులను వారించి, కురువంశమును కాపాడుము. ఇది నీ ఒక్కనికే సాధ్యము' ఆ మాట విని ధృతరాష్ట్రుడు, "నాకును విదుర భీష్ముదులకును జూదము ఇష్టము కాదు. అయినను, విధి మమ్మ అప్పుడు నోరు మూయించెను. మహాత్మా ! దుర్యోధను డెంత దుష్టుడైనను పుత్రప్రేమచేత అతనిని విడువజాలకున్నాను." అని చెప్పెను. దానికి వ్యాసుడిట్లనెను : నీవు నిక్కము చెప్పితివి. పుత్రునికన్న ప్రియమైన వస్తువు మరియొకటి లేదు. పూర్వము 'సురభి'కి ఇంద్రునకు జరిగిన సంవాదమును తెలిపెదను వినుము. ఒకప్పుడు స్వర్గలోకములో ఆ కామధేనువు ఏడ్చుచుండుటను ఇంద్రుడు చూచి దుఃఖ కారణమడిగెను. "పుత్రశోకముచే నేడ్చుచుంటిని. చూడుము ఈ కర్షకుడు దుర్బలుడైన నా కొడుకును కొరడాతో కొట్టుచు నాగేటికి కట్టి బాధించుచున్నాడు. దానిని చూచి సహించలేక దుఃఖించుచున్నాను." అని సురభి చెప్పెను. "సురభీ ! వేలకొలది నీకొడుకులు బాధపడుచుండగా, ఈ ఒక్కకొడుకు బాధను చూచి యేల ఇట్లు ఏడ్చుచుంటివి." అని యింద్రుడు అడిగెను. దానికి అది, "పుత్ర సహస్రము ఉన్నను, వారిలో అతిదీనుడైన పుత్రుని యెడల తల్లిదండ్రులకు ఎక్కువ దయ ఉండును గదా !" అనెను. ఆ మాట విని యింద్రుడు సురభి పుత్రులైన వృషభములకు విశ్రాంతి గూర్చదలచినవాడై నిండుగా వానలు గురిపి సేద్యగాని కృషికర్మకు భంగము గలిగించి యెద్దులకు విశ్రాంతి చేకూర్చెను. కనుక రాజా ! సురభి చెప్పినట్లు పుత్రులందరు సమానులైనను హీనపుత్రుల యెడల పితరులకు అధిక కృప ఉండుట సహజము. నాకు, నీవు, పాండురాజు, విదురుడు ఈ ముగ్గురు పుత్రులు సమానులే. నూటఒక్కమంది నీ పుత్రులు, పంచపాండవులును సమానులే. ఐనను, పాండవులు దీనులై యున్నారు. వారు ఎటు తిరిగి వృద్ధి జెంది బాగుపడుదురో యనియే చింతించుచుందును. కనుక ధృతరాష్ట్రా ! పాండవులు, నీ కొడుకులు సుఖముగా జీవించి ఉభయకులము వృద్ధిచెందుట నీయభిమతమైనచో దుర్యోధనుని శాంతిపరచి పాండవులతో కలిసిమెలసి యుండునట్లు చేయుము" అని వ్యాసభగవానుడు ఉపదేశించెను. ధృతరాష్ట్రుడు మహాత్మా ! మాకందరకును అదియే అభిమతము. కనుక ఎలాగైనను దుష్టుడైన దుర్యోధనుని మీరు శాసింపుడు' అనెను. "రాజా ! మహాత్ముడైన మైత్రేయ మహాముని పాండవులను చూచి మనను గూడ దర్శించుటకు ఇప్పుడే యిక్కడికి వచ్చుచున్నాడు ఆయన దుర్యోధనుని శాసించి అతనికిని, కులమునకును శాంతి కలిగించును. ఆయన ఉపదేశించిన విధముగా నడచుకొనుడు. అది వినక ఆయనను పరిహసించి తిరస్కరించినచో నీ పుత్రుని ఆయన శపించగలడు." అనిచెప్పి వ్యాసభగవానుడు వెడలిపోయెను.

మైత్రేయ మహాముని వచ్చెను. ధృతరాష్ట్రుడు, పుత్రులు, ఆ మహామునికి పూజ సలిపిరి. ఆయన సుఖాసీనుడు కాగా ధృతరాష్ట్రుడు కుశలప్రశ్నము చేసి యిట్లు ప్రశ్నించెను:- "మహాత్మా ! పాండవులు తమ ప్రతిజ్ఞను పూర్తిగా పరిపాలించుచు పదిమూడేండ్లు గడపెదరా ! నా పుత్రులూ, వారు స్నేహభావముతో నుండెదరా ?" దానికి మైత్రేయుడిట్లు బదులు చెప్పెను :- " రాజా! నేను తీర్థయాత్ర చేయుచుండగా కామ్య వనములో పాండవులు కనపడిరి. వారితో ప్రసంగించుచున్నప్పుడు వారికి కలిగిన పరాభవము, దుఃఖము తెలిసెను. అది విని నీ కడకు వచ్చితిని. నీయందు నాకు ఎల్లప్పుడును స్నేహము, ప్రీతి అధికము కదా ! కనుక హితము చెప్పెదను వినుము. నీవు, భీష్ముడును జీవించి యుండగా మీ వంశములో ఇట్టి ఘోర సంకటము కలుగకూడదు. నీవు స్తంభము వలె నిలుచుండి పుత్రులను అణచజాలుదువు. అయినను నీపుత్రులలో జరిగిన ఈ అన్యాయమును నీవు ఎట్లు ఉపేక్షించితివి. నీ సభలో జరిగిన రాక్షస కృత్యమును మహామును లందరు గర్హించిరి. నీవే యిందులో నిందాపాత్రుడవైతివి." అని చెప్పి, దుర్యోధనునితో నిట్లనెను ;- 'నాయనా ! నీకు హితము చెప్పెదను వినుము. పాండవులకు ద్రోహము చేయకుము. దానివలన నీకు, వారికి, నీ కులము నకే కాక సమస్త లోకమునకు హితము చేకూరును. పాండవులు ధర్మాత్ములు, మహాబలశాలురు. రాక్షసులను సంహరించి దేవతలకు గూడా హితము చేసిరి. జరాసంధ, హిడింబ, బక, కిర్మీరాదులైన రాక్షసులను జంపిరి. జరామరణములు గల మానవుడెవడైనను వారినెదిరింప సాహసించడు. నామాట విని శాంతిల్లుము," అని మైత్రేయుడు చెప్పుచుండగనే దుర్యోధనుడు ఏనుగు తొడవంటి తన తొడను ఒక్క పెట్టున బిగ్గరగా చరచి కాలితో భూమిని రాయుచు నిర్లక్ష్యముగా చిరునవ్వుతో నూరకుండుటను జూచి మైత్రేయుడు మిక్కిలి కోపించి, 'దుర్యోధనా ! నీవు తొడను చరచి యిప్పుడు నన్ను తిరస్కరించితివి గనుక ఈ నీ తొడను యుద్ధములో భీముడు విరుగగొట్టి సంహరించునుగాక' యని శపించెను. అది విని ధృతరాష్ట్రుడు భయపడి, మహాత్మా "ఇట్టి ఘోరమైన శాపమును ఉపసంహరించుకొనుడు. ఇది నేను సహించజాలను," అని వేడుకొనెను. 'నీ పుత్రుడు శాంతిల్లి ధర్మమార్గమునవలంబించినప్పుడు నా శాపము గూడ ఉపసంహృతము కాగలదు.' అని చెప్పెను.

అప్పుడు ధృతరాష్ట్రుడు కిర్మీర రాక్షసుని భీమసేనుడు చంపిన విధానమును మైత్రేయుని అడుగగా, 'నేనింకేమియు చెప్పను. నా మాట నీ కొడుకు వినడు. కిర్మీర వధ వృత్తాంతమును విదురుడు మీకు చెప్పగలడని మైత్రేయుడు వెడలిపోయెను. కిర్మీర మరణమును విని దుర్యోధనుడు ఉద్విగ్నుడై ఆ చోటు విడిచిపోయెను.

## కిర్మీర వధ

ధృతరాష్ట్రుని కోరికపై విదురుడు కిర్మీర వధ వృత్తాంతమును ఇట్లు చెప్పెను. 'రాజా ! పాండవులు వనవాసమునకు బయలుదేరి మూడు అహోరాత్రములు ప్రయాణముచేసి కామ్యక వనమును చేరిరి. అక్కడ అర్ధ రాత్రమునందు క్రూర రాక్షసులు సంచరించుచుందురు గనుక మునులు, గోపాలకులు, ఇతర వనచరులు రాత్రివేళల అక్కడికి పోవుటకు భయపడెదరు. పాండవులను అర్ధరాత్రమునందు క్రూరుడగు కిమ్మీరుడు కన్నుల నిప్పులు గ్రక్కుచు చేతిలో మండుచున్న కొరవితో నడగించెను. అతనికి ఎనిమిది కోరలు, ఎర్రని కన్నులు, నిక్కబొడుచుకొని చలించుచున్న వెంట్రుకలు ఉండెను. అతని ఆకారము సూర్యకిరణములు, మెరపులు, కొంగలతో కూడిన వర్షమేఘమువలె నుండెను. అతడు రాక్షసమాయను సృజించి బిగ్గరగా గర్జించుచుండెను. ఆ ధ్వనికి భయపడి పక్షులన్నియు దిక్కులకు పారిపోవుచుండెను. లేళ్ళు, పులులు, దున్నపోతులు, మొదలైన మృగములు భయపడి ఇటు నటు పరుగెత్తుచుండెను. అప్పుడు ఆ వనమే ఆ చోటు వీడి పరుగెత్తుచున్నదా అనునట్లుండెను. అతడు నడచునప్పటి తొడల వేగపు వాయువులచేత లతాంగనలు కదలి తమ పల్లవ బాహువుల చేత, వృక్షసమూహమును కౌగిలించుకొనెను. అప్పుడు వీచిన గాలివలన రేగిన దుమ్ముచేత ఆకాశమునందలి నక్షత్రములన్నియు మాటుపడెను. పంచపాండవులు, పంచేంద్రియములకు తెలియకుండ వచ్చు దుఃఖమువలె ఆ కనుపడని రాక్షసునివలన దుఃఖమును చెందిరి. జింకచర్మము కప్పుకొని వచ్చుచున్న పాండవులను దూరమునుండియే చూచి ఆ రాక్షసుడు ఆ వన ప్రవేశ ద్వారమును మైనాక పర్వతమువలె అడ్డగించెను. వానిని చూచి ద్రౌపది కన్నులు మూసికొని, వ్యాకులత చెందెను. మూర్ఛిల్లుచున్న ఆమెను, విషయాసక్తములైన పంచేంద్రియములు విషయములందలి యనురక్తినివలె పట్టుకొని ఆపిరి. ఆ రాక్షస మాయను, రాక్షసఘ్న మంత్రములచేత ధౌమ్యుడు నశింపజేసెను. దానివలన అతికుపితుడైన ఆ రాక్షసుడు యమునివలె కనుపడెను. యుధిష్ఠిరుడు 'నీవెవడవు ? ఎవరి కొడుకవు ? నీకేమి కావలెను?' అని యడిగెను. ఆ మాటకు రాక్షసుడు 'నేను బకాసురునకు సోదరుడను, కిర్మీరుడని నా పేరు. ఈ నిర్జనమైన కామ్యకవనములో నిశ్చింతగా నివసించుచుండెదను. ఇక్కడికి వచ్చిన మనుష్యులను యుద్ధములో చంపి తినుచుండెదను. నా ఆహారమగుటకు స్వయముగా వచ్చిన మీరెవరు ? మిమ్ము చంపి తినెదను.' అనెను.

ఆ మాటలు విని యుధిష్ఠిరుడు తన గోత్ర నామములను తన తమ్ముల పేర్లను అతనికి తెలిపెను. అప్పుడా రాక్షసుడు మిక్కిలి సంతసించి ఇట్లనెను "నేను ఎన్నియో నాళ్లుగా వెతకుచుండిన నా శత్రువు, భీముడు నా వశములోనికి స్వయముగా వచ్చెను. నా అన్న బకాసురుని, నా మిత్రుడు హిడింబాసురుని కపటముచేత చంపిన పగను తీర్చుకొనుటకు నేడు అవకాశము దొరకినది. భీముడు కపట బ్రాహ్మణ వేషములో విద్యాబలముచేత వైత్రక వనమునందున్న బకాసురుని చంపెనే కాని లేకున్న అతని ముందు ఇతని బాహుబలమెంత ? వారిద్దరు చేయని పని నేను చేసి ఇతనిని భక్షించి అగస్త్యుడు వాతాపిని వలె జీర్ణించుకొనెదను.

ఆ మాటలువిని ధర్మరాజు అత్యంతకుపితుడై అట్లు ఎప్పటికిని జరుగదు అని చెప్పెను. వెంటనే భీముడు ఆ సమీపముననున్న పదిబారల పొడవైన వృక్షమును పెకలించి జాడించి వాని ఆకులు దులిపి ఆయుధముగా చేతబట్టుకొనెను. అర్జునుడు కూడ పిడుగునుగూడ పొడిచేయజాలిన శక్తిగల గాండీవమును నిమిషమాత్రములో ఎక్కుపెట్టెను. భీముడు అర్జునుని ఆపి, ఆ రాక్షసునిపైబడి యమదండముతో సమానమైన వృక్షాయుధముతో రాక్షసుని తలపై బిగ్గరగా కొట్టెను. అప్పటికిని అతడు చలించక తన చేతిలోని కొరవిని భీమునిపై విసరెను. దానిని భీముడు ఎడమకాలుతోచిమ్మి తిరిగి అతనిపై బడునట్లు చేసెను. అతడును మరియొక వృక్షమును పెరికి భీమునిపైబడెను. ఆ యిరువురును పూర్వము వాలి సుగ్రీవులవలె యుద్ధము చేసిరి. గజ కుంభస్థలముపై బడిన కమల పత్రమువలె వారి తలలపై బడిన వృక్షములు తునిగి క్రింద పడిపోవుచుండెను. ఆ యుద్ధములో ఆ వనము వృక్షరహితమయ్యెను. ఆ తరువాత, భీమ కిర్మీరు లిర్వురును వరుసగా శిలాయుద్ధము, బాహుయుద్ధము, నఖయుద్ధము చేసిరి. భీమునిలో దుర్యోధన తిరస్కారమువలన కలిగిన అభిమానము, ద్రౌపది ప్రేమదృష్టివలన పెంపొంది అతని ఉత్సాహము క్రమక్రమముగా పెరిగెను. భీముడు అతని నడుముపట్టుకొని గిరగిర త్రిప్పి, అతడు అలసిపోవుటనుచూచి, పశువును బంధించినట్లుగా తన బాహువులచేత అదిమి గిరగిరత్రిప్పి పశువువలె పడగొట్టి క్రింద పడవైచి మోకాలుచేత నొక్కిపట్టి అతని గొంతు నులిమెను. అతని ప్రాణము పోయిన తరువాత విడిచెను. అప్పుడు భీమసేనుని అందరును ప్రశంసించిరి. _ అని విదురుడు కిర్మీరవధ వృత్తాంతమును ధృతరాష్ట్రునకు చెప్పెను. అదివిని రాజు చింతానిమగ్నుడై దుఃఖించెను.

( సశేషము )



# సాహితీ సదనం

## గ్రంథ సమీక్ష

సంప్రదాయ ఛ్చందోబద్ధములైన వృత్తాలలో ఆధునిక సాంఘిక ఇతి వృత్తాలను నిర్వహించడం ముసలి మొగుడితో కాపురంచెయ్యమని పడుచు పెళ్లాన్ని బలవంత పెట్టినట్లుంటుందని చాలామంది ఆధునికుల అభిప్రాయం. ఆధునిక ఛందస్సులైన మాత్రాఛందస్సులు, వచనగేయం మొదలగు కవితారీతులలో పురాణ కథలను నిర్వహించడంకూడా అలాంటిదేనని వారు అంటుంటారు. కాని యిది పూర్తిగా నిజమా అనేదే ప్రశ్న. కావ్యవస్తువు మారిన కొద్దీ దానిని ప్రకటించే శిల్పరీతి కూడా సహజంగా మారుతూ వుంటుందనడం యథార్థం. ఆధునిక కాలంలో సాంఘిక ఇతి వృత్తాలకు కావ్యగౌరవం లభించినప్పటినుండీ కావ్య రీతి పూర్వ కాలపు పద్యచ్ఛందస్సులనుండి, మాత్రా ఛ్చందస్సుల వైపుకూ, అక్కడి నుండి ఆ మాత్రంకూడా ఛందోరూపంలేని వచన కవిత వైపూ మరలడం మనం కండ్లారా చూసిన విషయమే. వస్తువూ, అది బహిర్గతమయ్యే రీతీ, వాటిలో అవి మాట్లాడుకుని మనకు తెలియకుండానే తమతమ రూప స్వభావాలను సరిదిద్దుకుంటాయనే విషయం యథార్థం. అయితే కావ్యవస్తువుకు సంబంధించి అభ్యుదయ భావనలుకలిగి, సాంఘిక న్యాయగర్భితములైన ఆధునిక ఇతివృత్తాల వైపుకు మనస్సు మళ్ళి, రీతి విషయంలో వచ్చిన మార్పును గుర్తించలేని, లేక గుర్తించనిష్టంలేని కవుల మాటేమిటి? శిల్పరీతిలో వచ్చిన మార్పులను వారు అంగీకరించనంత మాత్రాన వారి అభ్యుదయ భావనాలోకము అప్రకటితంగా వుండవలసిందేనా? కావ్యవస్తువూ, తద్గతమైన సందేశమూ అన్నింటికంటే ముఖ్యం కాబట్టి ఏదోవిధంగా అది బైటికిరావడం అవసరంగదా. అందువల్ల ఎంత ఆధునికులైనా దానిని గ్రుడ్డిలోమెల్లలాగా ఆమో[illegible]క తప్పదు. సంప్రదాయచ్ఛందస్సులో రాసినందున యిటు[illegible] కావ్యాలకు మరొక ప్రయోజనం కూడా వుంటుంది. ఆ ఛ[illegible] ప్రియులైనవారిలోకూడా సాంఘికమైన ఆధునిక భావాలకు బీజాలు వేయడానికి అవి ఉపకరిస్తాయి. అయితే యిటువంటి కావ్యాలు తెలుగులో చాలా స్వల్పంగానే వచ్చాయి. ఎందుకంటే సాధారణంగా యిది అసహజమైన వాతావరణాన్ని కలిగివుంటుంది కనుక. వచ్చిన కొద్ది కావ్యాల్లో "మధూదయం" వంటి కావ్యాలు పేర్కొనదగినవి. ఈ రీతిలోనే వచ్చిన మరొక కావ్యం.—

### మాతృ మందిరం

(స్వతంత్ర సాంఘికమాలికా కావ్యం)

రచన: వఝల వెంకటేశ్వర్లు

ప్రతులకు : హితకారిణీ సమాజం, రాజమండ్రి.

వెల మూడు రూపాయలు

జయపుర సంస్థానాస్థానకవి శ్రీ సెట్టి లక్ష్మినరసి "చిత్ర మాలికలు" చదివిన తర్వాత తమకు మాలికారచన మక్కువ జనించినదని కవిగారు "మనసులో మాట"లో చెప్పకున్నారు. "మహిళాభ్యుదయం కోసం, హరిజనోద్ధరణ కోసం, వివిధ సాంఘిక దురాచార నిర్మూలనం కోసం దేశనాయకులు కృషి చేస్తున్న రోజులవి. చట్టబద్ధంగా బాల్య వివాహాలు నిషేధింపబడినా యింకా అప్పటికి సార్వత్రికంగా యువ-యువతీ వివాహాలు అమలులోకి రాలేదు. నాటి ఆర్థిక సాంఘిక రాజకీయ పరిస్థితులను ప్రతిబింబింప జేసేది, ఆంధ్ర దేశానికీ, సంఘ సంస్కారానికీ సంబంధించినది అయిన ఒక నూతన కావ్యం నిర్మించవలెనన్న సంకల్పం నాకు కలిగింది" అని కవి గారు రాసుకున్నారు. ఇది నిజంగా అభినందించదగిన ప్రయత్నం. ఆధునిక కవితావస్తువూ, ప్రాచీన పద్య రీతీ కలిసిన కావ్యాలు విజయవంతమైనవని ఆధునికులు చాలామంది అంగీకరించక పోయినా ప్రాచీన కవిపండితులు వీటిని ఆదరిస్తారు. అందువల్ల యిటువంటి కావ్యాల ప్రయోజనాన్ని గురించి ఆలోచించేటప్పుడు దేని విశిష్టత దానిదని సరిపుచ్చుకోవడం మంచిదనిపిస్తుంది. తెలుగులో వృత్తమాలికా కావ్యాలు యింతవరకు లేవని కవిగారన్న మాట నిజమే. కాని చిరుభేదాలతో ద్విపద కావ్యాలను మాలికా కావ్యాలుగానే మనం భావించవచ్చు. ప్రతిరెండు పంక్తులకుగల భిన్నప్రాస నియమం మినహాయిస్తే అదీ వృత్తమాలికగానే వుంటుంది. అలాగే శతకాలు మొదలగు వాటిలో మకుటాన్ని అనుసరించి ఉత్పల చంపకాలు, మత్తేభ శార్దూలాలతో కావ్యమంతా నడుస్తుంది. ఈ జంటవృత్తాలకు నడకలో గల భేదం అత్యల్ప మని అందరెరిగినదే. ఏ పద్యానికాపద్యంలో భావం పూర్తి కావాలన్న దొకటే నియమం. మాలికారచన చాలావరకు ఆశుకవిత్వం ద్వారా సాహిత్యంలో ప్రవేశించి వుంటుంది. ఆలోచించి రాసే వ్యవధి లేనందున పద్యం దొర్లడమే ప్రధానమైనందున, నాలు పంక్తుల్లో అనుకున్నభావం పూర్తికాకపోయినా అక్కడ ఆగడానికీ, నట్టు పడడానికీ వీలేనందున సాగదీయడం అవసరమైంది. ఎంత దూరమైనా ఒకే ప్రాసను నిర్వహించి పాండిత్య ప్రకర్ష చూపడాని క్కూడా యిది పనికి వచ్చింది. "పూతమెరుంగులున్", "లొట్ట యిదేటి మాట" అనే పూర్వకవుల ఆశుకవితా మాలికలు, తిరుపతి వేంకటకవులు "కొంచెలలోన కొంచెయున్ గావలె" నంటూ కవి గుణములను గురించి చెప్పిన మాలిక మన సాహిత్యంలోను ప్రసిద్ధములు.

ఈ కావ్యములో మధుసూదనుడు దుష్టపాత్ర. రాజకీయ కారణమున జైలుకు వెళ్ళిన వసంతుడను స్నేహితుని భార్యను వలచి దౌర్జన్యం చేయడం, ప్రణయానికి దాసుడు కావడం అతనిలో దుష్టలక్షణాలు. వసంతుని భార్య మనోరమ చివరకు గోదావరిలో పడి మరణిస్తుంది. మధుసూదనుని ఆదిలో పెండ్లాడిన వితంతువు ప్రియంవద సచ్చరిత్ర. భర్త కొరకు అనేక పాట్లుపడినది. చివరకు ఆమె మాతృ సేవా మందిరము స్థాపించినది. చివరకు ఆ మందిరమునందే మధు, వసంతుల బిడ్డలకు వివాహమై కథ సుఖాంత మవుతుంది. మాతృ సేవా మందిరంలో శ్రీ కందుకూరి వీరేశలింగంగారి చిత్ర మున్నట్లూ, ప్రియంవద జనుల సహాయంతో దానిని స్థాపించి తన జీవితం సాంఘిక సేవకొరకు ధార పోయ దలచు కొన్నట్లూ, దానిలో అనాథ బాలబాలికలకూ, బాలవితంతువులకూ ఉచితంగా విద్య గరపుతున్నట్లూ చిత్రించబడిన కథలోని సేవాభావ వైశిష్ట్యము, సంఘసంస్కరణాభిలాష పాఠకుల మనస్సులమీద చెరగని ముద్ర వేస్తుందనడంలో సందేహములేదు.

ఈ కవిగారు వేంకట కాళిదాస కవులని ఆంధ్రదేశంలో ప్రసిద్ధులైన జంటకవులలో ఒకరు. వీరి శైలి ప్రబంధ శైలికి చాలా దగ్గరగా వుంటుంది. సరళమైన పదాలలో లలిత మధురంగా పద్యము రాయుటలోనూ, దుష్కర ప్రాసలను సైతం మంచినీళ్ళ ప్రాయంగా మాలికలో నడిపించుటలోనూ సిద్ధహస్తులు.

"పావన గౌతమీ సలిల వాయువు లల్లన వీచు వేళ రా
జీవ సఖుండు పశ్చిమము జేరి మనోహర సాంధ్యరాగ శో
భావిభవంబులన్ పృథివి బ్రాకగ జేసెడు వేళ"

అంటూ సరళంగా కవిత్వం చెప్పగలరు.

"సద్యో విస్తృత చక్షురాస్తిమిత ప క్ష్మత్తారకాద్వంద్వమై
యుద్యత్కంపన నాసికా పుట భవిష్ణూచ్ఛ్వాస నిశ్శ్వాసమై
స్విద్యత్ఫాల కపోల మండల తటీ వేల్లద్భ్రుకుట్యోష్ఠమై
విన్యుచ్ఛక్తి పటిష్ఠ వాగ్ఘరసహోభివ్యత్స్వనద్వక్త్రమై
తద్యోషా వదనంబు కించిదుపలబ్ధద్యోతితారుణ్యమై
యాద్యాశ్చర్య వరక్రుధానుగ ఘృణావ్యాపార సంయోగ సం
పాద్యంతః కరణాను రూపమగు భావస్ఫూర్తి పాటించెడున్"

అంటూ మోగిత మోగించగలరు. ఇంతహా ఒక్కమాటలో చెప్పాలంటే అనరళమైన ధారాశుద్ధి ఈ కవిగారి సొమ్ము. ప్రతిపాదిత వస్తువు అభ్యుదయకరమైనది కనుక అందరూ అభినందించదగిన గ్రంథం. ఒక వేళ దీనిని పాఠ్య గ్రంథంగా నిర్ణయిస్తే ఉపాధ్యాయులకు విద్యార్థులకూ ఉపయోగపడునట్లు అర్థాలూ, విశేషార్థాలుగల టిప్పణి గ్రంథం చివరలో యివ్వబడింది.

## బాపురెడ్డి గేయాలు

రచన :- జె. బాపురెడ్డి

ప్రతులకు : సుశీలానికేతన్, I. C. 85, ఎర్రమంజిల్ కాలనీ, హైదరాబాదు-34.

వెల : మూడు రూపాయలు

శ్రీ బాపురెడ్డి గారు యువకవులలో ప్రతిష్ఠులు. చైతన్య రేఖలు, రాకెట్టు రాయబారం మొదలగు కావ్యాలను ప్రకటించి ఆధునిక కవితా లోకంలో, ముఖ్యంగా మాత్రాచ్ఛందోరచనలో సిద్ధ హస్తులనిపించుకున్నారు. ఆధునిక యుగంలో మాత్రా ఛందస్సులను సమర్థంగా, సర్వ రంజకంగా నిర్వహించి, ఆ రీతిలో సంపూర్ణ కావ్యాలు రాసి మెప్పు పొందిన డా నారాయణరెడ్డి గారి తర్వాత మాత్రా ఛందస్సుల నిర్వహణలో చెప్పుకోదగినవారు శ్రీ బాపురెడ్డి గారు. అయితే వీరు సంపూర్ణ కావ్యం నిర్వహించకుండా ఖండికల రూపంలోనే తమ కృతులు వెల యించినారు. బాపురెడ్డిగారి ధోరణి రచనలోను, యితి వృత్తాల ఎన్నికలోనూ, కవిత్వం పాడివినిపించడంలోను కూడా డా॥ సి. నారాయణరెడ్డి గారి పద్ధతికి చాలా దగ్గరలో వుంటుంది. అనవరత ప్రభుత్వ సేవా నిర్వహణ మగ్నమనస్కులై వుండి కూడా శ్రీ బాపురెడ్డి గారు కవితా సరస్వతిని ఒక కంట కనిపెడుతూ వుండడం ముదావహమైన విషయము. అంతేకాక పంచపద "ప్రణాళికలు" (అయిదు అయిదు అడుగులు) "అరుకు లోయలో అభ్యుదయం" "పాడేరు పాట" వంటి గేయాలను కూడా వారు వ్రాయగలరు. తమ విధి నిర్వహణలో కనిపించిన అభ్యుదయ దృశ్యాలను యీ విధంగా కవితా రూపంలో తమ అనుభూతి ద్వారా వివరించ బూనడం మెచ్చుకోదగిన ప్రయత్నం. పాడేరు పాటలో-

అటు పక్షులన్ని స్వే
చ్ఛాగానములు చేయ
అచటి గిరిజనము నా
ట్యానందమున దేలు
అచటి విద్యాదేవి
అడుగు పెట్టెను నేడు
వెలుగుతో చీకట్లు
వియ్యమందెను చూడు

అని వర్ణించారు. గిరిజనుల ఆనందమును గురించి చెప్తూ పక్షుల స్వేచ్ఛాగానమును గుర్తు చేయడం, వెలుగు చీకట్లు వియ్యమందినట్లు మనోహర కల్పన చేయడం చేయితిరిగిన కవులు మాత్రమే చేయగల పనులు. "భవిష్యదర్శనం" అనే ఖండికలో యిరవై ఒకటో శతాబ్దంలోని మానవుణ్ణి వర్ణిస్తూ

" దేశముల విభజించు ఎల్లలు
మాసిపోవును అతని చూపుల
మానవుని బాధించు స్వార్థో
న్మాదములు నశియించు నా యెద"

అనే ఆశా భావాన్ని వెల్లడిస్తాడు కవి.

యింకా యీ గ్రంథంలో జవహారులాల్, లాల్‌బహదూర్, గురజాడ ప్రభృతులను గురించిన గేయాలు వున్నవి. దీనికి డా॥ సి. నారాయణరెడ్డి గారు "ఆత్మశ్రుతి" పేరుతో పీఠిక రాశారు. తమకూ రచయితకూ గల అనుబంధం వల్ల ఆత్మశ్రుతి ఆత్మస్తుతిగా పర్యవసించకుండా జాగ్రత్త పడినట్లు కూడా చెప్పారు. ప్రఖ్యాత కవి శ్రీ బోయి భీమన్న గారికి యీ కావ్యం అంకితం చేయబడింది.

## శ్రీ పద్మావతీ పరిణయము

**రచన: రావుల సూర్యనారాయణ మూర్తి**

**మూల్యం : 75 పైసలు**

శ్రీ రావుల సూర్యనారాయణ మూర్తిగారు ఉద్యోగ రీత్యా గత మూడు నాలుగేండ్లకాలంలో తిరుపతిలో వున్నారు. శ్రీ మద్వరాహ పురాణాంతర్గత వేంకటాచల మహాత్మ్యాన్ని చదివిన తర్వాత యీ చిన్నకావ్యం వ్రాసినట్లు చెప్పుకున్నారు. శ్రీ వేంకటాచల స్వామి వారి కల్యాణకథ యిందులో వర్ణిత మైనది. కవిగారి శైలికి ఉదాహరణ

" ఒక మనోజ్ఞ వసంత మహోత్సవమున
మానితంబగు సుందరోద్యాన మందు
కపట మెరుగక చెలులతో కలసి మెలసి
అలరి పద్మిని సల్పె పుష్పాపచయము"

దీనికి ప్రఖ్యాత కవి పండితులు శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి గారు అభిప్రాయం యిచ్చారు.

## వెండి తెర

సినిమా సాహిత్య సాంస్కృతిక పక్ష పత్రిక

**సంపాదకుడు: బి.ఎ.వి. శాండిల్య**

**సంయుక్త సంపాదకుడు: ఏ గోవిందరావు**

అక్టోబరు 1 వ తేదీన వెలువడిన యీ క్రొత్త పత్రిక ప్రారంభ సంచిక ఆకర్షణీయంగా వుంది 8 పేజీలు. వెల 30 పైసలు. శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయ శాస్త్రి గారి "కళా స్రవంతి" శ్రీయుతులు జి. యస్. వరదాచారి, తుర్లపాటి కుటుంబరావు ప్రభృతుల సినిమారంగ వ్యాసాలు, శ్రీ నండూరి విఠల్ వ్రాసిన " పసిడి పసితనం " అనే వచన కవిత యిందులోని ప్రత్యేక ఆకర్షణలు. హైద్రాబాదులో చాలా రోజుల నుండి " సినీజనత " అనే పత్రిక ఒకటి వస్తున్నది. హైద్రాబాదు సినిమా రంగానికి ప్రధాన కేంద్రం కాబోతున్న సమయంలో "వెండి తెర" అనే యీ క్రొత్త సినిమా పత్రికకు స్వాగతం.

స్వీకారం:

వీచికలు (కవితా సంపుటి) ప్రచురణ: యువభారతి, కింగ్స్‌వే, సికిందరాబాదు.

వెల : రూపాయి

- చైతన్య

---

నదీనదాలూ
అడవులు, కొండలు
ఎడారులా మన కడ్డంకి ?

--శ్రీశ్రీ

# నిన్న మిగిలిందేది ?



బి. శ్రీహరి

నిన్న ఏం మిగిలేడ్చిందని
ఈరోజుకు దాచుకొని రేపటికి చెప్పుకోమంటావు ?

నిన్నటిది నిన్ననే మర్చిపోకపోతే
ఈరోజు పూచిన పూల వాసనల మత్తు
మరెప్పటికి దాచుకొని వాసన చూడను ?
నిన్న పుట్టిన నేనేం ఉద్ధరించాను గనుక
రేపు పుట్టబోయే నువ్వు ఉద్ధరిస్తావను కోటానికి !

నీతోపాటు పెరిగిన నీ వయస్సు
తొమ్మిది నెలల పసికందు
పుట్టి భూమ్మీద పడక ముందే
నీతల్లికోగుణ పాఠం నేర్పుతుంది.
అప్పటి నీభావాలను తెలుసు కోవాలని
నాకు వుండదా కడుపులోనిపిండమా___

పుట్టబోయే ముందురోజు జ్ఞాపకాలు
పుట్టి భూమ్మీద పడిన రోజేవి ?
లేవని బల్లగుద్ది మరీచెబుతాను
నీ ఏడుపునే సాక్ష్యం వేసుకొంటాను___

కవిలోకపు కీర్తి పట్టిన గొడుగు కిందకు జేరదామని
మొన్న నే రాసిన కవిత్వాన్ని పండితులకు చూపిస్తే
అబ్బే ! మారిపోయింది వెరైటీ అంటూ
మారిన పొయిట్రీ చూపించి
కనీసం గొడుగు ఆకారం అయినాచూపక
వచ్చిందారినే పంపించేశారు___

సరేగదాఅని ఆరాత్రే మళ్లారాసి
తెల్లారి తంగేడుపూలు పూయకముందే పరుగెట్టుకెళ్ళి
మళ్ళాచూడండని గెడ్డం పట్టుకొంటే
ఎలాగో చదివి యిటీవలి కవిత
సారీ, తెల్లారకముందే
మళ్లీ మారిపోయిందన్నారు
అలా పరిగెడుతున్నకవిత పట్టిన గొడుగుకిందకు జేరటానికి
నిన్నటిదేం పనికొస్తుందని
ఈనాటికి దాచుకొని చెప్పమంటావు ?








ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భంగా
జనసంబంధ శాఖ నవంబరు 1 వ తేదీన
హైదరాబాదులో నిర్వహించిన
బహుభాషా కవిసమ్మేళనంలో
చదివినవి



శ్రీమచ్ఛ్యామల కోమలాంధ్ర ధరణీ సింహాసనాధ్యాసితే !
రాజ్యశ్రీ స్స్మితచంద్రికా ధవళితే ! గోదావరీ కృష్ణయోః
వీచీచామర సేవయా ! విలసితే ! సంతాన రత్నావళీ
సంతోషద్యుతి సంవృతే ! సుమహితే జీయాస్సదా ! మాతృకే !

ధారవోసె నెవండు భారతోద్యమముకై
స్వార్జితంబైన లక్షల ధనమ్ము
బెండొనర్చె నెవండు గుండె జూపి ఫిరంగి
గుండు నాంగ్లుల గుండె గుబుకు మనగ
స్నానమార్చె నెవండు జానపదాత్మ జ్యో
త్స్నాతపత్రాయిత శౌర్యదీప్తి
పారమొందె నెవండపారజన్మాబ్ధి ప్ర
జాసేవ నావగా సంగ్రహించి

ఆ ప్రకాశమునకు తల్లి వన్న ఒక్క
మాటయే చాలు; నీ కీర్తి మూటగట్టి
విసర ఘుమఘుమలాడె దిగ్విసర మెల్ల
ఓ ! మధురితాంధ్ర రాజ్యలక్ష్మమతల్లి !

తల్లీ ! ధీరమహాంధ్ర లోకముల మాతా ! శాంతిహారమ్ము ! రం
జిల్లెన్నీ బలగమ్ము మౌక్తికము లై నీ యింట నాగార్జునా
ఖ్యోల్లోలన్మధురాంబు సాగర ఝురార్ద్రోద్ధార కేదార భూ
ర్ధిల్లీ భోగవరేణ్య ధాన్య సురభశ్రీ జుష్ట మృష్టాన్నముల్.

నీ కష్టించిన యెన్నో యేండ్ల కృషి పండె న్నేడు నీ గడ్డపై
చేకోగల్గిన యెల్ల సంపదలు నీ చిత్తానుసారమ్ముగా
నీకై సద్వినియోగ మౌ నధికృతిన్ సృష్టించికొన్నా వహో !
ఆకొన్నా నని వేడువాడు కనరాడా ! తెల్గువాడా యికన్.

విరిసెనేమో ! గనుల్ తెరలి పొరల్ పొరల్
ప్రకృతి యొత్తిడికి వజ్రముల రాశి
ఎదిగెనేమో ! కల్పవృక్షమ్ము మొలక యే
ధన్యుడో యిడిన విత్తనము నుండి
ఒరగెనేమో ! స్వప్నపరిచిత స్వర్గ ఖం
డము తూలి భరత ఖండమ్ముపైని
మలసెనేమో ! హద్దు వెలయించికొని లక్ష్మి
కాకుళ స్వామి వక్షమ్ము కదలి

అనుపమాన ప్రకాశము నవధరించి
ద్విగుణ సంజీవనమ్మున దృఢమునొంది
అఖిల హృదయ బ్రహ్మానంద మయ్యె నాంధ్ర
రాజ్య మోయి ! పౌరత్వ గర్వప్రదాయి.



ముదిగొండ వీరభద్రమూర్తి

# గాంధీ లక్ష్యాలను ఆచరణలో పెట్టాలి



హైదరాబాదులో అక్టోబరు 2 ఉదయం గాంధీజయంతి ఉత్సవాలు మురికివాడల పారిశుద్ధ్యంతోను ప్రభాత భేరీలతోను ప్రారంభమయ్యాయి. గాంధీ ఉత్సవాల జాతీయసంఘం నగరశాఖ తొమ్మిది గంటల సేపు నిరవధిక సూత్రయజ్ఞాన్ని నిర్వహించింది. శివరామపల్లెలోని సర్వోదయ కేంద్ర కార్యకర్తలు 100 మంది 100 నిమిషాల సేపు శ్రమదానం, సూత్రయజ్ఞం, తదితర నిర్మాణాత్మక కార్యక్రమాలు నిర్వహించారు.

గాంధీజీ శతజయంత్యుత్సవాలు విజయవాడలో పలు తావులలో సూత్రయజ్ఞాలతో అన్నప్రదానాలతో ప్రారంభమయ్యాయి. కేంద్ర నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖమంత్రి డాక్టర్ కె.ఎల్ రావు తదితర ప్రముఖులూ ఈ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. రాష్ట్రం నలుమూలల నుండి ఉత్సవాలు ఘనంగా జరిగినట్లు వార్తలు మా కార్యాలయానికి చేరాయి.

నిజమైన గాంధీ అనుయాయులంగా మన నిత్య జీవితంలో గాంధీ సిద్ధాంతాలను, బోధనలను ఆచరణలో పెట్టడం మనవిధి_ అని కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ నిజలింగప్ప అన్నారు. విజయవాడలో గాంధీకొండ మీద గాంధీ స్మారక గ్రంథాలయానికి అక్టోబరు 6న ప్రారంభోత్సవంచేస్తూ ఈనాడు మానవత్వం మను గడ శాస్త్ర విజ్ఞాన వికాసంవల్ల అటు సర్వనాశనమూ, యిటు నిర్మాణమూ మధ్య ఊగిసలాడుతూ వున్నదని, ఈ తరుణంలో గాంధీజీ బోధనలు ఎంతో విలువైనవని, ప్రయోజనమైనవని ఆయన అన్నారు.

గాంధీకొండ మీద చెట్లను నాటే పథకానికై తన స్వంత విరాళంగా రూ. 250 లను ప్రకటిస్తూ చెట్లను పెంచడంవల్ల యీ కొండ మరింత సుందరంగా కనిపించగలదని, గాంధీజీకి ప్రకృతి పైగల ప్రేమకు యిది చిహ్నంగా వుండగలదని తెలియజేశారు.

ముందుగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి మాట్లాడుతూ గాంధీజీ ఆశయాలను ప్రచారం చేయవలసిందిగా విద్యావంతుల నందరనూ ఆయన కోరారు. గాంధీ శతజయంతి సంవత్సరంలో గ్రామాలకువెళ్ళి హరిజనోద్ధరణ, గ్రామీణ విద్యావ్యాప్తి, పారిశుధ్య పరిస్థితుల అభివృద్ధివంటి గాంధీజీ లక్షించిన కార్యక్రమాలను చేపట్టవలసిందిగా ముఖ్యమంత్రి విద్యార్థులకు, సంఘ సంస్కర్తలకు విజ్ఞప్తి చేశారు. గాంధీకొండ మీద గాంధీ స్మారక నిర్మాణంలో భాగంగా ఏర్పాటు చేయనున్న బాలల రైలుకు రాష్ట్ర ప్రభుత్వం రూ. 20,000లు విరాళం యివ్వనున్నట్టు ముఖ్యమంత్రి ప్రకటించారు. గాంధీ కొండమీద చెట్లను నాటే పథకానికి గాను తమ స్వంత విరాళంగా రూ 1000 లను ముఖ్యమంత్రి ప్రకటించారు.

గాంధీ స్మారకనిధి ఆంధ్రప్రదేశ్ బ్రాంచి అధ్యక్షులు డా॥ జి. ఎస్. మేల్కోటే సభికులకు స్వాగతం చెప్తూ గాంధీ స్మారక నిర్మాణాత్మక కార్యక్రమాలను గూర్చి వివరించారు.

గాంధీ హిల్ సొసైటీ ఉపాధ్యక్షులు, కేంద్ర నీటి పారుదల, విద్యుచ్ఛక్తి మంత్రి డా॥ కె. యల్. రావు వందన సమర్పణ చేస్తూ యీ గాంధీ స్మారక నిర్మాణాల లక్ష్యం గాంధీ సిద్ధాంతాల ప్రచారమూ, బాలలసంక్షేమమూ _ అని అన్నారు రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్, రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు కాకాని వెంకటరత్నం గారలుకూడా హాజరయ్యారు. ★

# నగరంలో....

## వన్యప్రాణి సప్తాహం

వన్యప్రాణులను సంరక్షించాలంటే వేటను చట్టం ద్వారా రాష్ట్రంలో నిషేధించాలని మునిసిపల్ వ్యవహారాల మంత్రి శ్రీ ఎన్. చెంచురామానాయుడు అన్నారు.

14వ వన్యప్రాణి సప్తాహ దినోత్సవసందర్భంగా అక్టోబర్ 7న నెహ్రూజూలాజికల్ పార్కులో ఏర్పాటైన ఒక కార్యక్రమంలో శ్రీ చెంచు రామానాయుడు మాట్లాడుతూ ప్రజల సహకారం లేనిదే ప్రభుత్వం యీ విషయంలో ఎన్ని చట్టాలు చేసినా లాభం వుండబోదని తెలియజేశారు. ఈ వన్యప్రాణి సప్తాహానికి అడవులు, పంచాయతీ రాజ్‌శాఖామంత్రి శ్రీ తోట రామస్వామి ప్రారంభోత్సవం చేస్తూ త్వరలోనే నెహ్రూజూలాజికల్ పార్కుకు తెల్ల పులి రానున్నదని తెలియజేశారు. రాష్ట్రప్రభుత్వం కేంద్రాన్ని ఒక తెల్ల పులిని యివ్వవలసినదిగా కోరినదని, కేంద్రం ఒక తెల్ల పులిని బహూకరించడానికి అంగీకరించిందనీ అన్నారు. వన్యప్రాణి రక్షణకూ, అడవుల పరిరక్షణకూ ప్రజల సహకారాన్ని మంత్రి అర్థించారు. ఈ ఉత్సవాలు యీ ఏడాది గాంధీ శత జయంతి ఉత్సవాలతో కలిసి రావడం ఒక ప్రత్యేకత. ఈ సందర్భంగా పాఠశాల పిల్లలకు చిత్రలేఖన పోటీలను నిర్వహించారు. శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి పోటీలో గెలుపొందిన విద్యార్థులకు బహుమతులను పంపిణీ చేశారు. ఆ తర్వాత ఆమె రైల్వే బోర్డు వారు బహూకరించిన బాలల రైలుకు ప్రారంభోత్సవం చేశారు. ప్రస్తుతం రెండు పెట్టెలతో యీ రైలు నడుస్తున్నది దీనిలో ఒక సారి చుట్టు తిరిగి రావడానికి 50 పైసలు వసూలు చేస్తున్నారు.

## ఖాసా స్మారక సంఘం

భారతమాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు గారు అక్టోబరు 6న తేదీన ద్వారకా హోటల్‌లో ఖాసా స్మారక సంఘానికి ప్రారంభోత్సవం చేశారు. దీనికి శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య గారు అధ్యక్షత వహించారు.

ఈ సంఘం సమావేశకర్త శ్రీ వి. కాశిదాసుగారు, ఈ సంఘ విజయాన్ని కాంక్షిస్తూ భారత రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, డా॥ ఎస్. రాధాకృష్ణన్, ఎ. లక్ష్మణ స్వామి మొదలియార్‌ల వద్దనుంచి వచ్చిన సందేశాలను చదివి వినిపించారు. మద్రాసులో జనవరి నెలలో జయప్రకాశ్ నారాయణ్ ఖాసా స్మారక సంఘానికి ప్రారంభోత్సవం చేశారని ఆయన అన్నారు.

ఖాసా సుబ్బారావుగారు గొప్ప స్వాతంత్ర్య సమరయోధులు. ఆయన పేరున ఒక సంఘం నెలకొల్పడం చాలా సమంజసమని మాజీ ప్రధాన న్యాయమూర్తి పేర్కొన్నారు. ఈ సంఘం ఏర్పాటుకు న్యాయమూర్తి గోపాలరావు ఎగ్బోటే స్వాగతం పలుకుతూ ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవడానికి పత్రికలు, సభావేదికలే సరైన తావులని, ప్రజలకు ప్రజాతంత్ర పరిపాలనలో విద్య గరపే మార్గాలు అవేనని అన్నారు.

సర్వశ్రీ సి. వి. హెచ్ రావు, డి. రామస్వామి. పి. ఆర్. రామచంద్రరావు, పి. వి. రాజగోపాల్ యీ సందర్భంలో ప్రసంగించారు.

ఖాసా సుబ్బారావుగారి రచనలు 'సైడ్ లైట్స్'ను ఒక గ్రంథ రూపంలో యీ సంఘం తీసుకురావడానికి ప్రయత్నించగలదని శ్రీ వి. కాశిదాస్‌గారు తెలియజేశారు.

## డిఫెన్స్ ఎగ్జిబిషన్

రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్, అక్టోబర్ 10న సికింద్రాబాద్ రేస్ కోర్స్ గ్రౌండ్సులో, ఇ. యమ్. ఇ. రజతోత్సవాల ఎగ్జిబిషన్‌కు ప్రారంభోత్సవం చేశారు. బ్రిగేడియర్ సి. యల్ శేషగిరి, ఇ. యమ్. ఇ. మిలిటరీ కాలేజి కమాండెంటుగారలు రాష్ట్రగవర్నరకు స్వాగతం పలికారు.

ఈ ఉత్సవానికి విచ్చేసిన వారిలో మిలిటరీ అధికారులు, వారి కుటుంబాల వారు ఎక్కువ మంది వున్నారు. రేస్‌కోర్సు ప్రాంగణం అందంగా అలంకరించబడి దీపాలంకరణల శోభతో కన్నుల విందు చేసింది.

గవర్నరు ఎగ్జిబిషన్ సందర్శిస్తూ వెళ్ళి, నిరాయుధులైన సైనికులు, తుపాకులు ధరించి పైబడుతున్న సైనికులను ఎదుర్కొని లోబరుచుకొనే విధానం, శత్రువిమానాలను ధ్వంసంచేసే తుపాకీ కాల్పుల విషయాలలో విన్యాసాలను తిలకించారు. వైమానిక రక్షణ పద్ధతి పని చేసే విధానం గమనించడంలో గవర్నరు ఆసక్తిని ప్రదర్శించారు. మన సైనికులచే ధ్వంసం చేయబడి, పట్టుబడిన పాకిస్తాన్‌కు చెందిన పాటన్ టాంకు ఈ ప్రదర్శనలో ప్రత్యేక ఆకర్షణ.



ఆరోగ్య, వైద్యశాఖా మంత్రి శ్రీ ఇబ్రహీం అలీ అన్సారీకి ప్రయివేట్ మెడికల్ ప్రాక్టీషనర్ల మండలి ఏర్పాటుచేసిన అభినందనసభ.

# ముఖపత్రం



విజయవాడలో అక్టోబరు 6 న గాంధీ స్థూపానికి ప్రారంభోత్సవం చేస్తున్న రాష్ట్రపతి

## రాష్ట్రపతిచే విజయవాడలో గాంధీ స్థూపం ఆవిష్కరణ

భారత రాష్ట్రపతి డా॥ జాకిర్ హుసేన్ అక్టోబరు 6 వ తేదీన విజయవాడ నగరం మధ్యగల గాంధీ కొండమీద 52 అడుగుల ఎత్తయిన గాంధీ స్మారక స్తంభాన్ని ఆవిష్కరించారు. ఈ సందర్భంలో ప్రసంగిస్తూ, గాంధీజీ ప్రబోధించిన అపూర్వ బోధనలను చిత్తశుద్ధితో అనుసరించి, వాటికై మనం పాటుపడినప్పుడే యీనాడు ఎదుర్కొంటున్న సమస్యలను తప్పక అధిగమించ గలం. ఒక సుందర భవిష్యత్తును నిర్మించుకోగలం -అని అన్నారు రాష్ట్రపతి.

ఈ స్థూపం అందం, ఠీవి తనను ఎంతగానో ఆకర్షించిందనీ ఉప్పు సత్యాగ్రహోద్యమ సమయంలో దండయాత్ర చేస్తున్న విధంగా గాంధీజీ యిక్కడ దర్శనీయ మౌతున్నారనీ, స్వరాజ్య సంపాదనకై అనవరతమూ ఆయన పురోగమించిన విధంగానే ముందుకు పురోగమిస్తూ ఆయన కనిపిస్తున్నారనీ రాష్ట్రపతి పేర్కొన్నారు.

### త్రివర్ణ పతాక నిర్మాత

విజయవాడ పట్టణం భారత స్వాతంత్ర్య పోరాటంలో వహించిన ప్రముఖ పాత్ర దృష్ట్యా, యిక్కడ గాంధీజీ స్మారక చిహ్నాన్ని నెలకొల్పడం ఎంతయినా సమంజస మైనదని రాష్ట్రపతి పేర్కొన్నారు. పైగా శ్రీ పింగళి వెంకయ్యగారు రూపొందించిన కాంగ్రెసు త్రివర్ణ పతాకాన్ని ఆమోదించినది కూడా యీ విజయవాడలో జరిగిన సమావేశంలోనేనని ఆయన జ్ఞప్తికి తెచ్చారు. పంచాయతీలను నిర్వహించాలని, మద్యపానాన్ని నిర్మూలించాలని నిర్ణయించిన రోజుల్లో గ్రామీణ ప్రజల పునఃప్రాభవ కల్పనకూ, పట్టణాలలోని పేద కార్మికుల అభ్యుదయానికీ అంతకుముందెన్నడూ జరగనంత పెద్దఎత్తున ఉద్యమాలు విజయవాడలో ప్రారంభించబడ్డాయని రాష్ట్రపతి పేర్కొన్నారు.

# జిల్లాలనుండి



అక్టోబరు 9 న మహబూబ్ నగర్ జిల్లాలోని పంవెల్లిట గ్రామస్థులతో కరువు పరిస్థితులను చర్చిస్తున్న ముఖ్యమంత్రి)

## గుంటూరులో మహిళా పాలిటెక్నిక్ కళాశాలకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం

గుంటూరులో అక్టోబరు 7న ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్ కళాశాలకు ప్రారంభోత్సవం చేశారు. ఈ ఉత్సవానికి విద్యాశాఖా మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు అధ్యక్షతవహించారు. రాష్ట్రంలో వున్న ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్ కళాశాలల విద్యార్థినులు ట్యూషన్ ఫీజు చెల్లించ నక్కరలేదు. 50 శాతం విద్యార్థినులకు రాష్ట్ర ప్రభుత్వం నెలకు 50 రూ. చొప్పున స్టయిఫండుయిస్తున్నది.

## వరంగల్లులో కొత్త కళాశాల

విద్యాశాఖా మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు సెప్టెంబరు 19న వరంగల్లులో శ్రీ చందా కాంతయ్య స్మారక ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాలకు ప్రారంభోత్సవం చేశారు.

## మత్స్య క్షేత్రానికి ప్రారంభోత్సవం

కొత్తపేటలో అక్టోబరు 2న ప్రభుత్వప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. టి. రాజు, కౌశిక ప్రాంతీయ మత్స్య ఫలాభివృద్ధి పథకానికి ప్రారంభోత్సవం చేశారు. లక్ష రూపాయలు ఖర్చుయ్యే యీ పథకాన్ని తూర్పు గోదావరి జిల్లా అభివృద్ధి మండలి చేపట్టింది.

## గ్రామీణ రేడియో గోష్ఠికి ట్రాన్సిస్టర్ బహూకరణ

హైదరాబాదుజిల్లా కలెక్టరు శ్రీ శ్రావణ కుమార్ ఇటీవల గొల్ల పోచంపల్లి గ్రామీణ రేడియోగోష్ఠి అధ్యక్షుడు శ్రీ కె. వి. రెడ్డికి ఆ గ్రామీణ రేడియోగోష్ఠి సాధించిన విజయానికి చిహ్నంగా ఒక ట్రాన్సిస్టర్‌ను బహూకరించారు. ఈగోష్ఠి 1960లో ఏర్పాటు చేయబడింది. 1963_64 కాలంలో ఈ గ్రామీణ రేడియోగోష్ఠి మొత్తం జిల్లాలోనే ఉత్తమగోష్ఠిగా నిర్ణయించబడింది. దీనికి అంద జేసిన ట్రాన్సిస్టరు ఒక కెనెడియన్ రంనుండి బహుమతిగా లభించింది.

## పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం

పశ్చిమ గోదావరికి చెందిన గణపవరం పంచాయతీ సమితి అధ్యక్షుడు చనమల్లిలో పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు. ఈభవనం రూ 16,000ల ఖర్చుతో నిర్మించబడింది. దీనిలో 8,000 రూపాయలను సమితి యిచ్చింది. రూ 4000 లను శ్రీ పెరు శ్శమ శేషావతారం విరాళంగా యిచ్చారు మిగిలిన మొత్తాన్ని గ్రామస్థులు విరాళంగాయిచ్చారు.

## నెల్లూరు జిల్లాలో భూముల పంపిణీ

నెల్లూరు జిల్లాలో హరిజనులకు పంపిణీ చేయబడిన భూమి 397 ఎకరాలు, గిరిజనులకు పంపిణీఅయిన భూమి 1,120 ఎకరాలు వుంది. పదుగుపాడు గ్రామంలో 42 ఎకరాల ప్రాంతంలో గిరిజనుల గృహనిర్మాణ పథకం ఒకటి ప్రారంభించబడింది. ఈ ఏనాడి గృహ నిర్మాణాలకుగాను సుమారు 32 ఎకరాల భూమి పంపిణీ అయ్యింది.

## కరువు నివారణ చర్యలు

అక్టోబరు, నవంబరునెలల్లో వరంగల్లు జిల్లాలో కరువు నివారణ చర్యలను చేపట్టే నిమిత్తం రూ 22.28 లక్షలు మంజూరు చేయడం జరిగింది. దీనిలో 8 లక్షల రూపాయలు ఆవత్కాల తక్కావీ ఋణాలుగా మంజూరు చేయబడినవి. మరో ఎనిమిది



రెవిన్యూ మంత్రి శ్రీ వి. బి. రాజు, దుర్భిక్ష ప్రాంతాల పర్యటన సందర్భంగా కడప జిల్లా, జమ్మలమడుగు పంచాయతీ సమితిలో ప్రసంగిస్తున్న దృశ్యం

లక్షల రూపాయలు చిన్ననీటి వనరుల నిమిత్తం, 2 లక్షల రూపాయలు మంచినీటి బావుల నిమిత్తం, లక్ష రూపాయలు రోడ్ల పనుల నిమిత్తం, 2.13 లక్షల రూపాయలు విత్తనాల సరఫరా నిమిత్తం. 90 వేల రూపాయలు భూసార పరిరక్షణ చర్యలనిమిత్తం 25వేల రూపాయలు అడవుల పెంపకం నిమిత్తం కేటాయించబడినవి,

## కుటుంబ నియంత్రణ శిబిరం

సాలూరులో సెప్టెంబరు 27న 130 వెసక్టమీ ఆపరేషను జరిగాయి. శ్రీ కాకుళంలోని జనసంబంధశాఖ ఏర్పాటు చేసిన కుటుంబనియంత్రణ శిబిరంలో యీ ఆపరేషన్లు నిర్వర్తించబడ్డాయి.

## శ్రీకాకుళంలో మహిళాకళాశాల

సెప్టెంబరు 25 న రాష్ట్ర సాంఘిక సంక్షేమశాఖ మంత్రి శ్రీ అరిగె రామస్వామి శ్రీ కాకుళంలోని మహిళా కళాశాలకు ప్రారంభోత్సవం చేశారు.

## తోటపల్లి హైస్కూలుకు ప్రారంభోత్సవం

ఇటీవల శ్రీకాకుళం జిల్లా కలెక్టరు శ్రీ బి.ఆర్.కె. శాస్త్రి పరిషత్తు హైస్కూలుకు ప్రారంభోత్సవం చేశారు. సభకు జిల్లా పరిషత్తు చైర్మన్ శ్రీ బి శ్రీరాములు నాయుడు అధ్యక్షత వహించారు. శాసన సభ్యులు శ్రీ ఎమ్. పరాంకుశం ఆ సందర్భంలో ప్రసంగించారు.

## టపాతోపు గ్రామానికి విద్యుచ్ఛక్తి

నెల్లూరుజిల్లా కోవూరు సమితికి చెందిన ఉత్తరరాజుపాలెం పంచాయతీలోని " టపాతోపు " గ్రామం లో రు. 46 వేల ఖర్చుతో పూర్తి చేసిన విద్యుదీప ప్రసారస్కీముకు సెప్టెంబరు 24 న ప్రారంభోత్సవం జరిగింది.



హైదరాబాదు జిల్లాలోని చేవెళ్ళలో అక్టోబరు 13 న గ్రామస్థులతో కరువు పరిస్థితులను గూర్చి చర్చిస్తున్న రెవిన్యూ మంత్రి శ్రీ వి. బి. రాజు.

---

## ఈ సంచికలోని రచయితలు

శ్రీ సి. వి. హెచ్. రావు, జర్నలిస్టు, హైదరాబాదు
శ్రీ పి. శేషాద్రి, లెక్చరర్, న్యాయశాస్త్ర సాయంకళాశాల, హైదరాబాదు
శ్రీ వెలగా వెంకటప్పయ్య, లైబ్రేరియన్, బాపట్ల
శ్రీ వి. నాగరాజన్, సూపర్ బజార్, హైదరాబాదు
కుమారి వాసిరెడ్డి సీతాదేవి, ప్రకాశ్ నగర్, హైదరాబాదు
శ్రీ టి. రాజగోపాలన్, హైదరాబాదు
శ్రీ త్రిపురనేని సుబ్బారావు, మలకపేట, హైదరాబాదు
శ్రీ పిలకా గణపతి శాస్త్రి, మద్రాసు
శ్రీ ఆచంట జానకిరామ్, తిరుపతి
శ్రీ పాలెపు నరసింహం, వెలమపాలెం, తూ॥ గోదావరి జిల్లా
శ్రీమతి కమలా త్రివేణి, హైదరాబాదు
కుమారి దౌలత్ బేగం, హైదరాబాదు
శ్రీ వి. ఎల్. సుందరరావు, హైదరాబాదు
శ్రీ కల్యాణసింగ్, తెలుగు భాషా సమితి, హైదరాబాదు
శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, విద్యాశాఖ కార్యాలయం, హైదరాబాదు

---

ప్రచురణ : జనసంబంధశాఖ సంచాలకుడు
ముద్రణ : డైరక్టరు, ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయము, హైదరాబాదు.

